# ఆంధ్ర హరికథా వాఙ్మయము

వాసరేవు సీతారామాంజనేయ భాగవతార్ B. A.
నెల్లూరు.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడెమీ సాయమున
ముద్రితము.
1976

ప్రథమ ముద్రణము డిశంబరు 1976


పుస్తకములకు :—

వాడరేవు సీతారామాంజనేయ భాగవతారు బి. ఎ.
డోరు నెం. 20-91
స్టీలుఫ్యాక్టరీవద్ద
బాలాజినగరు, నెల్లూరు-2.

వెల రు. 10/—

ముద్రణము:-
కమలాంబికప్రెస్.
నెల్లూరు.

శ్రీరామాయనమః

# విన్నపము

భాషాపటిమగాని పాండిత్య ప్రతిభగాని లేని నేనీ చరిత్రమును వ్రాయబూనుట సాహసమే. అయినను ఏదోకొంత చదువుకొన్నవాడినని హరిదాసుడనని యెంచి ఆంధ్రప్రదేశ్ సాహిత్యకాడమి సభ్యులు శ్రీ బడి గురవారెడ్డిగారు నన్ను ప్రోత్సహించినారు. భగవత్ప్రేరణచే నాకీ సదవకాశము లభించినది ఇందు 20 యక్షగానములను 2 బుర్రకథలను 101 హరికథలను పరిశీలించుట జరిగినది. ఆంధ్రలో ప్రఖ్యాతి వహించి ప్రచారములోనున్న కవుల గ్రంథముల నన్నింటిని పరిశోధించితిని. వ్యావహారికభాష ననుసరించితిని. ఈ గ్రంధరచనకు తోడ్పడిన గ్రంథకర్తలకు గ్రంథాలయాధికార్లకు, గ్రంథాలయోద్యోగులకు శ్రీ బడి గురవారెడ్డి గారికి ముఖ్యముగా ముద్రణకు ఆర్థిక సహాయమొనరించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్యకాడమికి, దాని అధ్యక్షులు మ. రా. శ్రీ. బెజవాడ గోపాలరెడ్డి గారికిన్నీ నాహృదయపూర్వక కృతజ్ఞతాభి వందనములర్పించు కొనుచున్నాను.

సీ॥ సింహంబు రీతిగా। సింహపురి జనుల
మనలెడి యభినవ। మనుమసిద్ధి
గంభీరుడయ్యును। కవులకు మాత్రము
కరుణజూపుచునుండు। కల్పతరువు
రాజకీయములందు। రాయబారమెనుండి
సాహిత్యమున నుండు। చతురమతిగ
సాహిత్యకాడమి। సరి భువన విజయం
బేదు దానికి మన। రెడ్డిగారె

ప్రథమ
సర్వప



నాతలిదండ్రులు భద్రాద్రియాత్ర చేసివచ్చిన పిదప నేను జన్మించితినట. బాల్యము నుండియు నాకు కళలన్న యభిలాషమెండు. పండితులైన రామాయణం సీతాపతి మైనంపాటి నరసింగరావు భాగవతార్ల పరిసరము పరిచయము నాకు బాల్యములో లభించి యుండెను. అన్నికళలయందు ప్రవేశమున్నదిగానీ ఆరితేరిన కళమాత్ర మొక్కటియులేదు. అందులకు కారణము నాప్రాప్తము దైవనిర్ణయము. 1939లో స్కూలుచదువు ఎనిమిదవ తరగతితో ముగిసినది. 1951లో ఉపాధ్యాయవృత్తిలో ప్రవేశించితిని. అప్పటినుండియే హరికథలు చెప్పుచుంటిని. స్వయంకృషితో ప్రయివేటుగా చదివి బి. ఎ. పరీక్షలో కృతార్థుడ నయితిని. నాజీవితనావ ఇతరుల ప్రోత్సాహమును బట్టి పయనించు చున్నది. వైణిక విద్వాంసుడు రావినూతల రంగారావుగారి ప్రోత్సాహమువలన హరికథలు నేర్చితిని. పోలంరాజు సీతారామభాగవతారుగారు నాకు రెండుకథలనునేర్పిరి. ఎల్లాయపాలెంలో మహాభారత హరికథాకాలక్షేపమొనర్చిన సందర్భమున ఆలంపల్లి వెంకటేశ్వర్లుగారి ప్రోత్సాహమున 16-4-1955 నేటి హరికథా విశారద యను బిరుదు లభించినది. ఆకిరి శంకరయ్యగారి సంపదలత్నముల వద్యాశీర్వచనము జరిగినది. ధూర్జటి జానకిరామయ్యగారి ప్రోత్సాహమున నెల్లూరులో రామాయణం హరికథాగాన సందర్భమున 28-1-1962 తేదీన వరనకవి మోచర్ల రామక్రిష్ణయ్యగారు మరియు మహాకవి కోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారల సమక్షమున ఎండోమెంటుబోర్డు డిప్యూటికమిషనరు శ్రీ నంద గోపాలరెడ్డిగారి ద్వారా సువర్ణ హస్త ఘంటాకంకణ ప్రదానము జరిగినది. నెల్లూరు ఫ్రండ్సుయూనియన్ నిర్వాహకుడు ఆర్. వెంకటరెడ్డిగారి ప్రోత్సాహమున నేనొకనటకుడనని యనిపించుకొంటిని. బిరి గురవారెడ్డిగారి ప్రోత్సాహమున ఈహరికథా వాఙ్మయమును వ్రాసితిని. నాప్రథమ హరికథాకాలక్షేపం కేంద్రమంత్రి .వల్లభాయి పటేల్‌గారి మరణ రోజున సాను భూతిగా ఒంగోలు త్యాగరాజు మందిరమున పాంచాలవరపు ప్రసాదరావుగారి

ద్వారా జరిగినది. ప్రథమ పద్యకవిత పండితారాధ్యుల సాంబమూర్తి భాగవతార్‌గారి త్యాగరాజోత్సవముల ప్రశంసించుటకు జరిగినది. నెల్లూరు గూడూరు మద్రాసు గోవిందప్పనాయకవీధిలో జరిగిన భారతహరికథలు బాగుగా జరిగినవి. బెంగుళూరు చింతామణి సిద్దగట్ట ఆదోని కడప కర్నూలు అనంతపురం ప్రొద్దుటూరు గుంటూరు బాపట్ల చీరాల తిరుపతి మొదలగుచోట్ల కథా కాలక్షేపములు గావించితిని.

అందరికిని వందనములు.

ఇట్లు
రచయిత
వాడరేవు సీతారామాంజనేయ
భాగవతారు బి. ఎ.

26-1-77
నెల్లూరు



VI

ఓం

## శుభాశంస పత్రిక

శ్రీయుతులు వాడరేవు సీతారామాంజనేయులు గారు రచించిన "ఆంధ్ర హరికథా వాఙ్మయ చరిత్రము" అను పరిశోధన గ్రంథమును చదివితిని. ఉపాధ్యాయవృత్తి నెఱపుచు అనుబంధ వృత్తిగ హరికథా గానమును చక్కగా నిర్వహించుచు ఉభయ తారకముగ జీవనమును గడుపు వీరికి ఇట్టి గ్రంథ రచనకు సహజముగనే అధికారము అనుకూల్యము కూడినవి.

'హరికథ' నేటి సమాజమున అత్యంత ప్రజాప్రియమైన ప్రక్రియ ఆబాలగోపాలము ఆనందించుటకు ఆకర్షకమైన గాన వాద్య నృత్య అభినయాదుల సుందర సమ్మేళనమున కిందు ప్రమేయము గలిగి జనరంజకమైన నాటకీయతాగుణముతో ఏకపాత్రాభినయముగా సాగు జనపదన ఫలితమైన కథాకాలక్షేపముయొక్క పుట్టుపూర్వోత్తరములను పరిశోధించి, అనేక గ్రంథముల నవలోకించి పండితుల ననేకులను సంప్రదించి తన అనుభవము నందులోరంగరించి చేసిన కృషిఫలితమే వీరి ఈగ్రంథము.

ఇంతవరకు వెలుగులోనికి రాని "గోపాలకృష్ణ విలాసము" (క్రొత్తపల్లి వారిరచన) వంటి యక్షగానములను గూడ వీరు పేర్కొనియున్నారు. ఇట్టివాంధ్రదేశమున నింకెన్నికలవో! శ్రీత్యాగరాజస్వామి వారి "ప్రహ్లాద భక్తవిజయము" నౌకా చరిత్రము గూడ యక్షగానములై హరికథా గానమున కత్యంతఅనుకూలములై యున్న గ్రంథములు.

ఇట్టి జనప్రీతికరమైన ప్రక్రియ హరికథ. ఈవిషయమున ఒక చక్కని చరిత్ర గ్రంథమును వెలయించిన శ్రీసీతారామాంజనేయ భాగవతార్ గారు అభినందనీయులు. వీరి కృషి ప్రజాదరణ పొందగలదు.

సర్వేశ్వరుడింకను వీరిచే నిట్టిగ్రంథములు రచింప జేయుగాక!

ఇట్లు
బుధజన విధేయుడు
ఇలపావులూరి రామేశ్వరరావు,
M. A. B. Ed.
తెలుగు లెక్చరర్ గవర్నమెంటు ట్రయినింగు కాలేజి.

నెల్లూరు
27–12–1976



# అభిప్రాయము

హరికథల చరిత్ర వ్రాయుటకు కేవలము సాహిత్య పరిశీలన మొక్కటియే చాలదు. స్వయముగా కథకుడైయుండిననే యాకార్యము నిర్వహింపగలడు. శ్రీయుతులు వాదరేవు సీతారామాంజనేయులు గారు పండితుఁడు, కథకుఁడు నగుటచే నిట్టిసాహసోపేతమైన యీకార్యమునకు బూని కృతకృత్యుఁడుకాఁగలిగెను.

శ్రీసీతారామాంజనేయులు గారీగ్రంథమును వ్రాయుటకు నేర్పఱచు కొన్న ప్రణాళిక చక్కగానున్నది. హరికథకు వీరు చేసిన నిర్వచనము సర్వవిధముల యుక్తియుక్తముగా నున్నది. వీరు యక్షగానముల చరిత్రను సంక్షిప్తముగా దెలిపి హరికథలు, వానిలోని భేదమే యనినిరూపించిన విధము సముచితముగా నున్నది. అధ్యాత్మ రామాయణ కీర్తనలు తొలి హరికథ యనిచెప్పెడివారి వాదనను ఖండించి హరికథలరచనారీతులను సోదాహరణముగా వివరించిరి. వీరు వ్యయప్రయాసములకోర్చి యీగ్రంథ మును తయారుచేసినందుకు వీరెంతయో శ్లాఘనీయులు.

ఉత్తమకథకుని లక్షణములను శీర్షికను ప్రతికథకుడును తప్పక చదువ వలయును. ఊరక చదువుటయేగాక వానిలో నన్నింటిని గాకపోయినను గొన్నింటినైనను సాధించిననే యుత్తమ కథకుండు కాగల్గును.

ఆంధ్రవాఙ్మయ చరిత్రలో హరికథల చరిత్రలేనిలోపము దీర్చిన శ్రీసీతారామాంజనేయులు గారికి తెలుగుజాతి కృతజ్ఞతల నర్పింప వలసి యున్నది.

పదాల రామమూర్తి. ఎం. ఎ.
రిటైర్డు. కావలి జిల్లాపరిషత్తు హైస్కూలు
తెలుగు పండితుడు.

కావలి
1-11-1976.

## పరిచయము

మిత్రులు శ్రీవాడరేవు సీతా రామాంజనేయ భాగవతారు గారు నెల్లూరు మండలములో ఉపాధ్యాయవృత్తియందుండి ఆంధ్రభాష నభిమాన దేవతగా నారాధించుచు ప్రస్తుతము "ఆంధ్ర హరికథా వాఙ్మయము" అను వివరణాత్మకము, విమర్శనాత్మకము నైన వచనగ్రంధమును సంతరించినారు ఈరచయిత కార్యదీక్షాపరుడు, ఉత్సాహవంతుడు. సాహిత్యజ్ఞాన పిపాసి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమివారు హరికథా వాఙ్మయముపై విమర్శ నాత్మక గ్రంధమును వ్రాసినవారికి పారితోషికము నిత్తుమని ప్రకటించిన సందర్భమున నేను నావిద్యుక్త ధర్మముగా అట్టి రచనకు పూనుకొనవలసినదిగా హరికథకులైన పండితులకు తెలిపి వారిని ప్రోత్సహించితిని. అట్లే వీరిని గూడ వ్రాయమని కోరితిని. ఇతరులెవ్వరు మనమండలములో సాహసింప లేదు. ఈకవి నామాటను గురుత్వముగా స్వీకరించి హరికథా వాఙ్మయ సాగరమును మథించి చక్కని గ్రంధమువ్రాసి ఆంధ్రావనికి అమృత కలశము నందించినాడు.

ఈహరికథావాఙ్మయ వచనగ్రంధమును నేను అమూలాగ్రముగ చదివితిని. ఈవిద్వత్కవి తనశక్తికి మించిన ఘనకార్యమును ఈగ్రంధ రూపములో నిర్వహించినందులకు నేను హృదయ పూర్వకముగా అభి నందించు చున్నాను. హరికథకున నుండవలసిన నీతి నిజాయితీలు, భక్తి విధేయతలు ఈరచయితలో నున్నవని నాకు చక్కగా గోచరించినది. నిజముగా ఈతడు సార్ధక నామధేయుడు.

ఈరచయిత పదునెనిమిదవ శతాబ్దమునుండి నేటివరకు "ఆంధ్ర హరికథా వాఙ్మయము" ఏయేరూపములలో ఏయే విధముగా పరిణమించుచు, ఎట్లుఅభ్యుదయ పరంపరలతో అభివృద్ధి చెందుచు వచ్చినదో, ఏయే మహామ భావు లెంతవరకు ఈవాఙ్మయ రంగములో కృషి సలుపుచు వచ్చినారో

మనకీగ్రంథము ద్వారాపరిచయము గావించినారు. చరిత్ర కారుడు వ్రాయు చరిత్రకంటే తత్సంబంధము గలవాడు అనుభవ పూర్వకముగా వ్రాయు చరిత్రలోనే యథార్థత గోచరింప నుండును. ఈచరిత్రగూడ అట్లే యున్నది. తెలుగుభారతము నెవరేదృష్టితో చూచిన అట్లేకన్పించు చుండునని ఆదికవి నన్నయగారన్నట్లు ఈహారికథావాఙ్మయముగూడ పలు రీతులలో శోభిల్లుచున్నది.

ఇక భాషావిషయమున వీరి వచన రచన బహుసుందరముగా నుండి సులభముగా నర్థమగురీతిన జాలువారుచుండును. ఈహారికథా వాఙ్మయ గ్రంథము మధురశయ్యా బంధము. 'కవులకు గద్యము గీటురాయి' అని దండిపండితుని యాభాణకము, దానికి దగినట్లుగా ఈభాగవతారు గారు సంతరించిన వచనశ్రేణి మంచి ముత్యపు వెలుగులలో నడచినది. వీరివచన రచన చదివిన కొలది చవులు పుట్టించు చుండును. మృదుమధురమైన జాను తెలుగు దనము వీరిరచనలో పరవళ్ళు త్రొక్కుచున్నది. ఇంతటి వచనశయ్యా మాధురీ మార్దవములకు తావలమై వచన వాఙ్మయమునకు వన్నెను తెచ్చు చున్నది

హృదయములోని ఉద్వేగమును కలములో కన్పింప జేయుటలో మన ఆంజనేయ భాగవతారు గారు అందెవేసిన చేయి. అందులకీ గ్రంథమునుండి అనేక ఉదాహరణములను చూపింప వచ్చును. వ్యాసవిస్తరణ భీతిచే అందుకు పూనుకొననైతిని. మననెల్లూరి హరిహరనాథుడీ ఆంజనేయ భాగవతారుగారికి ఆయురారోగ్య విభవములను ప్రసాదింపవలయునని హృదయ పూర్వకముగా ప్రార్థించు చున్నాను.

భవదీయుడు

విద్వాన్ శ్రీ బడి గురవారెడ్డి

(ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి సభ్యులు

శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటి బోర్డు ఆఫ్ స్టడీస్ సభ్యులు)

నెల్లూరు

14-1-1977

# అభినందన

సంఘమున ధార్మికజీవితము నెలకొనఁజేయుటకుఁ గావలసిన పరమార్థ ప్రబోధము ప్రసాదించుటకేకాదు ఆనందప్రదములైన సాహిత్య సంగీతములతో ప్రజలను రంజింపఁజేయు హరికథాప్రక్రియవంటి సారస్వత సాధనము మఱియొక్కటిలేదు. అమూల్యమైన ఆంధ్రదేశీయ హరికథా వాఙ్మయచరిత్రమును సంతరించిన యీగ్రంథకర్త శ్రీవాడరేవు సీతారామాంజనేయభాగవతారును ఈగ్రంథమును వెలుఁగులోనికిందెచ్చిన ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడెమీపాలకవర్గమును నేను హృదయపూర్వకముగా అభినందించుచున్నాను.

మోచర్ల రామకృష్ణకవి.

నెల్లూరు
అత్తితోట అగ్రహారము
24-1-1977



# వి ష య సూ చి క


| | | పేజి |
|---|---|---|
| ప్రారంభము | — | 1 |
| హరికథ | — | 9 |
| యక్షగానము | — | 11 |
| గేయప్రబంధము | — | 14 |
| హరికథ - కళ | — | 15 |
| హరికథ - భక్తి | — | 16 |
| హరికథ - దేశకవిత | — | 17 |
| హరికథ యననేమి ? | — | 20 |
| హరికథారచన | — | 25 |
| రచన - విషయము | — | 27 |
| వర్ణనలు | — | 32 |
| హరికథ - వస్తుసంగ్రహము<br>యక్షగాన ,, | — | 33 |
| హరిదాసు | — | 44 |
| హరికథకుడు | — | 47 |
| భాగవతార్ | — | 49 |
| భాగవతారిణి | — | 51 |
| హరికథ వ్యాపారమా ? | — | 51 |

ప్రఖ్యాత హరిదాసులు — 54
హరికథ - నేటిస్థితి — 59
హరికథ - పరిసరము — 60
రచనలయవసరము — 61
యక్షగానము - హరికథకుగల సామ్యభేదములు — 62
హరికథల విభజన — 69
హరికథలు చెప్పుసందర్భములు — 73
హరికథ - శైలి — 73
బహుళ గ్రంధకర్తలు — 74
నేటి హరిదాసు లక్షణములు — 75
గ్రంధపరిశీలన అధ్యాత్మ రామాయణం — 77
యక్షగానములు — 81
హరికథా కవుల కాలపట్టిక — 96
గ్రంధపరిశీలన హరికథలు — 101
ముగింపు — 201
తోడ్పడినగ్రంధములు — 206
కాలపట్టిక — 208
తప్పొప్పులపట్టిక — 209

ఓం.

# ఆంధ్ర హరికథా వాఙ్మయము.

హరికథ యనగా మానవుని పాపము హరింప జేయునట్టి కథ యని భావింప వచ్చును. అది విష్ణుకథ గావచ్చును లేక శివునికథ గావచ్చును మఱి యేకథయైనను గావచ్చును. ఆకథ యొక్క ముఖ్య ప్రయోజనము పాపమును హరింప జేయుట యని క్రీ. శ. 1775 ప్రాంతమున నృసింహ కవి రచించిన కృష్ణశతక మందలి ఈక్రింది పద్యము తెలుపుచున్నది.

క॥ హరి యను రెండక్షరములు
హరి యించును పాతకంబు అంబుజ నాభా
హరి నీనామ మహత్త్వము
హరిహరి పొగడంగ వశమె హరి శ్రీకృష్ణా॥

ప్రారంభము:-

తెలుఁగు దేశములో మొదటి హరికథ క్రీ. శ. 1760 సంవత్సరమున శ్రీ మునిపల్లె సుబ్రహ్మణ్య కవిగారు రచించిన అధ్యాత్మ రామాయణ మని చెప్పవచ్చునని శ్రీ బాలాంత్రపు రజనీ కాంతారావుగారు తమ ఆంధ్ర వాగ్గేయ కారకుల చరిత్రలో తెలిపియుండిరి. తెలుఁగులో దేశికవితను రచించి సాహిత్య అకాడమి బహుమతి పొందిన R. V. S. సుందరంగారు గూడ అధ్యాత్మ రామాయణమే మొదటి హరికథ అయియుండవచ్చు ననిరి.

హరికథ ప్రధానోద్దేశము భక్తి ప్రబోధము. నీతి జ్ఞాన వైరాగ్య ప్రబోధములు ఉపరి యుద్దేశములు. ముందు ఇట్టి హరికథ పుట్టిన దెప్పుడో పరిశీలించుట యుచితము.

పోతన గారి భాగవతములో నైమిశారణ్యమున సత్రి యాగ సందర్భమున శౌనకాది మునులు సూత మహామునిని హరికథలు చెప్పుడని యడిగినట్లు వ్రాయబడి యున్నది. దీనిని యాధారము జేసికొని కొందరు పెద్దలు హరి కథలు పూర్వమునుండి మనదేశమున వాడుకలో నున్నవే యని యభిప్రాయ పడిరి. ఈ యభిప్రాయము సరిగావని తలంచెదను. కారణమేమనగా భాగవతములో మునులు వినగోరినది విష్ణుకథలనబడు హరికథలు. కాని ఇచ్చట మనము చర్చించునది తాళ మృదంగాది వాద్యములతో గూడుకొన్న హరికథ యను ఒక రచనా ప్రక్రియ.

హరికథ పూర్వము తెలుగుదేశమున లేదనియు అది మహారాష్ట్రము నుండి మన దేశమునకు వచ్చినదనియు కొందరు పెద్దల వలన తెలియుచున్నది. శివాజి ప్రభుని కాలమందు సమర్థ రామదాస స్వామి గారి వలన హరికథలు ప్రచారమునకు వచ్చినవి. మహారాష్ట్రంలో మోరోపంతు, వామన పండితుడు, తుకోబాయను వారలుగూడ మహారాష్ట్రమున కవులును కథకులును అయి యుండిరి. సమర్థ రామదాస స్వామి దాసబోధ యను గ్రంథమును రచించెను. అందు వారు హరికథకున కుత్తమగతి యప్రయత్నముగ లభించునని నుడివిరి. తుకోబా అభంగములను గేయముల రచించెను. తెలుగులో వాఙ్మయ చరిత్ర కారులు, ద్విపద, జానపద, గేయ, దండక, శతక, నాటక, యక్షగానములను వాఙ్మయ భాగములను చర్చించి యుండిరే గాని యక్షగానమును బోలిన హరికథా వాఙ్మయమును గూర్చి ఇంతవరకు ఏపరిశోధకుడును చర్చించినట్లు కనబడుటలేదు. హరికథ యను దేశిరచన యక్షగానము తరువాత నుద్భవించినదే యని నమ్మవలసి యుండును. ఇప్పుడు హరికథ ఎట్లుపయోగ పడుచున్నదో పూర్వము యక్షగాన మట్లుపయోగపడుచుండెనని గ్రంథరచనా శైలిని బట్టియే విదిత మగుచున్నది.

దక్షిణాంధ్ర దేశమునకు హరికథా సంప్రదాయము మహారాష్ట్రము నుండి వచ్చిన దందురు. కానీ అందుకు భిన్నముగా దండు వెంకురెడ్డి రచించిన శ్రీకాళహస్తి మాహాత్మ్యమను హ రి క థా గ్రంథమున ప్రవేశిక వ్రాసిన గుంటూరు హిందూ కళాశాలాంధ్రోపన్యాసకులు శ్రీ పిల్లలమఱ్ఱి వెంకట హనుమంతరావుగారు హరికథ మనలనుండియే మహారాష్ట్ర మండలమున కేగినదని గుర్తించుట యవసరమని పలికిరి.

బాలాంత్రపు రజనీ కాంతారావుగారు తమ ఆంధ్ర వాగ్గేయ కారకుల చరిత్రలో హరికథారంభదశను గూర్చి యిట్లనిరి.

మహారాష్ట్రదేశములో హరికథా ప్రసంగమనబడు కాలక్షేపము దక్షిణ దేశమునకు దిగుమతిఅయినదేగాని మన ఆంధ్రకురాలేదు. మేరుగోస్వామి ప్రోత్సాహముచే స్వాతితిరునాళ్ మహారాజు సంస్కృతమున హరికథలు రచించుట ఇందుకు నిదర్శనము. ఆంధ్రలోని హరికథా పద్ధతి యక్షగానము నుండి యావిర్భవించినది. హరికథకు మహారాష్ట్రుల ప్రోత్సాహముండి యుండవచ్చును. దక్షిణాది హరికథలలో మహారాష్ట్ర సంప్రదాయగేయము లున్నవి. తొహరాలు, మహారాష్ట్ర పు లావణి పోవాడా యనుగేయములను పోలియున్నవి. ఆంధ్రహరికథలలో యక్షగానమువంటి దరువుల కీర్తనలుగలవు. ఆంధ్ర హరికథలో అన్యరాష్ట్ర ప్రభావము తక్కువ అని చెప్పుటకు అధ్యాత్మ రామాయణము దృష్టాంతము. అది ఆఖ్యానశైలిలో సాగినది. నాటక సంవాద ధోరణి తక్కువ. సూక్ష్మముగా ఆలోచించినచో అది కీర్తనాత్మకము దీనిని తొలిహరికథ యని చెప్పవచ్చునని పలికిరి. పరిశోధకుడు డాక్టర్ రాఘవన్‌గారు 18 వ శతాబ్దములో యక్షగానములు హరికథలుగా మారినవనిరి. యక్షగానము హరికథ ఒకటే అయినట్లు దృష్టాంతములున్నవి. సిద్ధేంద్రుని భామాకలాపములో "జనులార వినుడీ హరికథ" అని ప్రారంభింప బడినవి. (రజనీ) ఈ భామాకలాపము అను యక్షగానమ్ము

17 వ శతాబ్దములో రచింపబడినదని ముసునూరు వెంకటశాస్త్రిగారి విద్యార్థి కల్పతరువులో తెలుపబడియున్నది.

ఆంధ్రలో మహారాష్ట్ర ప్రభుత్వమేర్పడినపుడు మహారాష్ట్ర యభిరుచి యయిన హరికథ ఆంధ్రలో ప్రవేశించినదని కావ్యవ్యాకరణ తీర్థులు పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారిచే పరిష్కరింపబడిన క్రీ.శ. 1925 లో మద్రాసు R. వెంకటేశ్వర అండ్ కంపెనీ వారిచే ముద్రించబడిన సింగరిదాసకృత రామదాస చరిత్ర విమర్శనము అను శీర్షికలో వ్రాయబడియున్నది. ఆశీర్షిక ప్రకృత గ్రంథమునకు చాలసంబంధమున్నది. గాన యీక్రింద వివరించడమైనది.

## శీ ర్షి క.

సింగరిదాసు తన రామదాసు చరిత్రలో పురవర్ణనలు మున్నగు స్థలములందు రగడలు మున్నగు వర్ణనలతో ప్రబంధశయ్యను కొంతవరకు హరికథా పక్కిని కొంతవరకు రచించెను. సింగరిదాసు హరిభజన పరాయణుడు.

ఈయన తన రామదాస చరిత్రమును సాధారణముగ హరికథా పక్కికనే అనుసరించి రచించెను. ఆంధ్రదేశమునందు 15 వ శతాబ్ది చివరనుండి ఆరంభమై 16 వ శతాబ్దము పూర్ణమగులోపల హరికథా పక్కిక చక్కగా వ్యాప్తినొందినది. అంతకు మునుపు సాధారణముగా పామరజనులు యక్షగానముల వంటి గేయనాటకములను మాత్రమే ఆడుకొనుచుండెడివారు కాని రానురాను అందునూ పాత్రము లధికములై ప్రదర్శనముల నిచ్చు పందర్పమున గొంత క్లిష్టత గల్గుటవలన వానిప్రచారము కొంచెము తగ్గజొచ్చినది దీనికిఁ దోడుగా మన ఆంధ్రదేశమునకు మహారాష్ట్ర ప్రభుత్వపు రాకతోఁ బాటు వారి యభిరుచులు గూడఁ బ్రాక సాగినవి. మహారాష్ట్రిలలో నామ సిద్ధాంతానుయాయులు మెండు. మన యాంధ్రమున గూడ రామదాసు భక్తి

త్రము నందు ఈసిద్ధాంతమున కనుగుణముగానే ఇతివృత్తపు కూర్పు గలదు. ఆంధ్రుల యభిరుచిని బట్టి ఆకాలమున వాడుకలోనున్న గేయము లను గూడ సింగరిదాసుగారు రామదాసు చరిత్రలో చేర్చినారు.

రామదాసు కీర్తనలు దరువుల వంటివె పూర్వము యక్షగానములన్న ఆంధ్రులకభిరుచి మెండు. వానిలో ఏలలు అర్ధచంద్రికలు చంద్రికలు దరువులు చూర్ణికలు సంధిగతములగు పద్యములు ద్విపదలు తరువోజులు షట్పదులు గీతములు మంగళహారతులు జోలపాటలు హెచ్చరికలు జంపెలు మొదలగు ననేక గేయచ్ఛందము లుండును. ఈగేయములెన్నో తరముల నుండి అనోట నానోట నలవరచుకొని ఆంధ్రులు ఆనందించుచుండిరి. శైవ మత విజృంభణ కాలమున ఈగేయ రచన యభివృద్ధి గాంచినది. హరికథా గ్రంథకర్తలు జన సామాన్యమునకు గల యీ యభిరుచులను గుర్తించి యక్షగాన మందలి కొన్ని చందములను వదలి కొన్నిటిని మాత్రమే తీసికొని సందర్భాను సారముగ హరి కథలలో గూర్చుచు వచ్చిరి. ఈరామదాసు చరిత్రము అట్లే జరిగినది. అట్లు గ్రహించిన ఛందస్సులు రామదాసులో జంపెలు ద్విపదలు మంగళహారతులు జోలపాటలు హెచ్చరికలు దండకములు మున్నగునవి గలవు. ఈరామదాసు గ్రంథమున దక్కిన హరికథా గ్రంథము లందువలెనే కథాంశమును వివరింప వలసినపుడు ప్రాయికముగా ద్విపదల లోను తౌహరాలలోను వచనములలోను సంధిగత విషయములు వర్ణింప బడుచుండును. రగడల మీద నేర్పరచిన పరిణామమే తౌహరాలగును. అంతేగాని తౌహరాలు క్రొత్తవేమియు గావు. కాని క్రొత్తవిగానుండును.

ఉదాహరణ:—

తౌ హ రా.

గోపన వప్పుడు బంధికానకు గొనిపోవుటఁ జూచి
యాపట్టణమున నందరు వగచిరి యనుతాపము మదిఁ దలఁచి

వ॥ దీనినే రగడ వలె తగ్గించినచో:—

రగడ:

గోపన నప్పుడు బంధికానకు
యాపట్టణమున నందరు వగచిరి.

వ॥ ఇట్లే రామదాసు చరిత్రలో షుమారు 50 దరువులు ప్రాచీన గేయము లగు ద్విపదలు రగడలు చూర్ణికలనుండి విచిత్ర సంస్కారములలోః గ్రొత్త రూపునఁ జెలగుచు మనకానందము నిచ్చుచున్నవి.

సాధారణముగ హరిదాసులై హరికథలను చెప్పునపుడు నడుమ నడుమఁ బ్రస క్తాను ప్రసక్తముగ నితర గ్రంధములలో నుండియును ఇతర గ్రంధకర్తల కృతులలో నుండియును ఆయా గ్రంధ భాగములను ఉద్ధరించి కీర్తన సేయుచు శ్రోతలను హరికథా శ్రవణ తత్పరులను జేయుచుండుట సంప్రదాయము. ఈసంప్రదాయ మిప్పుడు పిట్ట కథలను చెప్పుటగాను బూతు పురాణములను చెప్పుటగాను అపహాస్యపు ప్రసంగములు చేయుటగాను మారిపో యినప్పటికిని మన ప్రాచీన కాలమున మాత్రము సుప్రసిద్ధులై ఆయా విషయ ములందు నిష్ణాతులై ప్రజలయును ప్రభువులయును గౌరవాదరములకుఁ బాత్రులైన కవులు గ్రంధకర్తలు మహాత్ములు హరిదాసులు విరాగులు మున్నగు వారి సుభాషితములను శ్రోతలకు వినిపించి శ్రోతలకు భగవద్భక్తి కలుగు నట్టులుగా అప్పటి హరిదాసులు చేయుచుండెడి వారు. కనుకనే హరిదాస రత్నమగు పింగళిదాసు గారుఁ గూడ రామదాసు చరిత్రమున తనకు పూర్వు లైన నారాయణ తీర్థులు, విఠల్‌దాసు, ముకుందమాల గ్రంధకర్త యగు కుల శేఖరాళ్వారు మున్నగు హరిభక్తి పరాయణులగు పెద్దల గ్రంధముల నుండి గేయములను ఘూనస బోధ శతకము జానకీపతి శతకము ఆర్త రక్షామణి

శతకము భావనారాయణ శతకము దాశరధి శతకములనుండి పద్యములు గేయములు రామదాసు చరిత్రమున పొందుపరిచిరి.''

( ఇంతవరకు శీర్షిక పూర్తి. )

ఈ శీర్షికను బట్టి మనము కొంతవరకు హరికథల యుత్పత్తి క్రమము పూర్వపు హరికథాపద్ధతి నేడు హరికథలెట్లు పరిణమించుచున్నదియు. గ్రహించ వచ్చును. రగడలను మార్చి తౌహరాలుగా వ్రాసినట్లే యక్షగానములు హరి కథలుగా మాఱెనని గ్రహింప వలసియుండును. యక్షగానము లందలి ద్విపదలను రగడలను దరువులను క్లుప్త పరచినచో అది హరికథ యగును. కానీ ౹౭. వెంకటేశ్వర కంపెనీ వారి పై రామదాసు చరిత్ర విమర్శనమునకు విరుద్ధమగు యభిప్రాయము ఈ క్రింద వివరింపబడినవి.

శ్రీ రజనీ కాంతారావుగారు వాగ్గేయ కారకులచరిత్ర యుగవిభజన ఈ క్రమమున గావించిరి. (1) సామగాన యుగము (2) గాంధర్వ యుగము (3) ఆఖ్యాన యుగము (4) ధృవగాన యుగము (5) రాగ కావ్య యుగము (6) గీతగోవింద యుగము (7) దేశభాగ సంకీర్తన యుగము (8) యక్షగాన యుగము (9) ధాతుసంకల్పనా పరిణామయుగము (10) సభాసాంప్రదాయ యుగము (11) హరికథా యుగము,

ఇందులో గీతగోవింద యుగము 11, 12 శతాబ్దముల లోను దేశ భాగ సంకీర్తన యుగము 13 వ శతాబ్దములో యక్షగాన యుగము 16 వ శతాబ్దములో ధాతుకల్పనా పరిణామ యుగము 17 వ శతాబ్దములో హరికథా యుగము 19 వ శతాబ్ది చివరిభాగమున విలసిల్లినట్లు తెలియపరచ బడెను.

18 వ శతాబ్దపు త్యాగరాజస్వామి కాలమునాటికి హరికథలను పేర రచనలు అమలులో లేకపోవచ్చును. ఉన్నచో యక్షగాన నాటకములు వ్రాసిన వాడు హరికథలు వ్రాసియుండక పోడుగదాయని యూహింప వచ్చును.

అయితే తూము నృసింహదాసు గారు త్యాగరాజు సమకాలికుడట. వీరు ఆనాడు హరికథలు చెప్పుచుండినట్లు వారి చరిత్ర (హరికథ) వలన దెలియును.

తో హ ర :

" అనిశము హరికథ జేయుచు నానందాబ్ధిలోన దేలుచును
మునుపు ఘనులు నడిచిన మార్గమున మోక్షమంద గోరుచును!"

ఈవిధముగా నరసింహదాసు గారు తీర్థయాత్రలు జేసిరి.

" తో హ ర :

త్యాగరాయ సన్నిధి కుత్తరపు తెరువున దమసత్రముకు
వేగమె దోడ్కొని పోయి చేర్చిరి వేదవేద్య దాసులను"

ఈసత్రం వైద్యం రమణయ్యగారిది. వారు తూము నరసింహదాసు గారిని భక్తులతో నచ్చటకు జేర్చిరి. దీనిని బట్టి ఆనాటికి త్యాగరాజు గతించి నట్లర్థమగుచున్నది.

హరికథలు తమిళనాడులో గలవు. వారికాలక్షేపములకు సంగీత ప్రాధాన్యమెక్కువ. అందుచే వానిని సంగీతోపన్యాసము లందురు. వారు సంగీత కచ్చేరీ వలెనే కూర్చుండి తంబూరా శృతిలో వాయులీన మృదంగాదులతో కాలక్షేపము చేయుట కూడ వాడుకలో గలదు. కన్నడ దేశమున మాధ్వమత మెక్కువ. దాసరపంథ యను సాంప్రదాయమున వారు హరికథా కాలక్షేపములు ప్రచారము చేసిరి. కన్నడిగుల హరికథలకు తెలుగువారి హరికథలకు పోలికలు గన్పించును. ప్రస్తుత కాలమున బెంగుళూరు వాస్తవ్యులు శ్రీ కేశవదాసు గారు (B. A. B. L.) అను కన్నడ హరిదాసు విద్వాంసుడు కవి బహుగ్రంథకర్త అమెరికా ఇంగ్లాండు మున్నగు పాశ్చాత్య దేశములలో గూడ హరికథా రూపమున భక్తి ప్రచారములుచేయుచూ దేవాలయములు గట్టింపజేయుచూ బెంగుళూరులో దాసాశ్రమము నిర్మించి యుండిరి.

రాయలసీమ ప్రాంతమున విద్వాంసులగు కవులు కథకులునయిన రామశాస్త్రి గారు (మహారాష్ట్ర బ్రాహ్మణులు) బడి కాయలు పల్లి నరశింహా చార్యులు రాళ్ళపల్లి అనంతా చార్యులు పెదుదూరి వారు హరికథలను రచించి ప్రచారము చేసిన వారిలో అఖండులు మరియు బాగేపల్లి అనంత రామాచార్యుల వారు 13 హరికథలు రచించిరనియు వీరు ఆదిభట్ల నారాయణదాసుకు పూర్వుల నియు రజనీకాంతారావుగారి గ్రంథమున మరియు ఆంధ్రవిజ్ఞాన సర్వస్వం 3 వ వాల్యూమునందును గలదు. 1834 లో తెలంగాణమున ముద్దయకవి గారు మంథెన రామాయణమను యక్షగానమును రచించిరి. సికింద్రాబాదు తిరుమల నల్లాన్ వెంకట కృష్ణమాచార్యులు గారు కొన్ని హరికథలను రచిం చిరి. మరియొక కవి పంచాగ్నుల విశ్వనాథభాగవతార్ అనువారు గలరట

మళయాళములో చాక్కియారు లనువారు కథలు చెప్పుదురు. వారు చెప్పు కథను కూత్తు అనియందురు. కానీ ఇవి మన హరికథల వంటివి గావు. అసలు హరికథను మళయాళములో కథాప్రసంగమని యందురట.

## హ రి క థ .

మన హరికథా రచయితలలో కొలటనుంది మాత్రము తమ శివసంబం ధమగు హరికథలకు హరకథలని నామ కరణము చేసియున్నారు. గౌరి కల్యాణమును హరికథగా రచించిన లక్కాపరం శ్రీరామకవిగారు, మేధన రాముడను శివభక్తుని చరిత్ర వ్రాసిన రావుల శ్రీరాములు గారు తమరచన లకు హరకథలని నామమిడి యుండిరి. తాళ్ళూరి నారాయణకవి బ్రహ్మోత్తర ఖండమును హరకథయనిరి.

ఈహరికథ యనునామకరణము ప్రారంభదశలో కథా వస్తువును బట్టి జరిగినది గాదు. కథా సరళిని బట్టి పెట్టబడినది. పార్వతీ కల్యాణం హరి కథ అయిననూ, సీతాకల్యాణం హరికథ అయిననూ, రెంటి నీ హరికథపేరు

వనే పిలుచుట జరుగుచున్నది. అయితే మొదట హరికథ యను పేరు యేర్పడుటకు కారణము పరిశీలించినచో ఈ క్రింద వివరించిన విషయము మనకు గోచరమగును. హిందూమత సంబంధమగు కథలలో విష్ణుసంబంధ చరిత్రలే యెక్కువ గాయున్నవి. భారత భాగవత రామాయణాది చరిత్రలు దశావతార చరిత్రలు రామదాసు, త్యాగరాజు, పురందరదాసు, సక్కుబాయి, మీరాబాయి, గోదాదేవి మొదలగు పలు భక్తుల చరిత్రలు విష్ణు సంబంధ మగునవై యున్నవి. పూర్వము హరికథా గ్రంథములు రచింపబడ నప్పుడు హరిదాసులు ఇతర గ్రంథములనుండి కీర్తనలు సేకరించి కథా కాలక్షేపము చేయుచుండెడివారు. అట్లు సేకరించెడి కీర్తనలు త్యాగరాజకీర్తనలు, రామదాసకీర్తనలు, అన్నమాచార్యుల కీర్తనలు, నారాయణతీర్థులవారి తరంగములు, క్షేత్రయ్య పదములు, జయదేవుని యష్టపదులు మున్నగునవి యన్నియు విష్ణు సంబంధమైనవే అయియున్నవి. అందుచే ప్రారంభ దశలో విష్ణుకథలు చెప్పుచూ అట్టికథలను హరికథయని పిలుచుటచే హరికథయను పేరు ఉత్పన్నమై యుండునని తలంపవచ్చును. ఇందుకు నిదర్శనముగా క్రీ.శ. 1934 లో లకవరం శ్రీరామకవి గారు రచించిన తన గౌరీకల్యాణమను హరికథలో విష్ణువును గురించిన కీర్తనలు రచింపబడినట్లు శివునిగూర్చి యింతవరకు రచింపబడలేదు. పండితశ్రేష్ఠులు అట్టి శివస్తోత్రములైన కీర్తనలు గూడా రచింపవలయునను కోరికను వెల్వరుచుచు గ్రంథము పీఠిక వ్రాసి యున్నారు.

గుమ్మెటలు వాయించుచూ చెప్పు కథను బుర్రకథ యని పిలుతురు. జంగాలను శివ భక్తులు చెప్పు కథను జంగం కథ యనియందురు. ఈ రెండును బుర్రకథకు సంబంధించినవే. ఈనాటి ధ్యేయములు ఇతివృత్తము ననుసరించి వచ్చినవి గావుగదా!

ఈహరికథను యక్షగాన ప్రబంధమనియు, గేయ ప్రబంధ మనియు, యక్షగాన మనియు, కథాగాన మనియు, కథా కాలక్షేప మనియు పేర్లు వాడు కలో గలవు. బుఱ్ఱకథలు గూడ యక్షగాన జాతికి సంబంధించినవే అయి వున్నవి.

## యక్షగానము.

హరికథను యక్షగానమని పిలుచుటయు వాడుకగలదు. యక్షగానము నుండి యుద్భవించినది. కావుననే హరికథనుగూడ యక్షగానమనుట తగి యున్నది. బుఱ్ఱకథను గూడ యక్షగాన మనిరి. రగడ బుఱ్ఱకథకు ముఖ్యాంగము. ఆ రగడ యక్షగానముయొక్క ప్రధానాంగమే అయివున్నది.

“ఈయక్షగానము దేశిసాహిత్య ప్రక్రియలకెల్ల తల మానికము. ఇది వట్టి సాహిత్య ప్రక్రియ గాదు. సంగీతాభినయ కళలకు తావకమైనది. కథకళి యను కళాప్రతిష్ఠ గల మళయాళము వినా యావద్దక్షిణ భారతమం తయు వ్యాప్తమై వెలసినది. ఇది ఆంధ్రభాషాముద్రను ధరించినది. 18వ శతాబ్దిలో తమిళమున రాజ సంబంధ యక్షగానములు వెలసినవి. యక్షగా నము కొంత మరా ప్రవాహమున కేర్పడినది.” మొదట యక్షాదినే పద్య ముతో ఆటపాటల ప్రసక్తి పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్ర పర్వత ప్రకరణమున గలదు. ఆ తరువాత క్రీ. శ. 1480 ప్రాంతమున రచిత మైన శ్రీనాథుని భీమఖండమున గ్రామదాసు ప్రశంస సందర్భమున 'కీర్తింతు రెవ్వాని కీర్తి గాంధర్వులు గాంధర్వమున యక్షగాన సరణి' అను పద్య ములో గన్పట్టును. యక్షగానమునకు పుట్టినిల్లు ఆంధ్రదేశము. విహార భూములు తమిళ, కర్ణాట, తెలంగాణా ప్రాంతములు. మొదటి యక్షగానము క్రీ. శ. 16 వ శతాబ్ది ఉత్తరార్ధమున చెన్నశౌరి రచించిన సౌభరి చరితము. ఇది అలభ్యము. తరువాత రచింపబడినది. కందుకూరి రుద్రకవి యొక్క

సుగ్రీవ విజయము ఇవి ప్రదర్శన సౌలభ్యము క్రీ. శ. 16 వ శతాబ్దినాటికే ఆంధ్రమున యక్షగానములు ప్రదర్శనకెక్కినవి. యక్షగానము ప్రదర్శనకెక్కినను శ్రవ్యప్రయోజనము గూడ ప్రక్క ప్రక్కనే సాగుచున్నది. 19 వ శతాబ్దములో యక్షగాన రచనలు కోకొల్లలు. తాళప్రధానమైన దేశియొక్క మూల ప్రకృతి దగత యక్షగానమునకు ప్రధానాంగము దరువు అనునది సంస్కృతభాషలో ధ్రువ అను శబ్దమై యుండును యక్షగాన ముఖ్యాంగములు రేకు లేకదరువు, ద్విపద, గద్య, పద్యములు తొలితరి యక్షగానములలో వచన భాగము స్వల్పము. కథాను సంధానమునకు చిన్న సంభాషణలు ఉండును. దాగేపల్లి అనంతరామాచార్యులు ఆదిభట్ల నారాయణ దాసు గారు తమ హరికథలను యక్షగానము లనిరి కన్నడ దేశములో యక్షగానము బొమ్మలాటకు నేపథ్యముగానున్నా పరిచయము హరికథలకుగూడ వినియోగింప బడినదట. తెలంగాణములో పారాయణకై యక్షగానములు 18 వ శతాబ్దిలో రచింప బడినవి 1780 లో ధర్మపురి రామాయణము రచింప బడెను. 1834 లో మంథెన రామాయణము రచింప బడెను

యక్షగానములు పౌరాణికములై యున్నవి. భద్రాచల రామదాసు పోతులూరి వీరబ్రహ్మం గారి చరిత్రలు యక్షగానములుగ రచింప బడినవి. 19 వ శతాబ్ది ఉత్తర భాగము నుండి తెలంగాణములో యక్షగాన నాటక రచన ఆరంభమైనది. గోవర్ధనం నరశింహాచార్యులు శేషభట్టరు కృష్ణమాచార్యులు పట్టెము పావకవి మొదలగు పండితకవులు యక్షగానముల రచించిరి. 20 వ శతాబ్దములో చెర్విరాల భాగయ 32 యక్షగానముల రచించెను. తరువాత బూరుగపల్లి సోదరులు రచించిరని శ్రీ S. V. జోగారావుగారు తమ యక్షగాన వాఙ్మయచరిత్రలో తెలిపిరి.

మోక్షగుండరామాయణ గ్రంథకర్తయగు తాళ్ళూరి నారాయణ కవి తన బ్రహ్మోత్తర ఖండమను హరకథను యక్షగానమని నుడివిరి. పూర్వము

జక్కులను తెగవారు ప్రదర్శించు చుండిన దృశ్యకావ్యములకు యక్షగానమని పేరేర్పడినదని కొందరి పండితుల యభిప్రాయము. యక్షగానముల ప్రదర్శించుటవలన ఆతెగకు జక్కులని పేరు వచ్చినదని వేటూరి ప్రభాకర శాస్త్రిగారి యభిప్రాయము బౌద్ధ యుగమున వ్యాప్తిజెందిన యక్షులయొక్క గానమే యక్షగాన మయ్యెనని, కాకతీయుల కాలము నుండి ఆంధ్రమున యీయక్షగాన నాటకమున్నదనిన్ని నేలటూరి వెంకటరమణయ్యగారనిరి. కురవంజులను గేయరచనలు యక్షగానములుగా పరిణమించెనని సుగ్రీవవిజయ యక్షగాన పీఠికనువ్రాసిన వేటూరి ప్రభాకర శాస్త్రిగారు తెల్పిరి తంజావూరి యక్షగాన కర్తలు హాస్యము కొఱకే కురవంజులను ప్రవేశ పెట్టినట్లున్నదని నేలటూరి వెంకటరమణయ్యగారనిరి. కొరవంజి (కురవంజి) అను నది తమిళ పదము. అనగా ఎరుకలసాని యని యర్థము. ఇంతకు పూర్వము ఆంధ్రమున వెలసిన యక్షగానములలో కురవంజి ప్రవర్తిలేదు. యస్. వి. జోగారావుగారు, కురవంజులు 17 వ శతాబ్దికి ముందు లేవనిన్నీ గిరిరాజు వ్రాసిన కురవంజి మొదటిదనిన్నీ విప్రలబ్ధమైన నాయికకు ఆమెప్రియుని గూర్చి కురవంజి సోది చెప్పుననియు తెలియబరచిరి. 17 వ శతాబ్దమున తమిళములో యక్షగానములు పొడచూపినవని నేలటూరి వెంకటరమణయ్యగారి అభిప్రాయము. మైసూరు ప్రభువు కంఠీరవరాజు ఆంధ్రములో ననేక కురవంజుల రచించెను. ఇట్టి కురవంజుల సంబంధమగు సోదిచెప్పుట నేటి హరికథలందు గాననగును. తంజావూరి యుగములో యక్షగానములు పాడేస్థితి నుండి ఆడేస్థితికి మారినవని శ్రీ శ్రీనివాసచక్రవర్తి గారు నాట్యశాలయను గ్రంథమున దెల్పిరి. పాల్కురికి సోమ నాథుడు శ్రీశైలమున బొమ్మలాటలాడ బడుచుండెనని చెప్పెను. ఆబొమ్మలాటల పాటలే క్రమేణా యక్షగానములు గామారెను. యక్షగానములు మధుర కవితకు చెందినవి. ఇవి క్రమేణ తంజావూరులో విజయరాఘవుని కాలమున నాటకములుగా మారినవి. యక్ష

గానమే కొన్నిమార్పులతో ఉదించి ప్రస్తుతపు హరికథగా [illegible]నదని గ్రంథ సరళినిబట్టి గ్రహింప గలుగుదుము.

పూర్వము యక్షగాన ప్రబంధములనబడిన వానిని [illegible] కథలని పిలుచుచున్నారు. నృత్తనృత్యములను [illegible] పించునది యక్షగానము. యక్షులనగా దేవతాశ్రేణికి [illegible]. [illegible] గరుడ గంధర్వ కిన్నెర కింపురుషాది దేవతా సమూహము [illegible] శ్రేణికి సంబంధించినది. అందుచే దైవసంబంధమగు గేయ[illegible] గానమని పేరు సంభవించి యుండును. దేవతల పేర్లు [illegible] బడినట్లే చెవికింపైన గానమును గంధర్వగానమన్నట్లే దైవ[illegible] గేయప్రబంధ రచనను యక్షగానమను పేరు ప్రసిద్ధమై [illegible] పనగును. మనదేశమందలి పేర్లన్నియు చాలావరకు [illegible] రించి నామకరణము చేయబడినవి. మరియు దైవ సంబంధ[illegible] సమ్మిశ్రితము లైనవి. దక్షిణాది సంగీతమును [illegible] భారత సంగీతమునకు హనుమాన్ సంగీతమని ప్రసిద్ధి [illegible] వలె పాడుగానము యక్షగానమనబడియుండును.

## గేయప్రబంధము.

హరికథలను, గేయ ప్రబంధములనియూ అందురు. పరిమి సుబ్రహ్మణ్య కవి గారు తమ రచనలను యక్షగాన ప్రబంధములనినారు. [illegible] కాక శ్రీకృష్ణయ్యగారు తన పరీక్షిత్తు హరికథను గేయ ప్రబంధ మన్నారు. 1870 కి పూర్వము రచింపబడిన రామాయణం వెంకట నరసింహకవి గారి గోపాల కృష్ణవిలాసము గేయప్రబంధమని తెలుపబడినది. ప్రబంధము వర్ణనాత్మకమైనది. హరికథలో కథమూలాధారమైయుండి దేశకాల మాన పరిస్థితుల ననుసరించి ఉపమానోదాహరణములతో రసపుష్టికై ధ్వనిగల సుస్తుతి ల[illegible]జేయుచూ కథను పెంచుచూ నీతిబోధించుచూ కథనడుమ వలపి[illegible]ను.

గాన సంభరిత వాద్యసహిత కథాన్వితమైనది గూడా. కథ కందము చేకూర్చునది. విశిష్ట ప్రాధాన్యము వహించునది గేయము. అందుచే హరికథ గేయప్రబంధమైనది. అనాదికాలపు వస్తువులలో మానవునియందు గానము గోచరించును. గానము మానవున కానంద మొసంగును. రసభరితమగు గానసమ్మిశితమైన భావము గీతమగును. గీతమే గేయము. గేయప్రధానమగు కథావర్ణనమే హరికథ.

## హరికథ – కళ.

హరికథ కళలకు సంబంధించినది. అసలు సృష్టిలోని కళలు 64. అందు వక్తృత్వము, గానము, నాట్యము, శిల్పము, చిత్రలేఖన మనునవి లలిత కళలు. ఈ కళాభ్యాసపరులు కళాకారు లనంబడుదురు. కళ జీవితమున కానంద మిచ్చును. కళాజీవితము దైవానుగ్రహ ప్రాప్తము. కళారహిత జీవితము వ్యర్థము, పశుతుల్యము. కళాకారుడు తానభ్యసించిన కళలద్వారా కళామయుడగు సృష్టి స్థితి లయ కారణ భూతుడగు సర్వేశ్వరుని సాక్షాత్కారమును సులభముగా నందగలడు. అట్టి దైవసాక్షాత్కారమును బొందుటకు సులభసాధనమైన సంగీత సాహిత్య నృత్య వాద్య సమ్మేళనమైన హరికథ కళలలో మహోత్కృష్టమైనదని వేరుగా చెప్ప నవసరములేదుగదా! కళలు సగుణభక్తికి చెందినవి: నిర్గుణ భక్తికి చెందినవి యోగము తపస్సు: ఇవి నందఱికి నలవికానివి. నూటికి కోటికి ఏఒక్కరో నిర్గుణభక్తికి చెందినవారుందురు. మనకందరికి నందుబాటులో నుండునది సగుణభక్తి మాత్రమే. నిర్గుణ భక్తి పరుడు తనను మాత్రమే తరింప జేసుకొనును. సగుణ భక్తి పరుడగు కళాకారుడు తాను తరించి తోడివారలగూడ తరింప జేయును.

శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాద సేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ నివేదనం॥

అనబడు నవవిధ భక్తి మార్గములలో కీర్తనం అనునది అత్యుత్తమ మైనది. శ్రీహరి గాన లోలుడు.

శ్లో॥ నాహం వసామి వైకుంఠే నయోగి హృదయేష్వపే
మద్భక్తా యత్రగాయంతి తత్ర తిష్ఠామినారద!

నాభక్తులు నన్ను కీర్తించుచోటే నానివాసమని నారదునితో విష్ణువాక నాడు పల్కెనట. కావున కళలన్నింటికి హరికథయనుకళ ఉత్తమోత్తమ మైనది. అట్టి కళాకారుడగు హరిదాసుని జీవితము ధన్యము. హరికథా రచయిత మిక్కిలి ధన్యుడు. హరికథ విలువ వర్ణనాతీతము. భుక్తి భక్తి ముక్తి ప్రదమైనది.

హరికథ - భక్తి.

హరికథ ముఖ్యోద్దేశము భక్తిప్రబోధము. హరికథకుడు భక్తుడు. ఆయన భాగవతార్, భాగవతులు అని గూడా పిలువబడుచుండును. హరిదాసు రూపు గనుట తోడనే భక్తశిఖామణులైన తుంబుర నారదులు స్ఫురణకు రావలయును.

శ్లో॥ భక్తిరేవైనం గమయతి భక్తిరేవైనం
దర్శయతి భక్తివశః పురుషః॥

అనునార్యోక్తి ప్రకారము భక్తియే భగవంతుని బోధించును. భక్తియే భగ వంతుని దర్శింప జేయును భక్తియే భగవంతుని వశపరచును, అని తెలి యుచున్నది.

శ్లో॥ విష్ణోర్ గానంచ నటనంచ:—— అను పెద్దల సూక్తిప్రకారము భగవంతుడు సంగీత నృత్య గీత వాద్య విశేషములచేత ప్రత్యక్షమగునని తెలియుచున్నది. శ్రీహరి గుణకీర్తనమే భవ సాగర తరణోపాయము. భక్తి రసపోషణము హరిదాసు పూర్వ జన్మసుకృతవిశేషము.

శ్లో॥ కలౌ గాన ప్రియో హరిః :— అను ప్రమాణముచే కలియుగ ములలో భగవంతుని గానముచే దర్శించి మోక్షము పొందుట మానవునకు సులభ సాధనము. ఇట్టి భక్తితో గూడిన హరికథ యను కళ ముక్తికి హేతు దాయకమే గాని భుక్తికి మాత్రము ఈకాలములో రక్తికి రావటములేదని శ్రీ ములుకుట్ల పున్నయ్యశాస్త్రి భాగవతార్‌గారు తమ రచన యగు పూలబుట్ట యను ఖండకావ్యమున రచించిన ఈ క్రింది సీస పద్యమును బట్టి మనము గ్రహింప గల్గుదుము.

సీ॥ సినిమాలు దయజేయుటవె పురాణీకుల
భుక్తి ముక్తులకును బూజు పట్టె
చలన చిత్రములు విచ్చలవిడి యౌటచే
గాయకావళి నోట గడ్డబడియె
బ్యాగ్రౌండు మ్యూజికి ప్రతివారి తలకెక్క
నాటకాల్ వారికి తీటబట్టె
ఊరూర పిక్చర్లు ఘోరు గొల్పుట హరి
కథకుల బ్రతుకు ఏకాదశయ్యె
గీ॥ ధరణిలో కళలన్ని ప్రేత కళలయ్యె
నేటి కాలపు యీ ప్రజానీక మునకు
లోకమే లేదు సినిమాల లోకమొకటె
ఆంధ్ర సోదరులార! మహాత్ములార!

హరికథ — దేశికవిత.

హరికథ దేశి కవిత్వమునకు చెందినది. వాఙ్మయ మనగా వాక్కు నుండి వెల్వడి గ్రంథస్థమైన విషయము. దీనినే సారస్వత మనియు సాహిత్య మనియు అందురు. ఈసాహిత్యము రెండు రకములు ఒకటి మార్గము రెండు దేశీయము.

మార్గ మనగా ఉదాత్త వాఙ్మయము. ఇది చందస్సు వ్యాకరణ శాస్త్ర సమ్మతమైనది. వాల్మీకి వ్యాస నన్నయ తిక్కన పోతనాది కవుల రచన వంటిది. ఇది నియమ సహితము. ప్రాచీనము, పండిత రంజకము, బుద్ధి రంజకము, భాష ప్రాధాన్యమైనది. దీనిని హైయ్యర్ స్టైల్ అందురు. శాస్త్రీయసంగీతమువంటిదని చెప్పవచ్చును.

దేశీయమనగా ఉదాత్త వాఙ్మయమునకు భిన్నమైనది. చందస్సు వ్యాకరణ శాస్త్రాదిది నియమ నిర్బంధములు లేనిది. నూతనము, పామర జన రంజకము. హృదయ రంజకము. ఆయాదేశ ప్రజలచే ఆదరణ లభ్యమగు నది. భావ ప్రాధాన్యమైనది. రసభావ స్రోతస్విని, రుచి ప్రధానమైనది. దీనిని లోయర్ స్టైల్ అందురు. దీనిని లలితసంగీతమువంటిదని చెప్ప వచ్చు. అయితే దేశీయము ఆర్య సంస్కారము పొందినచో మార్గము కానవచ్చునని ఉదాహరణ వాఙ్మయ పీఠికలో నిడదవోలు వెంకట్రావుగారనిరి.

జానపదగేయములు దేశికవితకు చెందినవని పండితుల యభిప్రాయము. అట్టి జానపద గేయములతో గూడినరచనయగు హరికథ దేశికవితకు చెంది నదే శ్రీ తాళ్ళూరి నారాయణకవి గారు తమగ్రంథమగు మోక్షగుండ రామా యణము (హరికథ) న తనకు వ్యాకరణ చందస్సలంకారాది శాస్త్రజ్ఞానము శూన్యమని చెప్పుకొనిరి.

సీ॥ ఛందో విచారంబు నలుపగా నైతిని
వ్యాకరణంబు నేర్వంగ లేదు
కావ్యంబులను మాట గలలో నెరుంగను
నైఘంటి కంబు లనంగవినను
నవరసాలంకార నైపుణీ లేదయ్యె
భరతశాస్త్రంబు చొప్పరయ లేదు
రాగతాళముల మార్గము గోచరము గాదు
స్వరవిభేదంబుల జాడ లెఱుగ

గీ॥ నీమహాకావ్య రత్నమింకే విధమున
హరికథ నొనర్తు శక్తిలేదనక నేను
సమ్మతించితి నిది యెట్లు చక్కబడునొ
యొండు శరణంబులేదు రాముండు దక్క

ఈవిధముగ ననేకులు హరికథా రచయితలు వ్రాసుకొని యున్నారు. కావున హరికథకు భావము ప్రధానమే గాని భాష ప్రధానము గాదు. జానపద గేయములవంటి దేశిరచనలు దరువులు రగడలు కీర్తనలు యక్షగానములందు వ్రాయబడినవని దివాకర్ల వెంకటావధాని గారు నుడివిరి. దేశీవాఙ్మయమంతయు చాలావరకు గేయకవిత్వమునకు సంబంధించినదే అయియున్నది. తెలుగులో గేయవాఙ్మయమనగా పదములు సంకీర్తనలు కృతులు జావళీలు పాటలు చూర్ణికలు మొదలగునవి. ఇవి నన్నయగారికి పూర్వమునుండియు ఆచరణలోనున్నవి. కాని నన్నయ భారతము వెలువడినప్పటినుండి రాజులు పండితులు మార్గమునకు ప్రాధాన్యమిచ్చి దేశికవితను ఏవగించు కొనిరని శ్రీ శ్రీనివాసచక్రవర్తి గారు నుడివిరి. విజయనగర కవులు కాలంలో మరల మంచి యభివృద్ధి గాంచినది. ఈదేశీకవిత నిరాదరణకు కారణము పదకవిత్వ ప్రధానమగు యక్షగానములలో పద్యరచన ఉండుటచే దేశీవాఙ్మయముపై కావ్యప్రబంధరీతుల ప్రభావము విజృంభించినదని నిడుదవోలు వెంకట్రావుగారనిరి. ఈ ప్రక్రియలన్నియు మిశ్రితమైనదే హరికథయనబడును. అందుచేతనే ఇది దేశీశాఖకు సంబంధించినది కీ. శే. వంగూరి సుబ్బారావుగారు గేయములను 8 రకములుగ విభజించిరి. అవి కృతులు, కీర్తనలు, మంగళహారతులు, ఏలపాటలు, తత్వములు, చూర్ణికలు, జావళీలు, హరికథలు. హరికథలు యక్షగానములు రెండును గేయవాఙ్మయమునకు సంబంధించినవే. యక్షగానముల నుండియే హరికథ ఉద్భవించినవి. యక్షగానములు హరికథలు ప్రక్కప్రక్కనే యున్నవి. హరికథతో కథాకథనమెక్కువ ప్రాధాన్య

మొందినది. నాటకీయసంవాద ధోరణి యక్షగానమందున్నది. యక్షగానము లను గేయరచనా భేదములు శ్రవ్య యోగ్యములు మాత్రమే. కాని నాయక రాజులనాడు వెలసినవి ప్రదర్శనయోగ్యములు అని R. V. S. సుందరం గారన్నారు.

## హరికథ యననేమి?

హరికథను గూర్చి ప్రఖ్యాత హరికథాకవుల యభిప్రాయములు కొన్ని ఈక్రింద తెలియఁబరుచ బడినవి వానిని దయతో పరిశీలింపుడు.

బి. బాలాజీదాసుగారు రచించిన సంగ్రహ రామాయణ హరికథా గ్రంథమున తొలిపలుకు అను శీర్షికలో నిట్లు వ్రాయబడినది.

హరికథా క్రమోపక్రమణమునకు బూర్వము హరికథలన్న నెవ్వియో వాని ప్రయోజనమెద్దియో హరికథకు లెట్లున్న హరికథా మహిమోద్ఘాటనము కానేర్చునో సజ్జనులకెల్లరకు హృదయంగములు గావించుట శ్రేయోదాయకము. "హరికథ" హరియనగా నెవరు? పరిశుద్ధానంద జ్ఞాన నిలయుండును సృష్టి స్థితి లయ కారుండును నగు నాపరబ్రహ్మమూర్తియే యని వేఱుగా వక్కాణింపవలయునా? సర్వమునకు నాద్యమగు నాసచ్చిదానందమూర్తి సద్గుణగణ సంకీర్తనమే హరికథ యని చెప్పబడును. విశాల తమంబగు స్రష్ట సృష్టి యందే మహాపురుషాగ్రేసరుల యందును మహా పతివ్రతా శిరోమణుల యందును భాగవతోత్తమార్థంబులును జ్ఞానాంశములుసనగు సద్గుణ పుంజములు మూర్తీభవించి యుండునో అవ్వారి మహదాదర్శ చరిత్రంబులును సత్క్రియాచరణంబులును నార్యులచే గద్య పద్యాత్మకంబుగ విరచింపబడి ప్రతీతోపయోగార్థము హరికథలను పేర వాఙ్మయప్రపంచమున సుప్రసిద్ధములయినవి. ద్వంద్వార్థ భూయిష్టంబగు విశ్వంబున వెలయు జీవకోటి, మాయాతీతుడును సర్వాంతర్యామి ప్రతిబింబమే యగుటంజేసి లోకోత్తర గుణయుక్తులగు స్త్రీ పురుషా

దుల కథాభినుతులే హరికథలన పేరెన్నికగన్నవి. ప్రవాహరూపంబున వెలయు సలిలమునుండి యేరీతి శైత్యాదికృతచే శ్వేతవర్ణమునుదాల్చు మంచు గడ్డ జనింపుచున్నయదో అది యేచందమున గారణంబగు నాదిశక్తినుండి కార్యమగు విశ్వముదయమైనది. సద్గుణము జ్ఞానాంశమగుటయు నాజ్ఞానమే సర్వేశ్వర రూపమగుటయు నాజ్ఞానాంశమే వ్యక్తియందు గేంద్రీభూతమగునో వానినే భగవదవతార పురుషునిగా భావింపజెల్లును. అట్టియ లౌకికపురుషోత్తముని సత్క్రియా కలాపంబున గామక్రోధాద్యరిషడ్వర్గ పరీభూత చిత్తులగు మానవుల చిత్తముల నజ్ఞానాధికృత నశింపుడు, నిర్మలానంద బీజము లంకు రించునని భావమునందెంచియే మానవజీవితోద్ధాన పరిజ్ఞాతలగు కవివరేణ్యులు హరికథలనుపేర నాదర్శ నర నారీమణుల పవిత్ర చరిత్రంబుల జిత్రించి మించినారు. పవిత్రతమంబులును శ్రవ్యతరంబులును నగు హరిగాథల దృశ్య శ్రవ్య కావ్యముల లక్షణావళులన్నియు జిన్నెలువన్నెలు పెంపెక్కి నలరారుచుండును. సాహిత్య సరస్వతీదేవికే యీ హరికథాక్షేత్రము నాట్య రంగమగుచుండుట లేదు! ఇయ్యది సంగీత రసాధిదేవతకు సహితము క్రీడా లయమయి భాసిల్లుచుండును.

ఇటీవల M V. R. కృష్ణశర్మగారు ఆదిభట్ల నారాయణ దాసచరిత్రము వ్రాయుచు అందు హరికథ లక్షణము లిట్లువర్ణించెను.

ఆట పాట మాట చక్కని శృతి గొన్న సాహిత్యరూపమే యక్షగా నము ఇట్టివానికి దాసుగారు హరికథలను నామమేర్పరచి రచించిరి. ఈరచనా పాటవము నల్లేరుమీద బండినడక వలె ప్రతిభ కనుబడును.

సంగీతసౌరభము (హరికథాసేవ) అను శీర్షికలోనిట్లున్నది. సర్వజ్ఞనైక వేద్యము హృద్యము భగవన్నైవేద్యమైనది సంగీతము. అందునాదారవ ప్రధానమైనది హరికథా కథనము. అది ధర్మ-భక్తి ప్రబోధమునకు నిర్మల

సాధనము. అది నృత్త గీతములలో మనోరంజకముగా సాధింపదగి యున్నది. భగవత్సాన్నిధ్యమును బొందుటకు యోగ సంగీత మార్గములు దప్ప వేరులేదు. సర్వ వస్తువులయందు వాసుదేవ భావనచే మనోవాక్కాయ కర్మలచే భగవంతుని పూజింపుచూ సర్వప్రజలకు దైవభక్తిని బోధింపదగు మోక్షసాధనము సంగీతము కన్న వేరులేదని నారదమహర్షి బోధించె. అందు చేత పురందర విఠలాదివాగ్గేయ కారకు లిక్కలియుగమున గీత ప్రబంధములు విరచించి యాడుచుఁ బాడుచుఁ బరులఁదరింపఁజేసి తాము తరించిరి. రామ దాసు త్యాగరాజాదులు గూడ భగవంతుని గానామృతముచేఁ బ్రసన్నుని జేసు కొని ముక్తిని బొందిరి. హరికథా శ్రవణమువలన శ్రోతలు నిఖిల శ్రేయో భివృద్ధినిఁ బొందుదురు. కథకులకుఁ గూడ ధర్మార్థ కామమోక్షములు లభిం చుననుట నిస్సందేహము. అట్టి కథలకు శృతిస్మృతి విజ్ఞానము శబ్దానుశాస జ్ఞత అభిదానప్రవీణత చన్దఃప్రభేద వేధిత్వము అలంకారకౌశలము రసభావ పరిజ్ఞానము నానాభాషవైశద్యము కళాశాస్త్రనైపుణి వాక్పటుత్వము, సభావిజయ సామర్ధ్యము ఉచితజ్ఞత రమ్యరూపము మున్నగు లక్షణము లుండవలయును. ఇవన్నియుగలవాడు ఆదిభట్ల నారాయణదాసు.

పాతూరి మధుసూదనరావుగారు నేటి కాలమున పేరెన్నిక గన్న హరి కథా రచయిత. వారు రచించిన సాక్షిదేవ చరిత్రము అను యక్షగానము (హరికథ) న పీఠికలో నిట్లు వ్రాసియున్నారు.

యక్షగాన కావ్యములకు నారాయణ తీర్థయతీంద్రులు సంస్కృతమున మార్గదర్శకులు. నాటకలక్షణమే యక్షగానముల కయ్యును నిటీవల హాస్య రసాభిలాషులగు శ్రోతలతో వక్తలతో విలక్షణమై విలువ తగ్గుచున్నది. కావ్యము శివేత రక్షతి కొరకై యుండవలెనమట సాంప్రదాయకము. తద్వి రుద్ధము విపరీతఫలదము. నాట్య కళాది వైజ్ఞానిక పరిషత్తులు యక్షగానము (హరికథ) ల విషయమున చేయూతనిచ్చి తగినంతగ ప్రోత్సహింప కుం

డుట విచారకరము. బ్రహ్మశ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారు ఆంధ్రమున నీకళకు జీవము పోసినమనీషి. శ్రుతి శాస్త్రములకు విరుద్ధముగాక కరుణ రసప్రధానమైన కథావిశేషమును రాగతాళ లయలతో పారమార్థిక తత్వము వెల్లడించుట కర్తవ్యము వక్త విజ్ఞానియై కథయుత్తమనాయక చరిత్రమై శ్రోతలు రసజ్ఞులై యుండుట విశేషము.

(క్రీ. శ. 1911) విరోధి కృతు సంవత్సరాది సంచికలో హరికథయను శీర్షిక క్రింద ఆదిభట్ల నారాయణ దాసు గారు వ్రాసిన వ్యాసము ఆంధ్రపత్రిక స్వర్ణోత్సవ సంచిక 1964-65 లో ప్రచురించిన దానిలో ముద్రితమైనది. అందు దాసు గారు హరికథను గురించి యిట్లు వ్రాసిరి.

ఆస్తిక్యమును ధర్మాధర్మములును సర్వజన మనోరంజకముగ నృత్య గీత వాద్యములతో నుపన్యసించుట హరికథ యనబరగు. అట్టి యౌపన్యాసి కుడు కథకుడనబడును. దైవభక్తియు సత్యము భూతదయయు హరికథ యందలి ముఖ్యాంశములు. దేవుని గొల్చి తరించిన ప్రహ్లాదాది పరమ భాగవ తుల చరిత్రములును సావిత్రీ ప్రముఖపతివ్రతా చరిత్రములును హరిశ్చంద్రాది వీరచరితములును దెల్పినచో మంచి యభివృద్ధియగునని వాల్మీకి వేదవ్యాసుడు మొదలగు మహర్షులు కావ్య పురాణేతి హాసంబుల బన్నిరి. నారదుడు దొట్టి పరమ మునులు భగవన్నామ సంకీర్తనము సేయుచు నాడుచు బాడుచు లోకులం దరింప జేసిరి.

శ్లో॥ వీణా వాదన తత్వజ్ఞో శ్రుతి జాతి విశారదః
తాలజ్ఞశ్చ ప్రయాసేన మోక్షమార్గం నియచ్ఛతి॥

అను యాజ్ఞవల్క్య స్మృతి వచనానుసారముగ యోగము చేతను సంగీతము చేతను దక్కవేరు మార్గమున మోక్షము సాధింప రాదనియు యోగముకన్న నిరపాయమగు సంగీతావలంబనము చేత,

శ్లో॥ గాయంశ్చరిత్రాణి రథాంగపాణేః
నృత్యనిరస్తాఖిల కర్మబంధః
నిరంకుశస్సర్వ సమోవిరాగీ
కైవల్యమభ్యేతి ముకుంద భక్తః ॥

అను నారద స్మృతి ప్రకారము సర్వ వస్తువుల యందు వాసుదేవ భావనచే మనోవాక్కాయ కర్మములచే దేవుని భజించుచు సర్వజనులకు దైవ భక్తిని బోధింప దగు మోక్ష సాధనము సంగీతము కన్న వేరు లేదని రూఢిగ దెలిసిన పురందర విఠలాది వాగ్గేయ కారులిక్కలియుగమున గీత ప్రబంధములు విరచించి యాడుచు బాడుచుం బరులం దరింపజేసి తాము తరించిరి.

శ్లో॥ తస్య గీతస్య మాహాత్మ్యం కేప్రశంసితు మీశతే ।
ధర్మార్థ కామ మోక్షణా మిదమేవైక సాధనం॥

అను శాస్త్రిముం బట్టి వాగ్గేయ కార సత్తముండగు వాల్మీకమహర్షి శ్రీమద్రామాయణమను గీతప్రబంధ మొనరించి కుశలవులచే జగదాహ్లాద కరం బుగ త్రేతాయుగమునఁ బాడించెను. భరతముని ప్రముఖుల నాదికాలమున "శివస్తుతౌ ప్రయోక్తవ్యాని మోక్షాయ విధదే విధిః" అని బ్రహ్మరచితములగు మన్త్రికాది గీతములను శివసన్నిధిం బాడిరి. కలియుగమునందు ప్రాచీను లలో సుప్రసిద్ధులగు వాగ్గేయ కారులు జయదేవుడు గీతగోవిందమును నారా యణతీర్థులు శ్రీకృష్ణ లీలా తరంగములును దీక్షితులు కృతులును విరచించిరి. ఆంధ్రి భాషయందు గూడ క్షేత్రీయుండు రామదాసు త్యాగరాజు సుబ్రహ్మణ్య కవి గోకులపాటి కూర్మన్న మొదలగు మహానుభావు లుభయ తారకముగ గీతబంధముల గావించి ప్రఖ్యాతి వడసిరి. కొద్దికాలమునుండి మహారాష్ట్రము మొదలగు పెక్కు దేశంబులలో సంగీత సాహిత్య విశారదులు కొందరు జీవ నార్థమై కథకవృత్తి నవలంబించి హరిభక్త వేషంబుల ధరించి దైవభక్తిని

ధర్మాధర్మములను జనులకు బోధించు పౌరాణికులు కథకులు భాగవతులు దాసులు మొదలగు సంజ్ఞలం బరగు చున్నారు.

శ్లో॥ విష్ణు భక్తా ఏవ విప్రా నానా వేద విదా అపి॥

అను స్మృతి వాక్యము చెప్పున సూతాది కథకులం దలంచి బ్రాహ్మణేతరులు గూడ కథకులై యుచిత సత్కారములు వడయు చున్నారు.

హరికథా శ్రవణమువలన శ్రోతలకు నిఖిల శ్రేయోభివృద్ధి యగును. కథకులకు గూడ ధర్మార్థ కామ మోక్షములు లభించును.

## హ రి క థా ర చ న

హరికథారచన క్లిష్టమైనది. ఏదైనా ఒకరూపమును కల్పించి నిర్మించుటకు కొంత వస్తుసామాగ్రి నైపుణ్యము నిర్మాణకర్త కవసరముగదా? అట్లే హరికథా రచయితకు కవితాశక్తితో బాటు సాహిత్య జ్ఞానము సంగీత ప్రతిభ గలిగి యుండుట చాలా ముఖ్యము. సంగీత జ్ఞానము లేనివాడు కీర్తనలను లయబద్ధముగా వ్రాయజాలడు. రచన సులభశైలిలో నుండి మాధుర్యసంపన్నముగ నున్నచో ప్రజాబాహుళ్యము లో మిక్కిలి ప్రచారమునకు వచ్చును. ఎక్కువ విషయమును తక్కువ రచనలో ఇమిడ్చగల సామర్థ్యము గలిగి యుండుట హరికథా రచయితలకు ముఖ్యావసరము. అనగా ఉద్గ్రంథములందలి నాల్గుపద్యముల లోని భావము హరికథలో ఒక్కపద్యములో నిమిడ్చవలయును. ఎందువలననగా ఉదాత్త గ్రంథములు చదువుకొని యానందింపదగినవి. హరికథ లట్లుగాక వాద్యములతో విని యానందింపదగినవి. వ్యయ ప్రయాసములతో గూడినవి. కావున హరికథా రచన క్లుప్తముగా యుండవలెను. క్లుప్తరచనలు రేడియో కాలక్షేపములకెంతయో యనుకూలము గానున్నవి. కథారచనలో గూడ పూర్వ సంప్రదాయమునకు నేటి పద్ధతులకు వ్యత్యాసము గన్పట్టుచున్నది. పూర్వపు కథలు విస్తారములు. నేటి కథలు క్లు

ప్తము. శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణ దాసు గారు క్రీ. శ. 1910 లో రచించిన భీష్మ చరిత్రలో వస్తుసంగ్రహము అని ప్రథమ పేజిలో నిట్లున్నది. 25 గీతములు 13 కందములు 21 సీసములు తరువోజలు 4 చంపకములు 3 ఉత్పలములు 4 మత్తేభములు 1 పంచచామరము 1 మాలిని 15 మంజరులు 46 కృతులు.

ఇట్లే నందివాడ జగన్నాధ కవి గారు 1920 లో రచించిన సీతా కళ్యాణ హరికథ ప్రథమ పేజిలో కీర్తనాదుల సంఖ్య నిట్లు చెప్పి యున్నారు. పద్యములు 67 మంజరులు 66 వచనములు 35 కృతులు 41 గద్య 1. ఆధునిక రచన యగు పరిమి సుబ్రహ్మణ్యం గారి రఘు చరిత్రలో 20 కీర్తనలు 4 సీసములు 13 తేటగీతలు 9 చంపకములు 12 మత్తేభములు 4 శార్దూలములు 3 ఆటవెలదులు 3 కందములు గలవు. ఈ వివరణ ఆధునిక రచన క్లుప్తమని తెలుపును. 1870 కి పూర్వము రచింపబడిన రామాయణం వెంకట నరసింహ కవి గారి గోపాలకృష్ణ విలాసము క్రీ. శ. 1900 ప్రాంతమున తాళ్ళూరు నారాయణకవి రచించిన మోక్షగుండ రామాయణము 1902 లో రచింప బడిన మన్నేపల్లి వెంకటాచలం పంతులుగారి శ్రీరామ చంద్ర లీలా తరంగిణి ప్రాచీన సంప్రదాయ రచనకు సంబంధించినవి. మరియు నౌషక్ వాన్‌జీ, వుట్లా గోపాలదాసు, నీలి వీరరాఘవ దాసు, ఆదిభట్ల వారి రచనలు గూడ పాత సంప్రదాయముననే రచింప బడినవి. పాతూరి మధుసూదన రావు గారు పరిమి సుబ్రహ్మణ్యం గారు పెద్దింటి సూర్యనారాయణ దీక్షితులు ములుకుట్ల పున్నయ్య శాస్త్రి మొదలగు వారి రచనలు అధునిక పద్ధతిలో నున్నవి.

పూర్వపు రచన యక్షగానములఁ బోలి యున్నది. అధునిక రచనలలో కీర్తనలు మంజరులు పద్యములు దండకములు ప్రాముఖ్యము. పాత

సంప్రదాయములో స్తుత్యంతములనబడు దేవతా ప్రార్థనలు సుకవి స్తుతులు, కుకవి తిరస్కృతులు, కవి వంశావళులు, ఏకాంత సేవలు, పెండ్లి పాటలు, హెచ్చరికలు, మొదలగు రచనలు మిక్కుటము. దరువులు రగడలు తరువోజలు మధ్యాక్కరలు తంగమెట్టులు వృంతములు కందార్థములు సీసార్థములు మొదలైన ప్రక్రియలు గూడా సమృద్ధము. అట్టి రచన నేటి కథలలో లేదు. దరువులనే కీర్తనలుగా చేసి పూర్వకవులు రచించిరి. దరువు అనగా లయతో గూడిన శబ్దము. కీర్తన అనగా కీర్తించునది. దరువులు పాతపద్ధతి కృతులు ఆధునికము. నేటి కీర్తనలు కృతిసంప్రదాయము. చరణములు తక్కువ. ద్విపదలతో ఎక్కువ కథను పూర్వపు కవులు సాగించెడివారు. మరియు పాండిత్య ప్రకర్షతో గూడుకొని భక్తి రస ప్రాధాన్యముగా నామ సిద్ధాంత మెక్కువగా పూర్వపు రచనలు గానింప బడెను. నామసిద్ధాంతమనగా ఆధ్యాత్మిక చర్చా వివరణలు. నేటి కథలు సులభశైలిలో పామర రంజకముగా నున్నవి. సంగీత పాండిత్య ప్రతిభకు నుదాహరణముగ ఆదిభట్ల వారి జానకీ శపథము రామాయణం వెంకట నరిసింహ కవిగారి గోపాలకృష్ణ విలాసము ఫోలంరాజు సీతారామయ్య గారి శబరిమల అయ్యప్ప చరిత్రము (అముద్రితము) అను హరికథలు తీసుకొనవచ్చును.

మూలవస్తు వొకటే అయినను హరికథ రచనా శైలిలో రసపుష్టికై కొన్ని కల్పనలతో వర్ణనలతో రచన సాగును. కథా విషయము సంగ్రహముగా నుండును, మహాభారత గాథను ధర్మరాజుల పట్టాభిషేకము వరకు పరిమి సుబ్రహ్మణ్యం కవి గారు 24 కథా భాగములుగా సంగ్రహించి రచించియుండిరి. ములుకట్ల పున్నయ్య శాస్త్రిగారు వారి భారతమును 29 హరికథలుగా విభజించిరి కాని గ్రంథమున 40 హరికథలని వ్రాయబడినది

## రచన – విషయము

సామాన్యముగా హరికథలందలి ఇతివృత్తము ఎక్కువగా పౌరాణి

కమే అయి యున్నది. భక్తుల చరిత్రలు గూడ హరికథలుగా వ్రాయ బడు చున్నవి. ఇటీవల రాజకీయనాయకుల చరిత్రలు హరికథా రచనలో ప్రముఖ స్థాన మలంకరించు చున్నవి. కొమ్మూరి బాల బ్రహ్మానందము గారు పూర్ణా నందమను సాంఘిక హరికథ నొకటి రచించిరి. కావ్యములు నాటకములు రస పోషణకై కవి కల్పితము సేయవచ్చు ననుట శాస్త్ర సమ్మతము. అట్లే హరి కథలు గూడ భక్తి రేకెత్తించుటకు భక్తి రస పోషణకు కథాకల్పన గావింప బడుచున్నవి. కాని చరిత్ర యట్లుగాక సత్యమునే తెలుపవలయును. అందుచే చరిత్రలు కల్పింప రాదు. కానీ అట్టి చరిత్రలు గూడ రసపుష్టికై కల్పనలతో హరికథలుగ రమ్యముగ నేటి కాలమున ములుకుట్ల వారు రచించియున్నారు.

వీనులకు విందైనది కథ. చెవులకింపైనది గానము. కథలన్న ఆబాల గోపాలము చెవిగోసు కొందురు. మరి గానమన్న వేరుగ చెప్ప పనిలేదు.

శ్లో॥ శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగాన రసం ఫణిః

అను ప్రమాణమును బట్టి గానము సర్వ జీవులకు ప్రియమైనది. ఇక అట్టి కథాగానముల కలయిక యగు హరికథ బ్రహ్మానంద పదమేగదా; ఇచ్చట సాహిత్యాచార్య ఆంధ్ర అర్నాల్డు బిరుదాంకితులు గుంటూరు హిందూ కళాశాల ఆంధ్రోపన్యాసకులు పిల్లలమర్రి వెంకట హనుమంతరావు గారు 1956 లో దండు వెంకురెడ్డిచే రచింప బడిన శ్రీకాళహస్తి మహాత్మ్యమను హరికథలో వ్రాసిన ప్రవేశికను పొందుపరుచుట ముఖ్యావసరము గాన పొందు పరచ బడినది.

ప్రవేశిక :—

సకల భాషా సాహిత్యము లందును మార్గ దేశి శాఖలొప్పారుచు, పండిత పామరుల నలంకరించు చున్నవనుట విజ్ఞులెఱిఁగినట్టిద, జానపదులను

ప్రాకృతులను అల్పజ్ఞులను లోఁగొని ప్రబోధించుటలో నీ దేశికవిత చక్కని సాధనమై యొప్పారు చున్నది. ఆంధ్ర సాహితి, బరిశీలించినచో నీసత్యము బొడగట్టఁగలదు. నన్నయ్యకు-బూర్వము వరలినది పదకవిత్వము. నన్నయ యనంతరము వచ్చిన వీరశైవ వాఙ్మయముఁ బసవ పురాణ పండితారాధ్య చరితములు మున్నగునవి. దేశీయ ఛందములో జాను తెనుఁగు భాషలో వెలువడి జనుల లోఁగొన్నవి. అట్లే బుద్ధారెడ్డి రంగనాధ రామాయణము గౌరన హరిశ్చంద్ర నవనాథ చరితములు శ్రీనాధుని పల్నాటి వీర చరిత్ర మున్నగు రచనములు. ప్రచారమునకు లెస్సగా నను వగునది మాత్రా ఛందసనెడి సిద్ధాంతమును స్థాపించు చున్నవిగదా.

అట్లే తాళ్లపాకవారి పదములు త్యాగరాజు కీర్తనములు క్షేత్రయ్య పదములు అన్నమయ్య కీర్తనములు అష్టపదులు సప్తపదులు గీతిప్రాధాన్యములై పాఠ్య గేయేచ మధురమ్ములై పండిత పామరా మోదమును బొంది విరాజిల్లు చున్న దేశిరచనలు గేయములకు పదములకు కీర్తనలకు రాజాస్థానములందు గౌరవము ప్రథమము నుండియు లభింపక పోయిననూ గ్రామీణుల యాదరముచే నవి వర్ధిలుచు వచ్చినవి. నాయక రాజుల కాలమునకు మాత్రము రాజాస్థాన ప్రవేశ గౌరమును సమ్మానార్హతను గడించి నెగడుట మెచ్చుకొన దగిన యంశము. యక్షగానము దేశీశాఖకుఁ జెందిన ప్రక్రియా విశేషమై నాడు విశేషాదరము బడసి యుండుట మరువ రానిది. ఇంతకుఁ జెప్ప వచ్చిన దేమన "హరికథ" యీ యక్షగాన సరణికి జెందిన మఱియొక రూపమని, "హరికథ తెనుఁగు కవితలో స్వతంత్ర ప్రక్రియ యని చెప్పి గర్వింప దగినట్టిది. ఏక పాత్రాభినయమున కనువుపడు సాహిత్య రూపమిది. ఇదియు దేశికవితకుఁ జెందినదే ప్రచారసాధనముగా భక్తి ప్రబోధమున కెంతగానో యుపకరించుచూ జనుల నాకర్షించినట్టిది. ఇది మననుండియే మహారాష్ట్రుల కడ కేగినదని గుర్తించుట యవసరము వచనముల తోను కీర్తనలతోను

దరువులతోను హాస్య కథలతోను మధ్య మధ్య సంకీర్తనములతోను ఎడనెడ పద్యములతోను విరాజిల్లుచు భావ రాగ తాళములకుఁ బ్రాధాన్యమిచ్చు రచన మీ హరికథ. భక్తులే దీనిని గ్రహించి చెప్పుదురు గాన వారు దాసులైనారు.

ఆధునికులలో శ్రీమదజ్జాదాదిబొట్ల నారాయణ దాసుగారు హరికథా రచనా వ్యవహారమున దక్షులై స్వతంత్రులై సుప్రసిద్ధులై పితామహ స్థాన మలకరించిరి.

ఆత్మశుద్ధి చిత్తైకాగ్రత భావావేశము నిర్మలాంతఃకరణము ప్రబోధ చికీర్ష సంకీర్తనాభిలాష వీభక్తునిలో నిండుగా మెండుకొన్న గుణములు ప్రచార కవితలో తత్రాపి దేశీశాఖకుఁ జెందిన వాఙ్మయములో భాషలో గాని ఛందములో గాని కవి స్వాతంత్ర్యము హెచ్చుగ వహించుచుండుట పరిపాటి అట్టి విశేషమే యీ హరికథలో నయితము గాంతుము.— . ——

ప్రబంధ శతక వచనములకన్నా హరికథ బహుళ ప్రచార సాధనము. (ప్రవేశిక సమాప్తి)

పై ప్రవేశిక పరిశీలనము బట్టి యక్షగానము గూడ హరికథ వంటిదే నని తెలియచున్నది. కానీ యక్షగానములో నుండియే హరికథనుత్పత్తి యైనట్లు యక్షగాన నాటకము గూడ అవిర్భవించినదని గ్రహింపవగును

హరికథా రచయిత కుండవలసిన లక్షణములు హరికథ యొక్క యుపయోగములు పుట్టుపూర్వోత్తరములు మొదలగు వివరములన్నియు పండితుల యభిప్రాయానుగుణముగనే హనుమంత రావుగారు నుడివి యున్నారు. కానీ హరికథ మనమండి మహారాష్ట్రమున కేగినదని పలుకుటొక్కచే ప్రాచీన మతమునకు వ్యతిరేకముగా యున్నది. ఇందులకువారు ఉదాహరణ లిచ్చి హేతుబద్ధముగా తెలిపి యుండలేదు.

ఈ హరికథ గూడ గేయవాఙ్మయము వలెనే గ్రామీణ ప్రజాదరణ మీదనే వర్ధిల్లుచూ వచ్చినది. రాజాశ్రయములు యక్షగానములకు పట్టినట్లు హరికథలకు పట్టలేదు అనిచెప్పవచ్చును. 1920 లో పరీక్షిద్విలాస హరికథ ను రచించిన వ్రతుంబాక శ్రీకృష్ణయ్యగారు తమరచనలో 'అవతారిక' అను శీర్షికలో కథారచన పద్ధతిని గూర్చి విమర్శించిరి. "ప్రస్తుత కాలమున రచించు గేయ ప్రబంధములు (హరికథలు) స్త్రీ, కచకుచాది వర్ణనలతోను మీదు మిక్కిలి కేవల మసభ్యమైన సంభోగ వర్ణనలతోను నింపుచున్నారు. ఆహా! శ్రీహరి సంకీర్తనములలో గూడ స్త్రీ సంకీర్తనము లేకున్నచో బెంగతీరని దుఃస్థితి యందున్నంత కాలము దేశము బాగుపడునా? మర్మస్థలముల గూడ వర్ణించి తుదకు తల్లీ నన్నుగాపాడుమా! యని ప్రార్థించిన ప్రార్థన పద్య ములు విని సంతోషించెడి దుర్గతి దేశమునకు బట్టినది. ఈదశ నిజముగా మన యాస్తికతకు మారకదశ. దేశము నీదశనుండి తొలిగించుటకు కవులకు శక్తి లేదా?

గీ॥ యతివిటుడు గాక పోవు పెట్ట్ల స్మదీయ
కావ్య శృంగార వర్ణనా కర్ణనమున
విటుడు యతిగాక పోవునే పెనమదీయ
కావ్య వైరాగ్య వర్ణనా కర్ణనమున."

అని సంకుసాల నృసింహ కవి చెప్పినట్లు విటుని వేదాంతిగాను వేదాంతిని విటునిగాను చేయగలశక్తి కవులకు గలదు. అట్టి ప్రతిభావంతులగు కవులు 'ఆటకు దగినదే ఒటి మద్దెల' యనినట్లు కాలప్రవాహమున బడి కొట్టు కొని పోవువారికిఁ బ్రక్కతాళము వేయుచుండుట తగనిపని యని కవి సము దాయమునకు మనవి చేయుచున్నాను. అని కథారచనను గురించి విమ ర్శించెను.

## వర్ణనలు

హరికథను యక్షగాన ప్రబంధము, గేయ ప్రబంధమని యందురు. ప్రబంధమనగా వర్ణనా సహితమైనది. హరికథ లందు వర్ణింపబడు దృశ్యము లేవనగా సూర్య చంద్రోదయములు పగలు రాత్రిలు నదీ ప్రవాహములు సముద్రములు మున్యాశ్రమ ప్రాంతములు అరణ్య ప్రదేశములు ఘూమ్రా కాశములు ఋతు ధర్మములు ఉద్యాన వనములు స్మశాన వాటికలు యుద్ధ రంగములు పెండ్లి సందడులు ప్రసవ వేదనలు పుర వర్ణనలు రాజాంతః పురములు పతివ్రతా ధర్మములు భక్తుల ప్రవర్తనలు బాల్యక్రీడలు స్వర్గ నరక లోకములు విరాట్ స్వరూపములు అదృష్ట దురదృష్టములు చావు పుట్టుకలు సంతర్పణలు సత్రయాగములు వీరుల ప్రతాపములు శీరుల ప్రగ ల్భములు స్వయంవరములు పట్టాభిషేకోత్సవములు తిరునాళ్లు తీర్థములు రాజుల కొలువు కూటములు వేశ్యవాడలు జూటపు గృహములు త్రాగుబోతుల వికారచేష్టలు శుక్ల కృష్ణ పక్షములు అమావాస్య పూర్ణిమలు మొదలగు విష యము లెన్నియో చక్కగా హరికథలందు వర్ణింప బడియున్నవి.

హాస్యరస పోషణకై పాత్రోచిత పోషణము కొరకై ఇంగ్లీషు, ఉరుదూ, అరవము (తమిళము) మొదలగు భాషలలో పాటలు రచింప బడినవి. పసిపిల్లల వచ్చీ రాని మాటలతో మోటుగాంధ్ర గ్రామ్యభాషలో ఇంకను అనేక రీతులలో కీర్తనలు రచింపబడినవి. వ్యాకరణ చందశ్శాస్త్రాది నియమములను కవి పాటించినచో పాత్రోచిత భాష కుదరదు. అందుచే పాత్రౌచిత్యము చెడును. హరికథకు డేకపాత్రాభినయ పరుడుగదా?

బి. బాలాజి దాసుగారు తన హరికథలలో అవసరమగు చోటుల ఇంగ్లీషు స్టైల్సు పాంగ్సు రచించి యున్నారు. బాలుర ముద్దు మాటలతో పరిమి సుబ్రహ్మణ్యంగారు గ్రామ్య భాషలో చల్లా రామలింగయ్య గారు

గేయములను రచించి యుండిరి. ఒక్కొక్క రచయిత ఒక్కొక్క ప్రత్యే కతను తమ రచనలలో ప్రదర్శించి యున్నారు.

ఆదిభట్ల నారాయణ దాసుగారు కీర్తనలకు స్వర స్థానములను నిర్ణ యించిన కవులలో అగ్రగణ్యులు. రాజకీయ నాయకుల జీవిత చరిత్రలు రచించిన వారిలో ములుకుట్ల పున్నయ్య శాస్త్రి గారు గొప్పవారు. పౌరాణిక గాథల పెక్కింటిని ప్రౌఢముగా రచించిన కవి పరిమి సుబ్రహ్మణ్యం గారు. వ్యంగ్య భాషా శైలిలో రచించిన పేరెన్నిక గన్న కవి బి. బాలాజి దాసు గారు. ఇంగ్లీషు కొటేషన్సుతో మిక్కుటమైన నామ సిద్ధాంతములతో రచించిన కవి బాబు, పి. యస్. నౌషద్ వాన్‌టి. ఇట్లు ప్రతికవిలో కవిత్వములో ఒక్కొక్క ప్రత్యేక నైపుణ్యము గోచర మగుచున్నది.

## హరికథ - వస్తు సంగ్రహము

విఘ్నేశ్వర శారదాది ఇష్టదేవతా ప్రార్థనలు గురుస్తుతి షష్ఠ్యంత ములు, తోహాలు, మంజరులు, దోరాలు, రగడలు, దరువులు కందార్థములు వృత్తములు చూర్ణికలు, తంగమట్టులు, అమితోగ్ర దండులు కళికలు, ఉత్క లికలు, లయ విభాతులు, తేవారములు మొదలైనవి హరికథలలో రచింప బడినవి. ఇట్టివి మన్నేపల్లి వారి రామచంద్ర లీలా తరంగణి యను హరి కథలో ఆదిభట్ల వారి గ్రంధములలో గలవు. ఆధునికమగు హరికథలలో రగడలు దరువులు కందార్థములు సీసార్థములు తంగమట్టులు తేవారములు కళికలు ఉత్కళికలు మొదలైన పాతరచనా ప్రక్రియలు లేవు. కృతి సంప్ర దాయపు కీర్తనలు పద్యములు దండకములు వచనములు ప్రధానముగాఁ గలవు.

## యక్షగాన - వస్తు సంగ్రహము

యక్షగానము మధుర కవితకు చెందినది. దీనినుండియే నాటకములు ఆవిర్భవించినవి. యక్షగానమందలి రచనలను గూర్చి వేటూరి ప్రభాకర

శాస్త్రిగారు సుగ్రీవ విజయమను యక్షగాన పీఠికలో యిట్లు చెప్పి యున్నారు. రగడలు ఏలలు జోలలు సువ్వాలలు ఆరతులు ధవళములు చందమామ సుద్దులు వెన్నెల పదములు విరాళి పదములు అల్లో నేరేళ్లు సీసార్ధములు కందార్ధములు త్రిభంగులు ద్విపదలు త్రిపదులు చౌపదులు షట్పదులు మంజరులు జక్కుల రేకులు ఇవిగాక పద్యములు. దరువులు కీర్తనలుగా మార్చబడి నవని వివరించి యున్నారు.

ఇట్టి రచనా ప్రక్రియలు గోకులపాటి కూర్మనాథ కవిచే విరచితమైన మృత్యుంజయ విలాస ములోను పింగరి దాసకృత మగు రామదాస చరిత్ర మున గలవు.

మచ్చున కొక్కొక్క ప్రక్రియ నీ క్రింద నుదహరించ బడినవి పరిశీలింపుడు.

## చూర్ణిక

శ్రీమదభినవానీత నవనీత వినీతా హారనియ తాచార చోర స్వభావ, భావిత గోప గోపికా కోపాను రూపోప శమన కమనీయ వినమ్ర క్రమాలాపం ఆవతం సిత కేకీ కలాపం పల్లవా పల్లవాధరి పయోధర పయోధరాభ వేణీ గ్రహణ నైపుణీ చణాను గణ తరుణారుణ కిరణారుణ పాణీతలం భక్త జనశీతలం ———————

బృందావనాంతరా భీర సుందర సుందరీ సందోహమదానంద కంద కందళిత కందర్ప సుందర సుకుమారం దేవకీ కుమారం.———

చూర్ణికల చివర కొన్నిటికి దండకములవలెనే "నమస్తే నమస్తే, నమస్తే నమః" అని ముగింపు యున్నది. ఈ పై చూర్ణిక రామాయణం

వెంకట నరిసింహ కవి గారి గోపాల కృష్ణ విలాసము నందలిది. ఇది స్తుత్యాత్మకమైనది. ప్రార్థనాదికములకే ఇది యుపయోగించబడు చుండును.

తంగమట్టు

ఈఁగువ నిచ్చు మాదిరులన్నియు మన్నేపల్లి వెంకటాచలం పంతులు గారి రామచంద్ర లీలా తరంగిణి లోనివి. దీనికి తంగమెట్టు అని గూడ పిలుచుటగలదు.

మౌనీంద్ర నేను - మౌనీంద్ర నేను
దీనుడ జన్మమును - దీనుడ జన్మమును
బూని యజ్ఞపశువును - గోల్కొతి
గాన నీ సుతు గోరితి ॥పల్లవి॥

వేయి గోధనము! వే! వేయి! హిరణ్యము। వే! లీయక!
బూనిమిము వేడితి। నోయనఘ। యనెబ్రీతి। మౌని॥

ఇట్లు అంబరీషుడు బుంచీకుడను మునితో పలుకును. ఇది విశ్వామిత్రుని మహాత్మ్యము వర్ణించు సందర్భములోనిది.

మంగళాష్టకము :—

శ్రీకాంతా కుచ కుంభ కుంకుమ పరీరం భాంకితో రసర్కః॥
శ్రీవత్సాంకిత భూషణ స్ప్రమన సామగ్రేనరో కేశవః
విష్వక్సేన ఖగేశ్వర ప్రభృతిభి ర్భక్తై సదాసేవితః
సీతారామ ప్రభో ర్నివాహ సమయే కుర్యాత్సువాం మంగళం॥

(ఇట్లు రెండు పేజీలు వ్రాయబడినది)

తేవారము :— ముఖారి రాగము.

హా సుకుమారు రాము - హా త్రిలోకాధి రాము
నేనెట్టు విడువ గలనె - నీకేల దయ దప్పెనె
కానలకు బంపుమనగ - కారణం బేమె వినగ
చానరో జెప్పుమికను - సదయ నాతో వేగను

మధురగతి రగడ :—

మద్యమావతిరాగం - ఏకతాళము
ఎంత సుందరంబు - అయోధ్య ఎంత విశాలంబు ॥పల్లవి॥
శ్రీనిలయము లగు - చిత్తరు మేడలు
మాణిక్యము ల న - మర్చిన గృహములు
బంగరు బూసినఁ - బ్రాసాదంబులు
రంగులుఁ దీర్చిన - రతనపు టరుగులు
నానాకరములగు - నాట్య భవనములు
బాణములుంచెడు - ధర్మ గృహంబులు
అతి రమణీయం - బై భువి విలసిలె
నతులిత మగునా - యమరావతి వలె ॥ఎంత॥

ఇట్లు అనేక చరణములు గలవు.

అమితోగ్రదండి :—

సురవర్యులంత - ధరఁ బుట్టి రంత సురరిపుల నంత
బరిమార్చి - చెండాడ వింత ॥సుర॥
వనచర రూప - మునను బ్రతాప - మనయంబు దోప
దనుజేంద్రు - గర్వంబు నాప ॥సుర॥

కళిక :— ఏకతాళము.

అమర వాహిని యైన గంగ మ-హాకృతి న్నివునెత్తి పై నను
బ్రముదమున దుమికి యును స్థాణుని— — — —
గొనక బరవ దొణగెను. — — — —

ఈ కళిక మాత్రాచందస్సునకు సంబధించిన రగడ భేదము. ఇది ఎని మిది పాదములుండును:

ఉత్కళిక :— అటతాళము.

విను వసిష్టమునీంద్ర శేఖర - ఘనుడు నిమి భూ
కాంతుఁ డీ ధర।
జని బ్రసిద్ధుడు నాదు వంశము
నను మహావిభవమున పూర్వము
భువిని నేలిన మూల పురుషుఁడు
ప్రవిమలుడు మిధి యతని పుత్రుడు

ఈ ఉత్కళిక, కళికలో సగభాగము.

షష్ట్యంతములు :— అనగా గ్రంధమును అంకిత మిచ్చు వివరము తెల్పునట్టి రచన.

తోహర :— పల్లవి,

శ్రీరామా జయ - సీతా రామా శ్రీరఘు రామా యనరే
శ్రీరాముని శుభ - చారిత్రంబిది - శ్రిత జనములారా వినరే॥

వీనిని మంజరులు దోరాలనియు యందురు. వీనిని మధ్యమ కాలములో పాడుదురు. రక్తిగా యుండును. ఇవి ఆదితాళమునకు ఏకతాళము

నకు మాత్రమే సరిపడును. కథను వివరింపుచూ సంధి వచనములు నడు పుటకు వీనిని రచించెదరు. గ్రంథమున ఎన్ని మంజరులు వ్రాయబడినను పల్లవి మాత్రమొక్కటే యుండును.

ద్విపద :—

చెలి యాలస్యంబు చేసిన రేవు
ఇలకెల్ల రఘురాము డింపును సొంపు
తొగడు హర్షము తో యువరాజు
గాగల డావల గతజల సేతు
బంధనంబగు గాన ప్రౌఢి మీరంగ
గంధ మాల్యాది సౌఖ్యములమ విడచి.

ఇట్లనేక పాదములుండును.

గద్య

ఇతి శ్రీమద్భగవ ద్భాగవతా చార్య దాసాను దాసుండగు మన్నెపల్లి వెంకటా చలపతి విరచితంబగు శ్రీమద్రామాయణ హరికథ యందు సాకేత కాండలో శ్రీరాముండు సీతాలక్ష్మణ సహితుండై యడవుల కేగుటకు దశరధుని యాజ్ఞనుబొంది యడవుల కరగుటయు ——— —

తృతీయస్త రంగము సంపూర్ణము.

దండకము :— (ములుకుట్ల వారి రచన)

శ్రీపార్వతీ లోకరక్షామణీ భక్తసంసేవ్య పాదార
విందే! మహాదేవి నీదివ్యచారిత్రముల్ శ్రీశ వాగీశ
దేవేశులే వర్ణనల్ చేయఁగా జాలరేనెంత దానన్

భవానీ। జగంబుల్ సృజింపంగ బెంపంగ ద్రుంపం
గ నీవేకదా మూలమో యమ్మ। నీపాదరాజీవముల్ నా
దు చిత్తంబునన్ నిల్పి సద్భక్తితోఁ గొల్చెదన్ దా
సురాలిన్ గటాక్షింపవే। విశ్వమాతా త్రిలోకాధి
నేతా సుమోక్ష ప్రదాతా। నమస్తే। నమస్తే।
నమస్తే నమః॥

దరువు :— ఆట తాళము

1 రామం హరి శ్రీరామం హరి శ్రీరామం హరి
సీతా రామం హరి॥

2 ప్రేమ నొసంగు శ్రీరామ మమ్మేలు వేగ
సామజ వరదుడ క్షేమమొనర్పవె ॥రామ॥

3 ఎంతవాడవు నీ వింతలు జెప్ప తరము
ఎంతదయాళుడ వాని వింతగా నమ్మితి ॥రామ॥

ఇట్లు మరి 3 చరణములు గలవు. ఇది కొల్లూరి పురుషోత్తమ కవి రచించిన యక్షగాన మందలిది. ఈ దరువులే కీర్తనలుగా సవరించి హరి కథలలో రచింప బడినవి. ఇది పదము వంటిది. పల్లవి ఒక ఖండము. అనుపల్లవి రెండు ఖండములు చరణం నాల్గు ఖండములుగ ఉండుట యీ గలదు.

కందార్థము :—

క॥ రామునిసతి దెచ్చితి మది
తామసమున తర్లి వచ్చి దశకంఠునితో
సామజవరదుడు పోరడె
సామాన్యుడు కాడు రామ॥చంద్రుడు నిసమా!

నా మనవి నమ్మమిక సుమ్మా
భూమిలో జన్మించే భాను వంశంబున
రామ భూపాలుడు రాక్షస వధచేయా
చంద్రుడు వినుమా నామనవి నమ్మమిక సుమ్మా॥

ఈ పద్యమును కొంతవరకు చదవి 'చంద్రుడు వినుమా' అనుపదము నుండి పాటగాఁ బాడవలెను. సీసార్థములు ద్విపదార్ధములు గూడా యిట్లే యుండును. ప్రస్తుతము వీనిని హరికథలలో వాడుట లేదు. యక్షగానము లలో వీని వాడక మెక్కువ. అయిననూ ఈనాటి ఈరోజులలో వినుటకు ముతక తరహాగా గోచరించును. ముదుసలులు భక్తిగా పాడుకొనుటకు వుపయోగించును.

లావణి :—

ఇది మహారాష్ట్ర హరికథలకు సంబంధించిన ఒక ప్రక్రియ. దీనిని పూర్వము తెలుగులో వాడుచుండిరి. ప్రస్తుము అమలులో లేదు.

పూర్వపు హరికథలలో పద్యరచన తక్కువ. ఆధునికమందు ఎక్కువ. ఈ పద్యములలో రాగప్రాధాన్యముతో భావయుక్తముగా ఎక్కువ విషయము గలిగిఁ బాడుటకు సీసములు మరియు చంపకమాలాది ప్రఖ్యాత మగు వాల్గువృత్తములే యోగ్యములు. నేటి హరికథలలోని గేయములలో సినిమా సంగీతపు ఫక్కీకకు పద్యములలో డ్రామా పద్ధతికి జన బాహుళ్య ములో ఎక్కువ ప్రాధాన్య మొసంగబడు చున్నది. పూర్వము కర్నాటక సంగీతపద్ధతి శాస్త్రరీతికి విలువెక్కువ. నేడట్లులేదు. ఆదిభట్ల వారి గ్రంధ ములన్నియు సీసములతోనె నిండియున్నవి. విషయ వర్ణనలకు సీసములు సరిపడును. పరిమివారి రచనలో చంపకమాలలు, ఉత్పలమాలలు, శార్దూల ములు, మత్తేభములు ఎక్కువ. రగడలు మోక్షగుండ రామాయణమందు నూ

మన్నేపల్లి వారి రామచంద్ర లీలా తరంగిణి యందునూ మిక్కుటముగా రచింపబడినవి. ఇవి పురములు, అరణ్యములు, సభలు, ఇత్యాది దృశ్యములు వర్ణించుట కుపయోగపడును. ఇవి తాళాన్వితములు. నవవిధములైన రగడలు గలవు. వీనిలో మధురగతి రగడ హరికథలలో నెక్కువగా గన్పట్టు చున్నది. దండకములు యతిప్రాసరహితములు, తెలుగులో తగణదండకములెక్కువ. ఇవి శృంగార, హాస్య, స్తుత్యాత్మకములై యున్నవి.

కీర్తనలు, పల్లవి అనుపల్లవి చరణము మిత్రము అను భాగములను కలిగియుండును. భావమును బట్టి కొన్ని కీర్తనలు షడ్జమస్థాయిలో పల్లవి ప్రారంభిపబడి పంచమ స్థాయిలో అనుపల్లవి ఎత్తుగడ యుండును. మరి కొన్ని పైషడ్జమమునుండి అవరోహణ క్రమములో పల్లవి ప్రారంభింపబడి అనుపల్లవి పైషడ్జమమునుండియే ఆరోహణ క్రమములో పాడబడుచుండును. చరణములు పంచమస్థాయిలో ప్రారంభించబడును. ఇట్లు భావము ననుసరించి కీర్తన ఎత్తుగడ పద్ధతులు మారుచుండును. కీర్తనల ఎత్తుగడలు అగతము అనాగతము సమము అని మూడురకములు. మిత్రలు పల్లవికి రెట్టింపు కాలములో దురితముగా పాడబడును. సామాన్యముగా హరికథలలో నుపయోగించుచుండు తాళములు ఆది, త్రిపుట, రూపక, జంపె, తిశ్ర, మిశ్ర, ఏక, అనునవి. రౌద్ర భీభత్సాది రసపోషణకు పంచచామరము, భుజంగ ప్రయాత వృత్తములు రచింప బడును. మచ్చునకొక్కొక్క రకపు తాళమున కొక్కొక్క కీర్తన దిగువ నుదహరించబడినవి.

ఆదిభట్లవారి రచన :—

ఆది తాళం బేగడ రాగం.

ప॥ రామచంద్ర సీతామనోహరా
దఘుకుల జలధి శశీ! పరమాత్మా ॥రా॥

అ॥ నీమహిమఁ దెలియ నెంతవాఁడ నే -
నీముద్రికఁ దాల్ప నాతరంబా ॥రా॥

చ॥ నీవుదేవుఁడని నేనెఱిఁగితిని -
నిర్హేతుక కృప నీదాసుఁడను।
కేవల ధర్మస్వరూప నిన్నుం -
గీర్తింపని వారి జన్మమేల। ॥రా॥

కేదార గౌళ - రూపక తాళ

ప॥ నీపదంబు దాకి నంత - నేఁబవిత్ర నైతి రామ ।నీ।

అ॥ శ్రీపతి నీమహిమ బొగడ - శివుని తరమ
పూతనామ ।నీ।

1. చ॥ నీయనుగ్రహంబు తప్ప - నిర్గన మఱి వెరవు లేదు
వేయేలా నీపుదక్క - వేఱెద్దియుఁ గానరాదు ।నీ।

2. చ॥ సగుణుఁడవు న్నిర్గుణుడఁవు - సజ్జన రక్షకుండవున్
జగము నీకు వేఱు కాదు - స్వర్గమునకుఁ
జాయ వలెను ।నీ।

భూపాల రాగం - తిశ్రగతి తాళ

ప॥ శ్రీరామ చంద్రా - శ్రీరామ చంద్రా ।శ్రీ।

అ॥ సీతా మనోహరా - శ్రీరామ చంద్రా ।శ్రీ।

చ॥ జగదేక వీరా - వజ్జనాధా రా
సత్యావతారా - శ్యామలాకారా ।శ్రీ।

ఈ మాదిరిగా ఇందు మొత్తం అయిదు చరణములు గలవు.

శహన రాగం - జంపె తాళం

పరిమి వారి రచన :—

ప॥ అన్యమేమెల్లమో - యఖిలేశ గల్పుకో
మ్మందఱ న్నీలోన - నంతకన్నను భాగ్య ।అ।

అ॥ పుణ్యమూర్తివి సర్వ - భూత మయుడవు నిన్ను
బొంది మేమవ్యయా - నంద మింకిట గందు ।మన్య।

చ॥ తల్లియును తండ్రియును - తనయులాప్తులు సుతుల్
దైవమును గురుడవును - తలప నన్నియు నీవే
కల్ల సంసారమున - గడగండ్లబడి తెలిపి
గననేరమిక గటా - క్షింపుమా నీదాన్య ।మన్య।

సావేరి రాగం - త్రిపుట

పరిటి వారి రచన :—

ప॥ శ్రీమహేశ దయానివేశ! శ్రిత చకోర కువలయేశ ।శ్రీ।

అ॥ సామజ చర్మాంబర వా! చామ గోచర నిర్వికార ।శ్రీ!

మిశ్ర॥ నీ మహిమలు దెలియగ లేరా। నీరజాసనాది సుపర్వులు
నామొరాల కింపవదేరా నాగభూష దురితాంధః పూష। ।శ్రీ।

చరణం॥ వేదశాస్త్ర పురాణ వంచయ॥ విదితశీల భక్తాను కూల
ఆది మధ్యాంత విరహిత। అవ్యయానంద తేజోమయ॥

మిశ్ర॥ శ్రీధర శుభకర పురహర సచ్చిదానంద స్వరూప గం!
గాధర నిత్యనిరంజన నిష్కళంక నిరుపమాన
నిరామయా ॥శ్రీ॥

నాద నామ క్రియ - ఏక తాళం

కొమ్మూరి బాలబ్రహ్మానందం గారి రచన :—

ప॥ అంతా శివుని మయం ఓజగ - మంతా శివుని మయం॥

అ॥ సుంతయు సంశయ - సూచన కనరా ॥దంతా॥

చ॥ పంచ భూతములు - భానుడుఁ జంద్రుడు
సంచలనంబును - చాలంచిన తల ॥మంతా॥

నాటకురంజి రాగం - మిశ్ర తాళం

కొమ్మూరి వారి రచన :—

ప॥ హింస చేయుట తగదు సోదరా - జీవ ॥హిం॥

అ॥ మాంసాహారము చేటు సోదరా - జీవా ॥హిం॥

చ॥ ఎడ్డెముతోడ మీ - రెన్నోపనులఁ జేయు
గొడ్డులఁ జంపుట - కూడునే జీవ ॥హింస॥

వ॥ ఇట్లు మరి నాల్గు చరణములు గలవు.

పంచ చామరము.

ఖిలాఖిలా భయంబు లేక కాన వింటి నారికిన్
యిలాకసంబు ఘొల్లునింద యేలలాగెదోరి నా
బళాళి రూపు బాపినావు బాల మ్రింగువాడరా
బిలాబిలా బిలానరుండ పారిపోక నిల్వరా

హ రి దా సు

హరిదాసను పేరును బట్టియే హరిదాసు మూర్తిమత్వము మన మనో నేత్రములకు గోచరమగుచున్నది. హరిని గొలుచువాడు హరిదాసుడు. హరి

కథకునకుండదగు లక్షణము లెట్టివో ములుకుట్ల వున్నయ్య శాస్త్రి భాగవతారు గారు రచించిన పూలబుట్టయను ఖండకావ్యములోని ఈ క్రింది పద్యమును పరిశీలించిన తెలియ గలవు.

పద్యం॥ గానము సత్కవిత్వమును కమ్మని కంఠము సర్వశాస్త్ర వి
జ్ఞానము హావ భావ లయ సంపద ముద్దులు మూటఁ గట్టు నా।
ట్యానుభవంబు యుక్తమగు హాస్యము వాగ్మధురంబు శ్రీహరి!
ధ్యానము నందు భక్తి హరిదాసుని లక్షణ మాంధ్రసోదరా॥

పూర్వపు హరిదాసుల జ్ఞాన సముపార్జనము అపారము. అదియొక మహా సముద్రము. పూర్వము భక్తి ధ్యేయముగా భాగవతార్లగుచుండిరి. ఇపుడు భుక్తి ధ్యేయముగా హరిదాసులగు చున్నారు. నిజమైన హరిదాసు లెట్లుండవలెనో ఈ శ్లోకము తెలుపును.

శ్లో॥ యేకంఠ లగ్న తులసీ నళినాక్ష మాలాః
యే బాహు మూల పరిచిహ్నిత శంఖ చక్రాః
యే తే లలాట ఫలకే లసదూర్ధ్వ పుండ్రాః
శ్రీ వైష్ణవా భువన మాశు పవిత్ర యంతిః

తులసి పూసలమాల ధరించి నుదుట ఊర్ధ్వపుండ్రపు బొట్టు పెట్టి కాళ్లకు గజ్జెలుగట్టి చేత చిఱుతలు బట్టి మెడలో పుష్పమాల గలిగి మరియు పవిత్రతకై పట్టుబట్ట గట్టి కట్టు బొట్టు జుట్టు అన్నసామెతగా హిందూ సంప్రదాయముట్టి పడునట్లుండుట హరిదాసు వేషమై యుండవలయును. పట్టుబట్టలు లేనిదే పాడరాదా? యని కువిమర్శకులనవచ్చును. అది నాస్తిక

వాదమగును. గుడిలోనేనా దేవుడు, మన హృదయంలో లేడా? యని యన్న ట్లుండును. గుళ్లు ఇండ్లగా మారిస్తే భక్తికుదిరేదెలాగా? ఇట్టి వాదనలు పరమో న్నత స్థితికేగిన పరమ హంసలు చేయుట యోగ్యమేమోగాని పామరుల మైన మనబోటి సామాన్యులము సగుణభక్తి పరులము చేయవలసిన విమర్శ గాదు. సగుణభక్తులకు విగ్రహాదులు ఆచార వ్యవహారము లవస రము. వృత్తికి దగిన వేషం పాత్రకు దగిన భాష అత్యవసరం. నిర్గుణ భక్తులకు తాకికాచారములతో నిమిత్తము లేదు. ప్రపంచములో నిర్గుణో పాసకులు ఋషుల వంటి వారు. నూటికి కోటికి ఏ ఒక్కరో యుందురు. అందుచే హరిదాసుకు పవిత్ర వేష ధారణ యవసరము. లేనిచో గుళ్లెందుకు దేవుళ్లకు అలంకారము లెందుకు? ఉత్సవాదు లెందుకు? అను ప్రశ్నలు బయలుదేరి అసలు భక్తి మార్గమునకే ప్రమాదము సంభ వించును.

మోతుగుంద రామాయణ హరికథ యందలి ఈ పద్యమును తిలకించి నచో పూర్వపు హరిదాసుల వేషము లర్థమగును.

ఉ॥ తంబురుఁ గాలి గజ్జెలును దాళ మృదంగ ముఖాది భవ్య నా!
దంబులు పొల్పమీఱ హరి దాస చయం బరుదెంచి నృత్త గీ
తంబుల రామమూర్తి చరితంబును బాడుమహోత్సవంబు సాం
తం బగునంత దాక భజినంబు లొనర్చిరి సంతసంబున్ ——— —

సీరుకాని వస్త్రములు ధరించి పట్టెనామములు పెట్టి తంబూర, తాళము, గజ్జెలు, చిటికెలతో హరిదాసులు తాండవమాడుదురని తూము నృసింహదాసు గారి చరిత్రలో వివరింపబడినది.

బి. బాలాజి దాసుగారు సంగ్రహ రామాయణ హరికథ తొలిపలుకులో హరికథ యన నేమో దాని ప్రయోజనమేమో హరికథకు డెట్లుండవలెనో వివరించెను. అందు హరికథకుడు అను చర్చ నీక్రింద పొందు పరచడమైనది.

## హ రి క థ కు డు

ఎవ్వడైన నొక్క మానవుడు మూఢులగు వారికొక నూతనంబగు నీత్యుపదేశంబును గరువ నుపక్రమించుటకుఁ బూర్వమతడు దానుపదేశింప నుద్యమించి యున్న నీత్యుపదేశ తత్వ జ్ఞానమున బారంగతుడై యుండవలయును. అన్యులకుపదేశించుటకుఁ బూర్వమత డాచరించి యుండనిచో నతని హితోపదేశ వాక్యములన్నియు మిధ్యాభిభూతములగు వ్యర్థ ప్రలాపములే యగును. ముక్తికి మూలమగు భక్తిని గూర్చి ప్రబోధింప బూను వ్యక్తి నదుద్దేశ నంపన్నుడయి నిష్కళంక చరిత్రుడయి సత్క్రియా చరణయుక్తుడయి సర్వ విధ మానవోచిత లక్షణ లక్షితుడయి యుండనిచో హరికథా ప్రబోధమునకు నెంత మాత్రము నర్హుడు కాజాలాడు. భక్తి జ్ఞాన ప్రబోధ జనితానంద మనుభవైక వేద్య మగుటచే హరికథకుడు కూడ యానందమును సత్కార్యాచరణము ననుభవించియే సోదరమానవుల ననుభవింప జేయ గడంగు టుచితము. ఇక్కాలమున చరిత్ర భ్రష్టులయి జ్ఞాన దూరులయి సప్త వ్యసన లోలురయు స్వార్థాంధులయి ద్విపాద పశువుల నదగు నిరక్షర కుక్షులు హరికథా ప్రబోధముల నుదరం భరత్వమున కుపయోగించు సాధనములుగ జేసికొను టెంతయు శోచనీయము. విషయ లంపటలగు వారు హరికథల జెప్పబూనుటం జేసియే యవ్వాని మహాత్మ్యమును నడల జొచ్చినది. హరికథకుడన్న నవ్యక్తుడగు శ్రీహరుని భావాతీతములగు సద్గుణములను సత్క్రియలను జిత్రించు చిత్రకారుడే యనియు నంగీత జ్ఞానమునను మిథ్యావాక్చాతురీ విలసంబునను వెలయు వాచాలుండు కాడనియు

హరికథా శ్రవణంబున జ్ఞానము నార్జించి సంసార సాగర తరణోపాయంబు నన్వేషింప సంకల్పించు గృహస్థులెల్లరు గ్రహింతురుగాతమ్మని మామ కంబగు విజ్ఞప్తి.

1911 సంవత్సరం విరోధికృత సంవత్సరాది ఆంధ్రపత్రిక సంచికలో ఆదిభట్ల నారాయణదాసుగారి వ్యాసమున హరికథకుని లక్షణములిట్లు వర్ణింప బడినవి.

సీ॥ ఘన శంఖమో యన గంఠంబు పూరించి
మేలుగ శృతి లోన మేళగించి
నియమము తప్పక నయ ఘనంబుల నెక్క
రాగ భేదంబుల రక్తిగొల్పి
బంతులెగిర్చిన వగిరి కాలజ్ఞతన్
జాతి మూర్ఛనలొప్ప స్వరము పాడి
చక్కని నృత్యము సర్వ రసానుగు
ణంబు గాగ నభినయంబు చేసి॥

గీ॥ స్వకృత మృదు యక్షగాన ప్రబంధ సరణి
వివిధ దేశంబులం బిన్న పెద్దలు గల
బలు సభల హరిభక్తి నుపన్యసింప
లేని సంగీత కవితాభిమానమేల!

శ్రుతి స్మృతి విజ్ఞానము శబ్దానుశాసనజ్ఞత అభిధాన ప్రవీణత ఛన్దః ప్రభేద వేదిత్వము అలంకార కౌశలము రసభావ పరిజ్ఞానము దేశ స్థితి చాతురి నానాభాషా వైశద్యము సర్వకాల విశారదత్వము కళాశాస్త్ర నైపుణి తూర్యత్రితయ చాతుర్యము హృద్యశారీర శాలిత లయ తాల కళాజ్ఞానము,

ప్రభూత ప్రతిభోద్భూత భాష్యత్వము, సుభగ గేయత దేశీ రాగాభిజ్ఞత్వము వాక్పటుత్వము, సభావిజయ సామర్థ్యము, రాగద్వేష పరిత్యాగము ఉచితజ్ఞత సార్థశ్రీత్వము అనుచ్ఛిష్టోక్తి నిర్బంధకః, నూత్నధాతు వినిర్మాణ దక్షత, పర చిత్త పరిజ్ఞానము, ప్రబంధ ప్రగల్భత, ధ్రుతగీత విరచనా నైపుణి, పద్యాంతర విదగ్ధత, త్రిస్థాన గమనప్రౌఢి, వివిధాలప్తి నిపుణత, విశేషావధానశక్తి రమ్య రూపము స్వేచ్ఛా సంచారము స్వతంత్ర జీవనమును వాగ్గేయకారుఁడగు నుత్తమ కథకుని లక్షణములు.

## భా గ వ తా ర్

హరి దాసుకు భాగవతార్ అని పిలుచుటయు వాడుకలో గలదు. భగ వత్సేవకుడు గాన భాగవతారయ్యెను. భాగవతులు అని మరియొక సంబో ధనము గలదు. పూర్వము యానాదులు, గొల్లలు, మాలలు, కూచిపూడి బ్రాహ్మణులు యక్షగాన ములను వీధి నాటకములను తెల్లవార్లు (రాత్రి యంతయు) ఆడుచుండెడివారు. అట్టి వారిని భాగవతులు అనియు పామరులు భాగొతు లనియు పిలుచు చుందురు. వారి నాటకమును భాగవత సేవకు బదులు భాగోత సేవ యని యనెడి వారు. భాగవత సేవ యనగా భక్తుల యొక్క సేవ చేయుట ద్వారా భగవంతుని సేవయని యర్థము. భగవంతుని లీలలు భక్తుల చరిత్రలు గలది పోతన భాగవతము. ఈపదము నుండి యుత్పత్తియైనదే భాగవతుడు భాగవతార్ అను పదములు. భాగొత సేవ అను మాటను కొందరు అవహేళనగా భావించుదురు. అంతూ పంతూ లేక విపి గించు పనిని భాగోత సేవయని పోల్చి గేలిసేయుట జరుగు చున్నది. యక్ష గాన నాటకములు తెల్లవారు వరకు ఆడబడుచుండునుగదా?

శ్రీహరి గానలోలుడు శివుడు తాండవ లోలుడు. అందుచే గానపరు లందరికి హరిదాసులను నామము సార్థకమై యున్నది. అంతేగాని హరిదాసు

శివదాసు అనియనుట సరిపడుట లేదు. భాగవతులన నెట్టివారో సీలి వీర రాఘవ దాసు రచించిన మాధవదాసు చరిత్రమను హరికథలోని ఈపద్యమును పరిశీలించినచో తెలియగలదు.

సీ॥ శ్రుత్యంత విశ్రాంత మధ్యమ కమనీయ
భగవత్ప్రసంగతుల్ భాగవతులు
సకల సన్ముఖ యోగి జన సదానందైక
పరమ భాగ్యోదయుల్ భాగవతులు
కృష్ణపదధ్యాన కేవలామృతపాన
పరిణామ యుతులు శ్రీభాగవతులు
బహుపాతకానీక పరిభవ ప్రక్రియ
పరుషాగ్రమూర్తులు భాగవతులు.

గీ॥ భావతత్వార్ధ వేదులు భాగవతులు
బ్రహ్మవాదానువాదులు భాగవతులు
పిరులు దవరంగనెన్నడు జేటులేని
పదవి నొప్పారు వారు వో భాగవతులు.

పింగరిదాస విరచిత మగు రామదాస చరిత్రమను హరికథలోని పరమ భాగవతస్తుతి పరిశీలించినచో భాగవతులన నెట్టివారో బోధపడును.

క॥ మది ప్రహ్లాదార్జున నా
రద సనక సనంద శుక పరాశర రుక్మాం
గద భీష్మ శౌనకాదుల
సదయాత్ముల భాగవతుల సతతము గొలుతున్.

క్రైస్తవమత సంబంధమగు కథలను గూడ క్రైస్తవులగు అత్తోట వెంకటరత్నంగారు మొదలగు కొందరు హరిదాసులు హరికథలను చెప్పు చుండిరి. వారువారిమత సంప్రదాయ పద్ధతిన వేషము ధరించుట న్యాయము.

## భా గ వ తా రి ణి.

పూర్వము భాగవతారిణు లరుదు. ఈనాడు భాగవతారులకంటె భాగవ తారిణులే ఎక్కువ ప్రాముఖ్యముగా గన్పట్టు చున్నారు. ప్రజలెక్కువగా భాగవతారిణులనే యాహ్వానించి వారి హరికథలను విని యానందించు చున్నారు. అందుచే వారి విషయముగూడ కొంత చర్చించుట యవసరము. ఈకాలములో ప్రజలలో భక్తి ప్రపత్తులకంటె వింత వినోదములకే ప్రాధా న్యత యేర్పడి యున్నది. పండిత కథలకు గిరాకి తగ్గినది. పామర రంజక కథల విలువ హెచ్చినది. ఎక్కువ ఓట్లు గ వాడె గొప్పనాయకుడైనట్లు ఈ నాడెక్కువ జనమును అకర్షించువాడె గొప్ప హరిదాసుగ పరిగణింప బడు చున్నాడు.

భాగవతారిణుల వేషములు భాషలు భక్తి భావములకు దోహద మొసంగు రీతిగా నుండుట ధర్మము. భాగవతారిణిని గాంచుట తోడనె భక్తాగ్రగణ్యులైన వారి శిరోమణులు పతివ్రతా రత్నములు నగు సీత, సావిత్రి, రుక్మిణి, అన సూయ, అరుంధతి, సుమతి, సక్కు, మీర మొదలగు స్త్రీ రత్నములు స్ఫురణకు రావలయును. అట్టి యుత్తమ భక్తి వేషములు దాల్చుట భక్తి ప్రపత్తులు గలిగి భక్తిబోధన గావించుట భాగవతారిణుల బాధ్యత అయి యున్నది.

## హ రి క థ వ్యా పా ర మా ?

హరిదాస దాసినులు మనసా వాచా కర్మణా త్రికరణ శుద్ధిగా భక్తులై యుందురు. పూర్వపు దాసులు వసుధా భాగ్యవంతులుగా నుండెడివారు. ధనా

ర్జనమునకు గాక భక్తి ప్రచారమునకే హరిదాసు లయ్యెడి వారు. ప్రపంచమునకే భక్తి బోధకుడగు భాగవతారు వృత్తి మహా భాగ్యవంతమైనది. అట్టి హరిదాసులను కొందరు లక్ష్మీదాసులుగా వ్యాఖ్యానించుదురు ఇది అర్థరహితము హరిదాసు డబ్బుకు దాసుడగుట విచారకరము.

హరికథను వ్యాపారముగా తలంచుట పొరబాటు కానీ ఈరోజులలో ప్రజలుగూడ ధనమెక్కువ నార్జించినవానినె గొప్పవానిగ నెంచుచున్నారు. పూర్వము కోరిక రహితునికి గౌరవమెక్కువ. నేడు కోరిక సహితునికి విలువ యెక్కువ. పూర్వము పరలోకచింతన గలిగి యుండి ఇహలోక వాంఛల నిగ్రహించి భక్తికి ప్రాధాన్యమిచ్చుట పరిపాటి. దురదృష్టవశాత్తు నేడు హేతువాదన అను నెపముతో పూర్వ సిద్ధాంతములకు విరుద్ధముగా నడచుచున్నదీ ప్రపంచము. పరలోకముపై నమ్మకము సన్నగిల్లుచున్నది. తాత్కాలిక సౌఖ్యములకే ప్రాధాన్యత హెచ్చుచున్నవి. స్వార్థము పెరిగినది. నిస్వార్థము తరిగినది. దేవతల ప్రవృత్తి యగు తృప్తి తగ్గినది. రాక్షస ప్రవృత్తి యగు దురాశ ప్రబలినది. Art for art sake అను సామెత ప్రకారము నేడు కళలు లేవు. కళలు వ్యాపారాత్మకములగుచున్నవి. ప్రతివాడు బోధకుడైనాడు. బోధింప బడువాడరుదైనాడు కళలు వ్యాపారాత్మకములు కారాదు. ఇతర కళలెట్లున్ననూ ఆ ధనాశా పిశాచికి భాగవతార్లు బలియై పోరాదు, భక్తి పూరితముగ నుండదగు హరికథా సంప్రదాయమునకు కళంకము తేరాదు. మహారాష్ట్రమున హరికథ ప్రారంభించిన సమర్థరామదాస స్వామి హరికథకులు ధనమాపించరాదని నియమము చేసినారట. ఒకప్పుడు ఆదిభట్ల నారాయణ దాసుగారు మైసూరు మహారాజా వారి ఆస్థానమున కథా కాలక్షేప మొనరించిన తదుపరి రాజావారు దాసుగారిని ఎంత ధనమివ్వమందురని ప్రశ్నించినారట. అందుకు బదులుగా దాసుగారు బుట్టెడు బెంగుళూరు వంకాయ లిప్పించండి బాబూ అని యడిగిరట. దాసుగారి నిస్వార్థ

మునకు సంతసించి రాజావారు వీణ, తంబురా, బంగారుమురుగులు వెయ్యి న్నూటపదహార్లు 2 శాలువలు రెండవక్లాసు రైలుటికెట్టుతో సన్మానించిరని, దాసచరిత్ర వలనతెలియుచున్నది. అట్టివి ఆదర్శమైన హరిదాసుల జీవితములు దాతల యొక్క దాతృత్వములు. పూర్వము హరిదాసులు తమ స్వంత ధనము వెచ్చించి రామోత్సవములు క్రిష్ణోత్సవములు తమ యిండ్లలో చేయుచూ అన్నదానములు చేయుచుండెడి వారు. ఒంగోలు తాలూకా పెదకొత్తపల్లి వాస్తవ్యులు రామాయణం శీతాపతిగారు పేరు ప్రఖ్యాతులు వహించిన హరి దాసు సంగీత సాహిత్య ప్రవీణులు. వారింట ప్రతి సంవత్సరము కృష్ణోత్స వములు జరుగు చుండెడివి. హరిదాసులను భజనపరులను పిలచి అయిదు రోజులు అన్నదానములు చేసి నూతన వస్త్రదానములతో సన్మానించి పంపు చుండెడివాడు.

పూర్వపు హరిదాసులు వారిఇండ్లలో అఖండమైన దేవతార్చనలు గలిగి యుండెడివారు. గజారోహణములు కనకాభిషేకములు జరిగెడివి. అట్టి మంచియలవాట్లు ఈనాడు మరుగున బడినవి.

పున్నేపల్లి వెంకటాచలం గారు మోక్షగుండ రామాయణ హరికథను తనస్వంత ఖర్చుతో తనయింట ఒకనెల చెప్పించినట్లు వారిగ్రంధమువలన తెలియుచున్నది. గోపాలక్రిష్ణ విలాస గ్రంధకర్త రామాయణం వెంకట నరిసింహ కవి గ్రంధపరిశీలనను బట్టి ఆయన మహావిద్వాంసుడని గోచర మగుచున్నది. వీరి గ్రంధము 1870 కి పూర్వము రచింపబడినది. అట్టి విద్వాంసుడు ధనాశాపీడితుడై దేశములవెంట పరుగెత్తక బమ్మెరపోతనవలె హాలికవృత్తిచే జీవించెనని ఏతద్గ్రంధమున విశదము గావింపబడినది. మరియు సదరు వెంకట నరిసింహముగారు తమయింట జరిపించు రామోత్సవాధులలో పాడుకొనుటకై గోపాలకృష్ణ విలాస గేయ ప్రబంధమును ద్వాత్రింశన్మంజరి

రామకృష్ణ తారావళి నారాయణ తారావళి పరమాత్మతారావళి మరికొన్ని పద్య స్తోత్రములు రచించుకొన్నాడని గూడ వివరింపబడినది. ఇట్లేన్నియో యుదాహరణములు గలవు. పూర్వపు హరిదాసుల భక్తి అంత నిస్వార్థమైనది నాకుఁదెలిపి ఆకోవకు చెందిన నెల్లూరు వాస్తవ్యులు భాగవతారు పండితారాధ్యుల సాంబమూర్తి గారు నేడు గొప్పగా త్యాగరాజ ఉత్సవములు జరిపించుచున్నారు.

## ప్ర ఖ్యా త హ రి దా సు లు.

హరికథలు పామర జన బోధకై యను యభిప్రాయము చాల పొరబాటు. పూర్వము అందరూ హరికథా కేసరి బిరుదాంకితులే యుండెడి వారు. ముసునూరి సూర్యనారాయణ గ్రామఫోను రికార్డులో హరికథ చెప్పిన ఘటికులు. వీరు పెద్దింటి సూర్యనారాయణ దీక్షితులు గారి హరికథలు గానము చేసెడి వారట. నరసారావుపేట వాస్తవ్యులు బుద్దవరపు కురంగేశ్వరరావు, B. A. B. E. D., హరికథలో తన్మయు లయ్యెడి నిష్కల్మష భక్తులు. ఒంగోలు తాలూకా కుందుర్తి రామమూర్తి గారొక గొప్ప విద్వాంసుడు. ఒంగోలు తాలూకా పెదకొత్తపల్లి వాస్తవ్యులు రామాయణం సీతాపతి గారొక గొప్ప హరికథకుడు. వీరు గుంటూరు, ఏలూరు, నరసారావుపేటలో రామాయణ హరికథలు చెప్పి అఖండ కీర్తి నార్జించి యుండిరి. సురభి కంపెనీలలో నటించిరి. రేమవకొండ చిన్నయ్య గారివద్ద సంగీతం నేర్చిరి ప్రయాగ సంగమేశ్వర శాస్త్రిగారు గుంటూరువద్ద అవనిగడ్డ నివాసం. వీరు సంగీత సంస్కృతము లందు ఉద్దండ పండితులు. దక్షిణాదిన సంగీత శిక్షణపొందిరట. చిత్తూరు జిల్లా వాసి. పాణ్యం సీతారామ భాగవతారు వారి సోదరులు అనంత రామ భాగవతార్లకు నెల్లూరు జిల్లాలో అఖండమైన పేరు గలదు. అనంత రాం భాగవతారు గారు రామాయణములు కాలక్షేపము చేసెడి వారు.

సీతారామ భాగవతార్ గారికి రామదాసు కథ పేటెంటు జూటూరి రామదాసు గారు నెల్లూరీయులు. వీరు ఆంధ్రమంతయు సంచారము చేసి కీర్తినార్జించిరి. మంచి సంగీత విశారదులు. గద్వాల మొదలగు సంస్థానములలో సన్మానములు పొందిరి. మైనంపాటి నరిసింగరావు గారి నివాసం ఒంగోలు తాలూకా టంగుటూరు. వీరుగూడ తమిళ దేశమున కేగి సంగీతము నేర్చి వచ్చిన వారే. వీరు అనేక హరికథా గ్రంధములు రచించిరి. శృంగార రస పోషణ వాక్సమత్కృతి వీరి సహజ నైపుణ్యము. వీరి సోదరులు సుబ్రహ్మణ్యం రామయ్య గారలు వీరికి కథలో వంతపాట పాడుచుండెడి వారు. ఒంగోలు తాలూకా బ్రాహ్మణ నిడమానూరు వాస్తవ్యులు బొమ్మరాజు సీతారామ దాసు గారు గొప్ప భక్తాగ్రేసర హరికథకులు. చదలవాడ తిరునాళ్ల సమయమున తరంగ కాలక్షేపము చేయుచూ స్వామివారి సన్నిధిలో పరమపదించిన పుణ్యాత్ములు. ఇట్లే నెల్లూరులో సాయి బాబా మందిరమున కాలక్షేపమొనరించుచూ గోవిందాయని ప్రాణములు వదలిన భక్తుడు బండి సుబ్బరామిరెడ్డి గారొకరు గలరు. బొమ్మరాజు సీతారామ దాసు గారి కీర్తనలను ఆకాశవాణి భక్తి రంజని కార్యక్రమములో మనము వినుచున్నాము. అద్దేపల్లి లక్ష్మణశాస్త్రి క్రిష్ణరాయబారం, అనసూయ హరికథలను ఆంధ్ర అంతటా కాలక్షేపము చేసి రికార్డు బ్రేక్ చేసిన వ్యక్తి. సాలెకులజులు చీరాల ఉమాకాంతము గారు, ఉత్తర గోగ్రహణ హరికథ వీరిసొత్తు. పిల్లల మర్రి రామదాసు గారు తాండవ లోల బిరుదాంకితులు, వీరు పట్టభద్రులట. వీరందరు పూర్వీకులు కీర్తి శేషులు. మరియు పుచ్చల భ్రమర దాసు బవద్దాసు ఆదిభట్ల నారాయణ దాసు వీరందరు సమకాలికులే.

నాగరాజు సుబ్బారావు గారు తరంగ కాలక్షేప మొనర్చుటలో అఖండులు. వీరు హరికథలు గూడ చెప్పుదురు. కాకినాడ వేదనభట్ల వెంకట రమణయ్య గారు మహావిద్వాంసులు ఆదిభట్ల వారి శిష్యులు వేదనభట్లవారు.

ఆకాశవాణి భక్తి రంజని కార్యక్రమములో ఆదిభట్ల వారి కీర్తనలను పేరన భట్ల వారు మనకు పాడి వినిపించు చున్నారు. భట్టిప్రోలు కాపురస్తులు పాతూరి మధుసూధన శాస్త్రిగారు సంస్కృత పండితులు రచయిత. వీరు వారణాసి సంస్కృత విద్యా పీఠమున సంస్కృత భాషలో హరికథా కాలక్షేప మొనర్చి పండితుల మన్నన లందిన మహానుభావులు. ఇటీవల హైదరాబాదు లో జరిగిన ప్రపంచ తెలుగు మహా సభలలో సన్మానము పొందిన అదృష్ట వంతులు. కడలి వీరదాసు గోదావరి జిల్లా వాసులు. ఆదిభట్లవారి శిష్యులు, హిందీలో భారతం హరికథ చెప్పగలదిట్ట, కవిగూడా. నెల్లూరు జిల్లా కోవూరు నివాసం కామరాజు రామమూర్తి గారొకరు గొప్ప హరిదాసు గలరు. వీరు చిత్తూరు నెల్లూరు గుంటూరు జిల్లాలలో ప్రప్రధమున మహాభారత హరికథలు అఖండముగా చెప్పి యశస్సు నార్జించిరి. తెనాలి ములుకుట్ల సదాశివ శాస్త్రి గారు సంగీత సాహిత్య విశారదులు. త్యాగరాజ చరిత్ర చెప్పుటలో ఆంధ్ర లో వీరికి ప్రత్యేక స్థానము గలదు. ఇతర రాష్ట్రములలో గూడా ఆంధ్ర సభలలో త్యాగరాజ హరికథ చెప్పినవారు వీరొక్కరే. ఆకాశవాణి భక్తి రంజనిలో వీరు మోక్షగుండ రామాయణ కీర్తనలు గానం చేస్తుంటారు. ప్రయాగ నరశింహ శాస్త్రి గారు ఆకాశవాణి కేంద్రములో ఆశువుగా కథ లల్లి చెప్పుచుందురు. విజయవాడలో గుడిపాటి శ్రీరామ మూర్తిగారు పండిత హరిదాసొకరు గలరు. అమ్మల విశ్వనాధ భాగవతార్ సంగీత సాహిత్య పండితులు. సంగీత నాటక అకాడమీకి ఎన్నికైన సభ్యులు. నెల్లూరు పండితారాధ్యుల సాంబమూర్తి గారు గొప్ప పండితులు. వీరికి కాళిదాసు కథలో గొప్ప పేరు గలదు. స్త్రీలలో ఆంధ్రదేశమంతటనూ భారతం హరి కథా కాలక్షేప మొనర్చిన వారిలో అగ్రగణ్యురాలు భీమవరం దుర్గాంబ భాగ వతారిణి. మరియు తెనాలి నగరాజ కుమారి, అమలాపురం సుగుణ భాగవ తారిణి. నేటికాలమున సినిమా సంగీత పక్కిలో హరికథలు చెప్పి బహు జనాకర్షణ పొందిన వారు. కోట సచ్చిదా నంద శాస్త్రిగారు, పొడుగు పాండు

రంగ దాసుగారలు. ఇట్లనేకులు వందల కొలది ఆంధ్రలో కీర్తి నార్జించిన హరిదాస దాసినులు గలరు. వారి నందరను ఈగ్రంధమున ప్రస్తావించుట దుస్తరము. ఇంకనూ నాదృష్టిలో గలవారు బళ్ల బసవలింగం గారు, చేపూరి కనకరత్నా చారిగారు, కాటిన విశ్వరూపా చారి, కాళహస్తి బొట్టా కృష్ణదాసు, తెలుగుపండిట్ గాజులమండెం శ్రీనివాసులు రెడ్డి, సాధు కృష్ణదాసు, పాతాల శంకరశెట్టి, కుప్పా వీరరాఘవశాస్త్రి, పొన్నూరు చింతలపాటి వీరరాఘవయ్య తెనాలి పి. రామారావు భాగవతార్, పంచనాధం భాగవతార్, గర్రె సత్య నారాయణ గుప్త, ఒంగోలు మద్దెల నరిశింహా రావు, ములుకుట్ల సత్యనా రాయణ, చీరాల ఈశ్వరదత్తు, పడవల వెంకటరత్నం, వాశిరాజు శీతా రామయ్య, అలకూరపాడు దాదాసాహెబ్, వరదా రాఘవయ్య, సూరవరపు నారాయణ రావు, సినీ ప్లేబ్యాక్ గాయకుడు పట్టాభి భాగవతార్, మరియు పెంటపాటి వెంకట సుబ్బయ్య, భట్టిప్రోలు రాధా కృష్ణమూర్తి, చేపూరి పోతరాజు, నర్ల రామచంద్రయ్య, నాగినేని నాగేశ్వర్రావు, రామరాజు కుటుంబరావు, చిలకపాటి గోపాల కృష్ణ భాగవతార్, కె. వి. జగన్నాధ భాగవతార్, మద్దుల కోటేశ్వర గుప్త, కొమ్ము వెంకటాచలం, పోతుకూచి వెంకటా చలపతి, అమ్ముల రంగదాసు, ఖండవల్లి భానుమూర్తి, ముట్నూరి కుటుంబ రాయలు, నారపరాజు రాధాకృష్ణమూర్తి, కడప జి. సుబ్రహ్మణ్యం, అప్పలాయగుంట జగన్నాధం మొదలగు హరిదాసు లనేకులు గలరు.

ఇంకనూ రేడియో కథకుల పేర్లనేకము మనము వినుచున్నాము గదా? కూచిభొట్ల కోటేశ్వరరావు, అక్కిపెద్ది శ్రీరామ శర్మ, యాళ్లబండి తాతారావు, బుర్రా శివ రామ కృష్ణశర్మ, చిట్యాల ఆంజనేయ భాగవతార్, ఆత్మకూరు గురుబ్రహ్మానంద గుప్త, యస్. పి. వి. కృష్ణమా చార్యులు, పట్నాల మల్లేశ్వర్రావు, ముదపాక మల్లేశ్వర్రావు, ప్రతాప సుబ్రహ్మణ్య

శాస్త్రి, M A, చీరాల కంచిభొట్ల కామేశ్వర శర్మ. లంకా వెంకట సుబ్బయ్య, వింజమూరు సుబ్రహ్మణ్య శర్మ మొదలగు వారనేకులుగలరు.

ఇక స్త్రీలలో ఈరోజులలో భాగవతారిణులు లెక్కకు మిక్కుటముగా మన్నారు. రేడియో కథకురాంధ్రు బి భ్రమరాంబ, అంపర్తి సుశీలా రాణి, దాసరి భిక్షావతి, జ్యోతిర్మయాంబ పరాంకుశం సత్యవాణి, కె. ఇందిర బాల భాగవతారిణి మరియు మద్రాసు వాస్తవ్యురాలు ప్రభావతి, పాకాల సుందరమ్మ అరుణకుమారి, శేషకుమారి, సరోజిని దేవి, వై. సుశీలా దేవి టి. లలిత, యం. సరస్వతి, తాడేపల్లి వరలక్ష్మి, కుందేరు అనసూయమ్మ, యం. సుబ్బ లక్ష్మి, ఉమాచౌదరి, గుండు సత్యవతి మొదలైన వారెందరో గలరు.

ఇంతెందుకు మా నెల్లూరులోనే ఈ క్రింద తెలిపిన హరిదాసులు గలరు.

అడిగోపుల నరిసింహదాసు, శంకరరెడ్డి, దరతల శేషయ్య, రాజ మోహన దాసు, బొమ్మరాజు శేషగిరి రావు, దేగా వెంకట సుబ్బయ్య, శ్రీరాములు, చింతా ఈశ్వర శర్మ, గాజులపల్లి సుబ్బారావు, పునుగు శేషయ్య, లింగరాజు పుల్లయ్య, పున్నూరు గోపాలయ్య, కొట్రాసు సుబ్ర హ్మణ్యం, శిఖరం సుబ్రహ్మణ్యం, మల్లవరపు మహాదేవయ్య, తంగిరాల కృష్ణమూర్తి మొదలగు వారున్నారు.

శ్రీమతి సుగుణ, భవానీ బాయి, రత్న వెంకట సుబ్బమ్మ, జిన్నవాడ రాజేశ్వరి, సరస్వతి, వాణి, సావిత్రి, వసంత, తారాసిద్దప్ప మొదలగు భాగ వతారిణులు గలరు. ఇంకెందరు ఆంధ్రప్రదేశములో గలరో అనూహ్యము.

వీరిలో చింతా ఈశ్వర శర్మ రేడియో కథకులు. బొమ్మరాజు శేష గిరి రావు, సుగుణ భాగవతారిణి గారలు చిత్తూరు జిల్లాలో భారతము హరి కథలు చెప్పుటలో పేరుగాంచి యున్నారు.

గాజులపల్లి సుబ్బారావుగారు నెల్లూరు జిల్లా హరికథా గాన వాద్య కళా పరిషత్తుకు సెక్రటరీ అయి యున్నారు. ఇట్లు ప్రతివారునూ ఒక్కొక్క విద్యలో ఆరితేరి యున్నట్టి వారలే అయియున్నారు.

## హ రి క థ - నే టి స్థి తి

హరికథలు నేడు దేశములో జరిపించ బడుచున్నను హరిదాసులకుగల పూర్వపు గౌరవ మర్యాదలు నేడు లభించుటలేదు. హరిదాసులు మంచి పండితు లగుచో శ్రోతలుగూడ మంచి జ్ఞానపరులే కూడుదురు. అయితే పూర్వము కంటే నేడు హరికథలలో పెద్దలు పాల్గొనుట లేదను మాట సత్యము. అందులకనేక కారణములు గలవు. ఇప్పుడు శ్రవణేంద్రియములు నేత్రేం ద్రియములు రేడియోలద్వారా చలనచిత్రములద్వారా వెల స్వల్పము ఫల మధికముగా తృప్తి చెందుచున్నవి. మరియు రాజకీయ వ్యవహారములు వ్యాపారకార్య కలాపములు పూర్వముకంటే నేడు హెచ్చయినవి. అందుచే హరికథలలో పెద్దలు పాల్గొనుట తగ్గినది. పాండిత్య ప్రకర్షులగు హరిదాసులు నేడు తక్కువ. హరికథలేర్పాటుచేయు నేటి పెత్తనదార్లలో పాండిత్యాభిలాష భక్తిప్రవత్తులు మృగ్యము. పాతరుచులపై రోత, క్రొత్తరుచులపై మోజు. వింతవినోదములకే ప్రాధాన్యత హెచ్చుట, ఇట్లనేక పరిస్థితులు నేడు హరి కథలు క్షీణదశకు వచ్చుటకు హేతువులైనవి.

శరీరమున కవయవ సౌష్టవమెట్లో అట్లే హరికథయను రూపమునకు హరిదాసు శిరస్సు, ప్రక్కవాద్యములు, భుజములు, ఇతివృత్తమ్మే శరీరము,

శ్రోతలు కాళ్లుపాదములుగా పోల్చవచ్చును. మనిషి నిలబడుటకు కాళ్లెట్లు ముఖ్యమో హరికథకు శ్రోతలంత ముఖ్యమన్నమాట. ఇట్లే మన హిందూ సంఘ విభజన గావింపబడినదని తలంచుము. బ్రాహ్మణులు శిరస్సుతో క్షత్రియులు భుజములతో వైశ్యులు కటికములచే శూద్రులు పాదములతో పోల్చబడి నారు. హిందూమతం నిలబడుటకు శూద్రులంత ప్రాముఖ్యులై యున్నారని వూహింపవచ్చును. వీరందరు బ్రహ్మనుండి సృష్టించబడినవారే అయి వున్నారు. కానీ ఇట్టి ఉత్తమ భావములను విడచి ఈనాడు ప్రజలు అధికార ద్వేష భావములతో హిందూమత మందలి ఆచార వ్యవహారములన్నింటికి విపరీత వ్యాఖ్యానములు తమకిష్టమొచ్చిన రీతిగా చేయుచున్నారు.

హరిదాసుతో బాటు పూర్వపు ప్రక్కవాద్య విద్వాంసులుగూడ భక్తి పూరిత వేషధారులై వేదికపై త్రిమూర్తులవలె నలకరించి యుందురు. అట్టి సభావేదిక నేత్రపర్వముగ నుండునుగదా? కాని నేడట్టి సభ గానరాదు. పూర్వము హరిదాసుకు వంతపాటడు లుండెడివారు. వంతపాటకులలో కలసి చేయు హరికథా గానము యింపుమీందు నేడు మనము రేడియోలలో విను చున్న యక్షగానములవలెనే యుండును.

## హ రి క థ - ప రి స ర ము

దాసుగారివలెనే కాల పము సేయు స్థలములు గూడ దేవాలయ ప్రాంగణముల వలెనే పవిత్రత గోచరించుచుండును. పందిరికి వచ్చని తోర ణము కట్టెదరు. హరిదాసు ప్రక్కన దైవచిత్ర పటముండును. పూలు టెంకాయ కర్పూరము మొదలగు పూజాద్రవ్యములుంచబడును. దాసుగారి కిరువైపుల వాద్యపరు లాసీనులగుదురు. ప్రార్థనానంతరము దాసుగారు నిల బడెదరు, మృదంగము యొక్క కరిణెగలభాగము సభకెదురుగా నుండును తంబూరా లేక హార్మోనియం శృతికై వెనుకవైపు వుండును. కర్ణాటక

శాస్త్రీయ సంగీత సాధనచేసిన హరిదాసులు వైలెన్ మృదంగముల నుప యోగించెదరు. ఇతరులు హార్మోనియము తబలాను వాడెదరు. ప్రశాంతతకై సాధారణముగా రాత్రి షుమారు 10 గంటల ప్రాంతమున కాలక్షేపము ప్రారంభించ బడును. ఆకాశవాణి కేంద్రములందు నయుతము యిదేసంప్ర దాయము ననుసరించు చున్నారు. ఆసమయమున ప్రకృతి ప్రశాంతముగా నుండును. పూర్వపు పద్ధతులుగాని ఆచారములుగాని ప్రకృతి ననుసరించి యుండెడివి. నేడన్నియు విరుద్ధములే, రాగములు పాడుటకు తగిన వేళలు శాస్త్రములో నిర్ణయించబడినట్లే కథలుగూడా రాత్రిళ్లు రక్తికట్టినట్లు పగటి కథలు రాణించవు. కాలక్షేపమను పదము హరికథకే సంబోధింప బడు చున్నది. సంగీతమునకు గాని నాటకమునకుగాని బుర్రకథకుగాని యుపయో గింప బడుటలేదు. నామధేయమును బట్టియే హరికథా కాలక్షేప మెట్లుండునో మనకర్థమగు చున్నది. హావ భావములతో హాస్యపు మాటలతో రసపుష్టి కలిగి రక్తిగా భక్తిగా సంగీతపు సొంపులతో మధ్యమ కాలములో శ్రవణా నందముగా ప్రయాణ సమయమున బటానీళ కాలక్షేపమువలె హరికథ నడువ బడువని గ్రహింపగుచున్నది. అనగా మనస్సు తన్మయత్వములో ఆనందముగా తెలియకుండా కాలముగడచి పోవలెనన్నమాట.

## ర చ న ల య వ స ర ము

హరికథా రచన లనేకవిధముల నుపయోగములుగా నున్నవి. రచనలు ముద్రితముగాక పూర్వము హరిదాసులు విషయసేకరణకై బహుప్రయాస పడుచుండెడివారు. నేడీ రచనలు హరిదాసలోకమున కరటి పండొలిచి పెట్టి నట్లు వుపయోగ పడుచున్నవి. ఆకాశవాణి కాలక్షేపమునకు క్లుప్తముగా అనుకూలముగా నున్నవి. విజయవాడ ఆకాశవాణి కేంద్రమువారు కథాగాన ములు చేయుటకు పరిమి సుబ్రహ్మణ్యముగారు పెద్దింటి సూర్యనారాయణ

దీక్షితులుగారు కదలి పీరదాసుగారు పుద్దూరి సాంబయ్యగారు ఆదిభట్ల నారాయణదాసుగారు రచించిన కథలనామోదించి యున్నారు.

## యక్షగానము - హరికథకు గల సామ్య భేదములు.

యక్షగానములు విజయరాఘవుని పరిపాలన కాలమున నాటకములుగా పరిణమించినవని పండితుల యభిప్రాయము. మొదట యక్షగానము శ్రవ్య కావ్యము. తదుపరి పరిణామము యక్షగాన నాటకము. ఇది దృశ్యకావ్యము, అనేక పాత్రలందు ప్రత్యక్షమగును. శ్రవ్య యక్షగానము హరికథవలెనె ఏక పాత్రాభినయ గానయోగ్యము. హరికథకు గూడ మాతృకము యక్షగాన శ్రవ్యకావ్యమే. యక్షగానములు హరికథలు యించుమించు రెండునూ ఒకే పోలికలు గలిగి యున్నవి. అందుచేతనే యక్షగానములను దృష్టిలో నుంచు కొని వంగాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు పరిష్కరించిన రామదాసు చరిత్ర విమర్శనమను పీఠికలో 15 వ శతాబ్దము చివర ప్రారంభమయి 16 వ శతాబ్ది పూర్ణమగు లోపల హరికథ పద్ధతి చక్కగా వ్యాప్తినొందినదని విశదీకరించ బడినదేమో నని యనిపించును. యక్షగానములు హరికథలు ప్రక్క ప్రక్కనే యుండినవనియు, యక్షగానములో సంధివచనములు క్లుప్తముగా నుండుననియు హరికథలలో కథాకథన మెక్కువ యనియు రజనీ కాంతారావు గారు తెలిపి యుండిరి. ఇది యదార్థమని మన మందరము రేడియోలలో వినుచున్న యక్షగానములు హరికథలను బట్టి తెలియుచునే యున్నది. హరికథలలో పద్యరచనయెక్కువ. యక్షగానములందు తక్కువ తల్లి బిడ్డ పోలికలవలె యక్షగానముల లక్షణములు హరికథలందు గానుపించును.

ఆరంభమున యక్షగానము హరికథ ఒకటే అయినట్లు దృష్టాంతములున్నవి. పాల్కురికి సోమని కాలమందు శ్రీనాథుని కాలమందు

జక్కుల పురంధ్రులు శివుని కథలు ఏకవ్యక్తి ప్రదర్శనములుగా పాడి యుండి రట యక్షగాన రచనలు కొన్ని పామర జన రంజక భాషలో రచింప బడి నవి. పండిత రంజిక భాషా శైలిలో రచింప బడిన యక్షగానములు చదువు చున్నంతసేపు హరికథలు చదువు చున్నామనే యని యనిపించును. సిద్ధేంద్రుని భామాకలాపంలో "జనులార వినుడీ హరికథ" యని ప్రారంభింప బడి నది. గోకులపాటి కూర్మన్న గారి మృత్యుంజయ విలాసము యక్షగానము హరికథగా ప్రచారములో నుండినది. ప్రయాగ రంగశర్మ గారు దీనిని హరి కథ గా చెప్పుచుండెడివారట. హరికథలు వ్యాప్తిలోని కొచ్చిన పిదప గూడ యక్షగానమను పేర గ్రంధములు రచించ బడుచునే యున్నవి. నిదర్శనముగా క్రీ. శ 1921 సంవత్సరములో బి. సుందరమ్మగారు సంపత్శుక్ర వార వ్రత కథను యక్షగాన మనుపేర రచించినది ఈ గ్రంధము హరికథవలెనే యున్నది. హరికథల ప్రారంభమున సభావందన పద్యములు రచించబడినవి. యక్షగానములందవి లేవు, పోలికలు తేడాలు తెలియుటకై యిందు కొన్ని యక్షగాన నాటకములను, శ్రవ్య యక్షగానములను, హరికథలను బుర్రకథ లను పరిశీలించి అందున్న వివరణలు విశదపరచడ మైనది.

పూసపాటి రత్నయ్య గారి శశిరేఖా పరిణయ నాటక రచనా పద్ధతి యిట్లున్నది. ఇష్టదేవతా ప్రార్థనలు సుకవి స్తుతి, కుకవి తిరస్కారములు, గ్రంధకర్త వంశావళి, తదుపరి వేత్రపాణి, తెరవెడలి వచ్చుట. వేత్రపాణి యనగా బెత్తముచేత యందుగలవాడు, భటుడు, లేక సూత్రధారుడు. అనగా దారమును ధరించినవాడు, వీటన్నిటికి అసలు భావము నాటకము నడుపువాడు. బొమ్మలాటలో తోలు బొమ్మల నాడించు వాడు ధారమును ధరించి యుండును గదా?

"నారదుడు వచ్చు విధంబెట్టి దనిన"—

"రాజుమాట"—

" మన హజారంబున సకల సామాంత కవి గాయక పాఠక విద్వజ్జనంబులు హాజరై యున్నారా? "

" భటునిమాట "—

" బుద్ధి సరాసి అందరున్నూ తమతమ పనులయందు జాగ్రత్తగా వున్నారయ్యా స్వామి "

" రాజుమాట:— చిన్నన్న దేశాధీశులు మనకు నిత్యులయి కానుకలు తెచ్చి కనిపెట్టుకొని యున్నారా? "

దరువు - బంగాళాటిరాగం - ఆదితాళం

రేవతి వెడలి వచ్చె - ధనిని జూచుటకు ॥రే॥

ఠీవి మీరగ చెలులు - వేవేగ నడువ ॥రే॥

గ్రంధమున ఇట్టి కీర్తనలు, కంద సీసార్ధములు సంవాద కీర్తనలు గలవు.

కోలతూరు పురుషోత్తము గారి మైరావణ చరిత్ర, యక్షగానము, ఇది నాటకము వలెనే యున్నది ద్విపద రచన గలదు. దరువులకు రాగం నిర్ణయించలేదు, దేవతా స్తుతులు తక్కువ, కవిస్తుతి తిరస్కారములు లేవు. ఈ గ్రంధము చివర ఈ యక్షగాన ప్రచురణకర్తలగు పి. వి. కృష్ణా బుక్ డిపో మద్రాసు వారిట్లు ప్రచురించి యున్నారు. శ్రీమహాభారత నాటకము రచయిత కొత్తూరు రామలింగయ్య, ఇందు మహాభారత మంతయు వీధి నాటక రూపమున వ్రాయబడినది. ఈ గ్రంధము విశేష ప్రసిద్ధిని పొంది యున్నది. ఇందు ముద్దులు మూటగట్టు పద్యముల తోను కందార్ధములతోను ద్విపదలతోను దరువులతోను చోప్పుదారులతోను సంవాదముల తోను మధ్య

మధ్య చక్కనివచనములతోను సీసార్థములతోను వృత్తములతోను మాలినీ వృత్తములతోను వ్రాయబడి యుండెను. ఇది ప్రాచీనమైన గ్రంథము మహా భారతము నందలి కథకు ఏమాత్రము మార్పురాలేదు. పైవివరణను బట్టి యక్షగాన నాటకములు వీధులలో నాడెడివి. ఇప్పటివలె వీనికి ప్రత్యేకమైన రంగస్థలము టిక్కెట్టు అమ్మకట మొదలగు పద్ధతులు లేవు. అని గ్రహింప నగును.

నాస్వానుభవము అంతియే నేను బాల్యములో అనేక వీధినాటకముల చూచియుంటిని. యక్షగాన నాటకములను కూచిపూడి బ్రాహ్మణులు సంగీత సాంప్రదాయముతో పండిత రంజకముగా ఆడుచుండిరి. యానాదులు, గొల్లలు, మాలలు అనుకులములవారు పామర రంజకముగా ఆడుచుండెడివారు.

రాయలసీమ ప్రాంతమున జక్కులను వారు నాడుచుండెడి వారని యస్. వి. జోగారావుగారు తెలిపియున్నారు. రాత్రి పదిగంటలకు నాటకము ప్రారంభించి సూర్యోదయమగు వరకు ఆడుచుండెడివారు. వీనిలోని పాత్రలు స్టేజి నాటక పాత్రలవలె Actions Feelings ను ప్రదర్శించుట వుండదు, సంగీత మెక్కువ. నాట్యముతో సంభాషణలతో సాగును. గ్రామములో చందాలు వసూలు చేసి వీధి వీధినా, ఈనాటకములు ఆడించు చుండెడి వారు.

ధరణికోట సుబ్రహ్మణ్య కవి గారిచే ఇంద్రాహల్య నాటకము క్రీ. శ. 1898 లో రచించబడినది. ఇది అయిదు రోజుల నాటకము, అయిదు భాగములుగా విభజింప బడినది. ఇందలి ప్రత్యేక రచనలు బువ్వముబంతి పాట, మంగళముపాట, కవి సంగీత విద్వాంసుడుగా నున్నాడు. ఆదినాట అంత్యసురట రాగముల నుపయోగించి శాస్త్రపద్ధతిని అనుసరించినాడు.

ధేనువకొండ వెంకయ్య గారి గయోపాఖ్యానము:- ఇది 1916లో ముద్రిత మైనది. ఇది ఒక స్వతంత్రము ప్రదర్శం [illegible] పండితుడు ఆర్వేల నియోగి బ్రాహ్మణుడు, [illegible] దలో రచింప బడెను. వీరు రామాయణం హరికథ గూడ రచించినారు, విరాటపర్వము బుర్రకథగా రచించినారు. వీరి రచనలు ప్రఖ్యాతి గాంచినవి.

### రగడ

శ్రీవసుదేవ కుమారా ధీరా శ్రితజన మందారా
కేవల పరమోదారా శ్రీధర కేశవ సుకుమారా॥

కొన్ని దరువులు, పద్యములు 20 పంచచామరములు, వచనమెక్కువగా గలదు. ఒకమార్జిక గలదు.

శ్రీనాథుడు గూడ యక్షగానమను వీధి నాటకమును రచించెను. క్రీ. శ. 1370 మొదలు 1450 లోపల శ్రీనాథుడు జీవించి యుండెనని నేలటూరు వెంకటరమణయ్య గారు నిర్ణయించిరి. శ్రీనాథుడు సర్వదేశీ కవితలను సమదృష్టితో చూచినవాడు. ఇట్టివాడు యక్షగానమును రచించెనే గాని హరికథ రచింపలేదు అందుచే అప్పటివరకు హరికథ యుత్పత్తి అయి యుండదుగావనే శ్రీనాథుడు హరికథను రచింపలేదని నమ్మవచ్చును.

త్యాగరాజుగారికి పూర్వపు యక్షగాన రచనము త్యాగరాజస్వామి వారి యక్షగాన రచనకు ఎక్కువ ప్రాముఖ్యము గలదు. త్యాగరాజుగారి రచన సంగీత సాహిత్య ప్రతిభతో గూడినది. యక్షగానము హరికథల ధ్యేయ మొక్కటే. అది భక్తిప్రబోధము నాటకము యొక్క ధ్యేయము అభినవ కౌశలము ఆనందము నిచ్చుట, 19 వ శతాబ్ది చివర 20 వ శతాబ్ది ప్రారం

భమున రచింపబడిన హరికథలలో కొన్ని యక్షగాన సంబంధ రచనలు గలవు. అధునికమైన హరికథలలో కీర్తనలు కృతి సాంప్రదాయముగా నున్నవి. వర్ణనలు తక్కువ. గేయరచన లలిత సంగీతమున కనువుగా భావ రసికత్వముపరి రచింపబడినవి. న్యాయ సిద్ధాంత రచన తక్కువ, సంజరులు మట్టము. పూర్వహరికథలు యక్షగానముల సరణిగా విస్తారము. నేటి కథలు సంక్షిప్తము. ఈనాటి ప్రజలకు ఓపికలు తక్కువ మూడుగంటలకు మించి సభలో ఆసీనులు గాలేరు, పూర్వము తెల్లవార్లు హరికథ జరుగుచుండెడిది. అందుకు నిదర్శనముగా బుద్ధవరపు కురంగేశ్వరరావు గారిని ఆదిభట్ల నారాయణ దాసు గారిని నేటి యుగమున పెల్లూరి శాస్త్రుల్యులు పండితారాధ్యుల సాంబమూర్తి గారిని భట్టిప్రోలు శాస్త్రుల్యులు పాతూరి మధుసూదనరావు గారిని తలంప వచ్చును. వీరు పండితప్రకాండులుగాన, కథలో లీనమై ఉపమానోదాహరణ ములతో కథను పెంచుచూ పోవుదురు. హరికథా లక్షణములు యక్షగాన లక్షణములు మిళితమైన కొన్ని చరిత్రలను ఈ దిగువ మీ పరిశీలనకై యుంచుచున్నాను.

తూము నృసింహదాసు చరిత్రము :

ఈ చరిత్ర నంబెరుమానూరు సూరిచే రచింపబడెను, దీనిని పింగళి దాసు వ్యాప్తిలోనికి తెచ్చెను. కీర్తనలకు, మకుటము నరసింహదాసు పేరు గలదు. ఇందు కీర్తనలు 115 సీసములు 19 తోహరాలు పేరగ్రావులవంటివి 19 చూర్ణికలు 4 వృత్తములు 48 గీతములు 11 కందములు 11 పంచచామ రములు 2 ద్విపద 1 గలవు. ఇందలి ప్రత్యేక రాగములు అయిరి మాళవి, ఘూర్జరి, వలాళి, ద్విజావతి, దేశీయ, జంగల మొదలగునవి. ఇవి సర్వ సాధారణముగా నందరు పాడునట్టి వాడుక గల రాగములు గావు.

ఇందలి రచనా ప్రక్రియలందలి విషయములు విరిబంతులాట, అభ్యంజనము, దంతధావనము, సేవాప్రకరణము, పేలుకోలుపు, జోలపాట, లాలిపాట, ఏకాంతసేవా ప్రకరణము, పరాకులు, ప్రభుత్వసేవా ప్రకరణము, హెచ్చరికలు మొదలైన విషయములు పద్యగేయ తోహరా రచనలతో రచింపబడినవి. త్యాగరాజు వరద రామదాసుగారు వీరి సమకాలికులట. నరిసింహదాసుగారి నివాసం గుంటూరు. భక్తుడు తీర్థయాత్రలు చేసినవాడు మంచి విద్వాంసుడు.

రామదాసు చరిత్రము :— ఈ చరిత్రను ముగ్గురు కవులు రచించినారు. నేను పరిశీలించిన ఈ గ్రంథము రామదాసుచే రచింపబడినది. పింగరి దాసుచే ప్రబలపరచబడినది. ఈ గ్రంథరాజమున 113 కీర్తనలు, 17 శ్లోకములు, 5 సీసములు, 28 తోహరాలు, 42 వృత్తములు, 1 చూర్ణిక, 35 గీతములు కందములు 2 రగడలు 3 ద్విపదలు రచింపబడినవి. తోహరాలను సంధిచరణము లనబడెను. సంధి యనగా కథాగమనమును తెలుపునట్టిది అని భావము. ఇదియు తూము నృసింహదాసు చరిత్రమునే పోలియున్నది. ఏకపాత్రాభినయమునకు తగిన గ్రంథము లీరెండు. వీనిని హరికథలుగా ములుకుట్ల సదాశివశాస్త్రి గారు చెప్పుట మనము రేడియోలలో వినుచునే యున్నాము.

## హ రి క థ ల — వి భ జ న

కథా వస్తువు ననుసరించి హరికథలను పౌరాణికములు, భక్తుల చరిత్రలు పతివ్రతల గాథాలు కవుల జీవితములు మత ప్రవర్తల చరిత్రలు దేశనాయకుల చరిత్రలు అని విభజింపవచ్చును.

పౌరాణికములు :— ఇవి పురాణము లందలి కథలు. భారత భాగవత రామాయణ మహాకావ్యములందలి కథలు. బ్రహ్మ విష్ణు, శివ, పద్మ

భవిష్యోత్తర, బ్రహ్మవైవర్త, నారదీయ, మార్కండేయ, ఆగ్నేయ, లైంగ, స్కాంద, మత్స్య, కూర్మ, వరాహ, వామన, గరుడ, బ్రహ్మాండాది పురాణములగాథలు 18. ఉప పురాణము లందలి గాథలు, పౌరాణికము లన బడును. ఇట్టి పౌరాణిక హరికథలే వరిగి సుబ్రహ్మణ్యం గారి భారత భాగవతములు. కడలి వీరదాసు భారతం (అముద్రితం) ముటుకుట్ల పున్నయ్యగారి విజయ భారతం, నల్లపల్లి ఐవిరెడ్డిగారి భారతం, కట్టా అప్పయ్య గారి భారతం, ఆదిభట్లవారి రామాయణం, మైనంపాటి వారి రామాయణం, రామ పుత్రి రామాయణం, మోక్షగుండ రామాయణం, కొసూరి భోగలింగదాసు రామాయణం, పోతూరి మధుసూదన రావుగారి రామాయణం, రామాయణం వెంకట నరసింహముగారి గోపాలక్రిష్ణ విలాసము (భాగవతం) కొమ్మూరి బాలబ్రహ్మానందం గారి శివచరిత్ర మరియు ఇతర కథలు మార్కండేయ, ప్రహ్లాద, అంబరీష, హరిశ్చంద్ర, గజేంద్రమోక్షం, నలచరిత్ర, లక్ష్మీ కల్యాణం, గయోపాఖ్యానం, కుశలవ, జలంధర, విషుచరిత్ర, ధన్వంతరి, సుమతి, సావిత్రి, శమంతకమణి, పార్వతీపరిణయం ప్రమీల, మాడుపతి ఉటి కెలు, మాయా సుభద్ర, శ్రీనివాస కల్యాణం, వల్లీకల్యాణం, కృష్ణగారడి, భూకైలాసం, సత్యనారాయణ వ్రతం, గరుడ గర్వభంగం, మాయూర ధ్వజ, హనుమద్వనం, కృష్ణతులాభారం, వామన, పరీక్షిద్విలాసం మొదలైనవి.

భక్తుల చరిత్రలు :—. రుక్మాంగద శ్రీయాళ విప్రనారాయణ రామదాసు కబీర్ నందనార్, మొదలగునవి.

పతివ్రతల గాథలు :—, సీత సుమతి సావిత్రి సక్కుబాయి ద్రౌపది అనసూయ రుక్మిణి, మొదలగునవి.

కవుల జీవితములు :— వాల్మీకి కాళిదాసు వేమన పోతన త్యాగరాజు తెనాలి రామక్రిష్ణ పురంధరదాసు, మొదలగునవి.

మత ప్రవక్తలు :— శంకరాచార్య బ్రహ్మం గారి చరిత్ర సిద్ధయ్య చరిత్ర, మొదలగునవి.

రాజకీయ సంబంధమగు చరిత్రలు :— నేతాజీ, సుభాస్ రాణా ప్రతాప్ గాంధి నెహ్రూ ఆంధ్రకేసరి ప్రకాశం శివాజి తిలక్ ఝాన్సీలక్ష్మీబాయి క్రిష్ణుని రాయబారం, మొదలగునవి.

రసపోషణమునననుసరించి కథలు విభజించినచో భక్తుల చరిత్రలు భక్తిరసపోషితములగును. పతివ్రతల గాథలు కరుణరసము, రాజకీయ చరిత్రలు వీరరసము, మతప్రవక్త చరిత్రలు శాంతిరసమును పోషించును.

సీత, రుక్మిణి, పార్వతి, సుభద్ర మొదలగు కల్యాణగాథలు శృంగార రసమును, కాళిదాసు ఉత్తరగోగ్రహణము, తెనాలిరామక్రిష్ణ లంకాదహనం శశిరేఖ, ఇట్టికథలలో హాస్యరసమును పోషించు ఘట్టములు గలవు.

శృంగార, హాస్య, కరుణ, శాంత, అద్భుత, భయానక, భీభత్స, వీర, రౌద్ర, రసములనబడు నవరసములలో శృంగార హాస్య రసములుమేటి. వీనితో గూడిన భక్తి సాటిలేని వ్యాఖ్యానములమేటి. సమ్మోహనాస్త్రమై కొల్లలై విరాజిల్లు హరికథా రచనలు మనసుపద మపేక్షించు వారికి ప్రోత్సాహకములు. మహమహులగు విజ్ఞులకీ హరికథా గానములొక వీనుల విందులే. మోక్షసాధక ముక్తిమార్గ ప్రదర్శకము. ముక్తికి మూలాధారము భక్తి, భక్తికాల వాలము హరికథా కాలక్షేపము.

అట్టి కాలక్షేపమొక పాలకడలి. కథయందలి వస్తువు మందరగిరి. హరిదాసువాసుకి, శ్రోతలగు భక్తులు దేవతలు. కథను వినక నిద్రించు దద్దమ్మలగు పెద్దమ్మ పుత్రులు రాక్షసులు. ఇతరభక్తులకు కాలక్షేపములో దొరకునవి, దేవతలకు పాలసముద్రములో దొరకినట్టివే. దేవతలకు దొరకినవి, అమృతపు కలశము, కల్పవృక్షము, కామధేనువు, చింతామణి చందమామ, వైజయంతము, ఉచ్చైశ్రవము, ఐరావతము, ఆదిలక్ష్మి, అప్సరాంగనలు మొదలైనవైతే హరికథా కాలక్షేపములో భక్తులకు దొరకునవి, భక్తి ప్రబోధములు పాతివ్రత్య మహిమలు కరుణరస గాథలు కైలాసవాసుని లీలలు నీతివిషయములు నీరజాక్షుని మాయలు సుందరమగు పాటలు సృష్టి రహస్యములు అధ్యాత్మిక చింతనలు ఆరోగ్యమొసగు గానామృతములు కోరి కలిచ్చు గోవిందనామములు నవ్వుపుట్టించు పిట్టకథలు ప్రకృతి యంతము లేనిదనిదెల్పు పద్యపఠనము యొక్క సుదీర్ఘ రాగాలాపనలు. చిన్ని గోపాలుని జ్ఞప్తికిదెచ్చు కాలిగజ్జెల మ్రోతలు ప్రపంచపు మనుగడకు లయప్రధానమని దెలుపు చిటికల శబ్దములు శివునికి ప్రీతికరమగు చర్మవాద్యపు దరువులు సరస్వతికింపగు తంత్రీనాదస్వరములు భక్తిపరిపూర్ణమైనపిదప ముక్తిగోరు ముముక్షువులకు ధన్వంతరి అమృత ధారలొంచినట్లు కాలక్షేపము చివర శ్రోతలకు నిద్రమత్తు వదలి ముఖములు ప్రసన్నములగుటకా యనునట్లు నిచ్చు పప్పు పానకములు పంచకజ్జాయములు మొదలగు ప్రసాద వంపకములు. ఇట్టివి శ్రోతలకు హరికథలో లభించు ఫలితములు. మానవ జన్మ రాహిత్యమున కింతకన్న మరేమి కావలయును? మిగత వాఙ్మయ చరిత్రల కంటె హరికథా వాఙ్మయ చరిత్రకు భక్తి ప్రయోజనము అను ప్రత్యేకత గలదు. నేను హరిదాసునగుటనే చదువరుల కింపు గొల్పుటకై పైవర్ణన గావించితి వని మనవి చేయుచున్నాను.

## హరికథలు చెప్పు సందర్భములు

హరికథ పవిత్రం హరిదాసు పవిత్రం హరికథా పరిసరం పవిత్రం హరికథ భక్తులు పవిత్రం హరికథా కవు లందరికంటే పవిత్రం. కావుననే కల్యాణ సమయములందు కర్మాంతర క్రియలందు తిరునాళ్లలందు తీర్థము లందు పర్వములయందు పబ్బములయందు జయంతులందు వర్ధంతులందు హరికథా కాలక్షేపములు జరిపించబడుచున్నవి. శుభకార్యములందు సీత, రుక్మిణి, హైమవతి మొదలగు శృంగార రస పూరిత కల్యాణకథలు, అంత్య క్రియలందు భక్తిప్రధానములగు భీష్మ, సావిత్రి, సక్కుబాయి, రామనిర్యాణం కృష్ణనిర్యాణము మొదలగు కథలు, రాజకీయ మీటింగులలో గాంధి, నెహ్రూ, తిలక్, నేతాజి, ఝాన్సీలక్ష్మి మొదలగు హరికథలు చెప్పించ బడుచుండును. భారత యజ్ఞములను పేర తమిళ సంప్రదాయానుసారముగా షుమారు ఒక నెల మధ్యాహ్న సమయమున దక్షిణాంధ్ర దేశమున (చిత్తూరు జిల్లా) వేసవి కాలములో హరికథలు జరిపించబడును. మరియు రాత్రిళ్లు భారతం యక్షగాన నాటకములను జరిపించుచున్నారు

వేసవి కాలమున ప్రజలకు తీరిక సమయముగానుండును గాన రామా యణ భారత భాగవతాది చరిత్రలు రాత్రిళ్లు పుణ్యకార్యములుగా భావించి చెప్పించు చుండెడివారు. కానీ సినిమా వ్యామోహంలో పడిన ప్రజలకీ హరి కథా వ్యామోహం నేడు తగ్గినది. బ్రహ్మంగారి చరిత్ర పల్లెలలో బహుళ ప్రచార మగుచున్నది. బ్రహ్మంగారు చెప్పిన కాలజ్ఞానములకు నేటికాలమున దేశమున జరుగుచున్న విచిత్ర పరిస్థితులకు యదార్థత గోచరించు చున్నది. అందుచే ప్రజలాపక్తిగా దానిని వినుచున్నారు.

## హరికథ - శైలి

హరికథలను మరల రెండు రకములుగా విభజింప వచ్చును. పండిత రంజకములు పామర రంజకములు. హరికథలు ఉన్నత ప్రమాణముల వను

సరించుచూ కథారచన కవసరమగు. వస్తుసముదాయము భాషాపటిమతో భావౌన్నత్యముతో శాస్త్రజ్ఞానముతో బహుగ్రంథ పరిచయముతో ఉపమానోదాహరణములతో చక్కని పద్యములతో పండిత రంజకముగా యుండి రచించిన గ్రంథకర్తలగు కవిశ్రేష్ఠ లొకరకము. సరళమైన శైలిలో సులభ గ్రాహ్యముగా వ్యావహారిక భాషలో భావకవిత్వ ధోరణిలో సమాసర హితముగా సాఫిగా కథనడుచు పద్ధతిన రచించిన కవులు రెండవరకము. వీరికథలు లలిత సంగీతము వంటివి. పండిత కథలు శాస్త్రీయ సంగీతము వంటివిగా పోల్చవచ్చును. ఆదిభట్ల వారివి పరిమి వారివి పెద్దింటి వారివి పాతూరి వారివి మొదలైనవి పండితశ్రేణికిఁ జెందినవి. ములుకుట్ల వారివి భోగలింగదాసు తిరునగిరి శేషదాసు, తెల్లాకుల వెంకటేశ్వర గుప్త వారి రచనలు సులభ గ్రాహ్యములు సరళములు. మరల ఈకథలను ప్రాచీనములు ఆధునికములని రెండుగా విభజింపవచ్చును. ప్రాచీన రచన విస్తారము. దరువులు రగడలు కందార్థములు ఇష్టదేవతా ప్రార్థనలు మొదలగు గేయరచన మిక్కుటము. ఆధునిక రచన సరళము సంగ్రహము. పద్యరచన మిక్కుటముగా గలిగి యున్నది. కీర్తనలు కృతి సంప్రదాయము.

బహుళ గ్రంథ కర్తలు :—

ఆదిభట్ల నారాయణదాసు, పరిమి సుబ్రహ్మణ్యము ములుకుట్ల పున్నయ్యశాస్త్రి మైనంపాటి నరసింగరావు బి. బాలాజి దాసు కొమ్మూరి బాలబ్రహ్మానందం పాతూరి మధుసూదనశాస్త్రి కోసూరి భోగలింగదాసు తెల్లాకుల వెంకటేశ్వరగుప్త తిరునగరి శేషదాసు తాళ్లూరి నారాయణకవి కట్టా అచ్చయ్య అయ్యగారి వీరభద్రరావు నల్లమల్లి బసివిరెడ్డి పెద్దింటి సూర్యనారాయణ దీక్షితులు బాబు పి.యస్. నౌషర్‌వాన్ నందివాడ జగన్నాధ కవి కడలి వీరదాసు పత్తిగొడుగు రాఘవరాజు సాధు సాంబయ్య మద్దూరి సాంబయ్య రామపుత్రి గారలు.

హరికథా రచయితలలో కొందరు హరిదాసులై యున్నారు మరి కొందరు కవులు మాత్రమే అయియున్నారు.

## నేటి హరిదాసుల లక్షణములు :—

బి. బాలాజి దాసుగారు కర్ణానంద దాయనియను గ్రంధమున కలియుగ హరిదాసుల సంగతి నిట్లు వర్ణించి యున్నారు.

చ॥ సరసత సున్న తెల్పుటకు। సాహితి శూన్యము సజ్జనాళిపై
గురుతు హుళక్కి దైవమును। గొల్చుట నాస్తి శిరోజ పుంజము
ల్విరివిగ దిద్ది వేషములు। వేయుచు మోరలనెత్తి వీధులం
దిరిగెడి దాసులెట్లు భవ। దీయ పదంబును గందురీశ్వరా!

ఈపద్యమున హరిదాసులకు కొన్ని మంచి గుణములు లేవని చెప్ప బడెను. ఆయా మంచి గుణములు నేటి హరిదాసులు అలవరచు కొనుట మంచిది.

హరికథా కాలక్షేపము చేయవలసిన విధాన మెట్టిదో తన సీతాకల్యాణ మను హరికథా గ్రంధమున బాబు పి.యస్. నౌషర్వాన్‌జీ సుదీర్ఘమైన చంపకమాలలో నిట్లు వివరించి యున్నారు. హరికథ సంపాదనకై చెప్ప రాదు. సంగీత సంస్కృత సాహిత్యమును గురువునొద్ద నభ్యసింప వలెను. కథ చెప్పునపుడు దాసుగారు వికృత చేష్టలు అంగ విన్యాసములు చేయరాదు, భక్తి గలిగి యుండవలయునని హరిదాసుల కుపదేశము చేయనడినది.

చం॥ హరికథగాన వైభవ మ। హర్నిశమున్ గనలేక మత్తులై।
దెరలుచు పొట్టకూటికిని। దేబరుతాచు వివేక శూన్యతన్
దిరుగుచు పాపభీతి గడ! తేరదు నోహరిదాసులార మీ
రెరుగగ జెప్ప నెంచితిని। యింపుగ భక్తి ప్రసంగ రీతులన్
గరిమను వృద్ధమర్కటపు! గంతులు వేయుటగాదు గాంచతా
నరుదుగ వేశ్యకాంతగతి! నాట్యము సల్పుటగాదు వెర్రిగా
గిరగిర మేను ద్రిప్పుచును। గీళ్లబిగించుట గాదు గుల్కుచున్
తెరవుగ మోరయెత్తుకొని। తేకువ సీల్గుటగాదు వింతగా
బరిపరి మందహాసమున। బండ్లిగిలించుటగాదు జూపులన్

— — — — — — — — — —

అని హరిదాసుల చేష్ఠలను విమర్శించి మరియు పుష్కలమైన సాహిత్య సంపద గలిగి మంచి సంగీత సౌరభము గల సురవనితా సమూహముల పాటలవంటి మేటి పాటలతో గంగాప్రవాహము వలె పద్యపఠనతో భక్తిరస ముప్పతిల్లజేయుచు హంసలవంటి నడకలు నెమళ్లవంటి నృత్యములు కోకిల గానములు చిలుకపలుకులు గరుడపక్షి క్రిష్ణాయని పిలిచినట్లు భక్తి తన్మయత్వముతో పెట్టు గోవింద నామములు భక్తియను అమృత సరస్సులో శ్రోతలుమునిగి ముక్తినిగాంచు రీతిగా హరికథా కాలక్షేపముండ వలయునట. అట్టిమంచి హరికథలు వినవలయునట, లేనిచో హరికథలు వినుట దండుగ యని యిట్లు పల్కెను.

—కరణిని జెప్పకున్న। హరిగాథ వినంగను నేమిగల్గెడిని।
దురితము బొందుటొక్కటియు। దొరపు చేతివనంబు బోవుటల్
నరుదుగ నిద్రదక్కమియు। నావల బెక్కులనర్థ మూలముల్
యెరుగుడు మోసబోకుడిక। నెంతయు మాయల డాంబికంబులన్
జొరకుడు మాటనమ్ముడిక। చొక్కము నౌషరు దాసు దెల్పగన్

## గ్రంథ పరిశీలన — అధ్యాత్మ రామాయణము

క్రీ. శ. 1760 లో మునిపల్లె సుబ్రహ్మణ్య కవి రచించిన అధ్యాత్మ రామాయణము తొలి హరికథ యనవచ్చునని దేశికవిత రచనకర్త R. V S. సుందరంగారు, ఆంధ్ర వాగ్గేయకారకుల చరిత్ర రచించిన బాలాంత్రపు రజనీ కాంతారావుగారు తెలిపి యున్నారు. అయితే సూక్ష్మముగ నాలోచించిన ఇది కీర్తనాత్మక మనియు దెలిపి యున్నారు. హరికథ యని యనవచ్చు ననిరేగాని హరికథ యని వారునూ ఖచితముగా నిర్ణయించలేదు. ఆ గ్రంథమున హరికథా రచన కుండవలసిన లక్షణములు సంపూర్ణముగా లేవు పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి గారిచే పరిష్కరింపబడిన రామదాస చరిత్ర విమర్శ యను శీర్షికలో హరికథ 15 వ శతాబ్దము చివర ప్రారంభ మయ్యెనని తెలుపబడి యుండెను. కానీ అధ్యాత్మ రామాయణము 1760 లో రచించబడెను. హరికథా యుగము 19వ శతాబ్ది చివరి భాగముగా రజనీ కాంతారావు గారు నిర్ణయించి యుండిరి. అద్యాత్మ రామాయణ కర్త సుబ్రహ్మణ్యం గారు తంజాపూరు జిల్లా మునిపల్లెలో జన్మించిరి. కాళహస్తి సంస్థాన విద్వాంసుడయి యుండెనని మునునూరు వెంకట శాస్త్రిగారు రచించిన విద్యార్థి కల్పతరువు రెండవ భాగమున గలదు. గుంటూరు జిల్లా బాపట్ల తాలూకా పొన్నూరు ఫిర్కాలోని మునిపల్లె గ్రామ కాపురస్థుడు మునిపల్లె సుబ్రహ్మణ్యం కవి యని, గూడూరు నమశ్శివాయగారు తే 19-10-1975 ది ఆదివారం ఆంధ్రప్రభలో రంగస్థల నటరత్నాలు అనువ్యాసములో తెలియ బరచి యుండిరి. అధ్యాత్మ రామాయణ గ్రంథమున బాలకాండలో 17 కీర్తనలు అయోధ్యకాండలో 26, అరణ్యకాండలో 11, కిష్కింధకాండలో 9, సుందరకాండలో 12, యుద్ధకాండలో 47. మొత్తము 122 కీర్తనలు గలవు. నేను పరిశీలించిన గ్రంథము 1938 లో మద్రాసు విఠోబా ముద్రాక్షర శాలయందు ప్రచురితమైనది ఇందు కీర్తనలుతప్ప అన్య రచనలు

లేవు. R. V. S. సుందరంగారి దేశికవితలో ఆధ్యాత్మ రామాయణ కీర్త నలు 104 అని తెల్పిరి. కీర్తనలలోనే కథ నడచినది. ఆధ్యాత్మక చింతన మనస్సు, ప్రవృత్తులు తనువు అశాశ్వతము, ఆత్మతత్వము మొదలగు వైరాగ్య విషయ బోధన లెక్కువగా చర్చింప బడినదీ రామాయణ గ్రంథము. శేష గిరీశున కంకితమియబడినది. ఈ కీర్తనలు భక్తిరంజనిలో ఆకాశవాణి యందు మనము వినుచుందుము. కీర్తనలలో మూడు మొదలు తొమ్మిది వరకు చరణములు గలవు. ఈగ్రంథమునకు హరికథయని నామకరణము చేయబడలేదు. కీర్తనలు అని నామకరణము చేయబడినది, ఇందు మొదటి కీర్తన.

ధన్యాసి - ఆది.

ప॥ నమశ్శివాయతే నమో భవాయ॥

అ॥ సమానాధిక రహితాయ శాంతాయ స్వ
ప్రకాశాయ। ప్రమోద పూర్ణాయ భక్తౌఘ
పాలనాయ ॥నమ॥

చ॥ గర్వితదానవలోక ఖణ్డనాయ శ్రీరజత
పర్వతాగ్ర నిలయాయ పావనాయ।
సర్వలోక పాపపుంజ నిర్వాప! ణాయ శర్వాయ।
దర్వీకర భూషణాయ సర్వోత్తమాయ ॥నమ॥

ప్రతి కాండము చివర "నిదియు జెప్పెను సుబ్రహ్మణ్యకవి శేషగిరీశు పేర విఖ్యాతి మీఱ నధ్యాత్మ రామాయణాఖ్యానమున" అని వ్రాయ బడినది. పార్వతికి శివుడు రామాయణ గాథ చెప్పినట్లుగా కథారంభము.

గ్రంథము చివర కీర్తనలో ఇది తెనుగు కీర్తనల రామాయణము అని తెలుప బడినది.

॥కీర్తన చరణం॥ శ్రీ శేషాచల వేంకటాఖ్య లక్ష్మీరమణుని పేర
సీశ బ్రహ్మాది లక్ష్మీ సల్వేనిశత్వశాలి పేరను
కోశాతీత నిరీశత్వ జ్ఞానగుణు౹ డౌ విష్ణునిపేరను
కృష్ణునిపేరను ! ఈ శుభాధ్యాత్మ రామాయణ
ణము తెనుగు కీర్తనలుగ నేర్పరించెన్, సగుణ
ముక్తామణుల పేరను కవుశలంబునను యుద్ధ
కాండము యిది షట్కాండ మఖండచిదనుభవి
రుచిరవి సుబ్రహ్మణ్య కవి ॥శ్రీ॥

దివాకర్ల వెంకటావధాని గారు తన ఆంధ్రవాఙ్మయ చరిత్రలో జాన పదగేయ విభజన క్రింద కథలు వస్తువులుగా గల కీర్తనలను గేయ కావ్యము లను చెప్పి వానిని మరల పౌరాణిక గేయ కావ్యములు చరిత్ర గేయ కావ్య ములు పారమార్థిక గేయ కావ్యములు అని పలురకముల విభజన గావించిరి. కూచకొండ రామాయణము ధర్మపురి రామాయణము శారద రామాయణము మోక్షగుండ రామాయణము చిట్టి రామాయణము అనువానిని పౌరాణిక గేయములుగా విభజించిరి. త్యాగయ్య కీర్తనలు, తాళ్లపాక వారి కీర్తనలు క్షేత్రయ్య పదములను ఆధ్యాత్మ రామాయణ కీర్తనలను రామదాసు కీర్తన లను పారమార్థిక గేయములుగా విభజింపబడెను. ఈ విభజనలో ఆధ్యాత్మ రామాయణము మోక్షగుండ రామాయణపు సరసన చేర్చబడలేదు. అందుచే ఆధ్యాత్మ రామాయణము హరికథ యని చెప్పుటకు వీలుపడదని యుహింప నగును. కవి హరికథ యని పేరిడనపుడు మనమెట్లు దానిని హరికథ యని

నిర్ణయింపగలము? యక్షగానములు హరికథలు ఒకే పోలికలు కలిగి యున్నను రెంటిని వేరు వేరుగా పరిశీలించు చున్నాము గదా ?

ఈ జానపద గేయములు అపండిత జనోదితములైనను వానిలో నెడ నెడ రమ్యమ్మైన భావములు వీనుల విందు చేకూర్చు పలుకుబళ్లు జాతీయ పదప్రయోగము ఆనంద ప్రదమైన రసపోషణము కానవచ్చు చుండును. రాజకీయ భావములు సంస్కరణ భావములు ప్రచారము చేసి సామాన్య జను లలోఁ జైతన్యోద్యమము కలిగించుట కీగేయములెంతో తోడ్పడినవని, దివాకర్ల వారన్నారు. ఈ లక్షణములు ఈప్రయోజనములు అన్నియు జాన పద గేయముల కలయికగల హరికథలలో గూడ పూర్తిగా గలవు. హరికథ గూడ జనపదులచే పోషింపబడుచున్నదే అయియున్నది. కథాగేయములు పలురకములు, కొన్ని హరికథలు, మరికొన్ని జంగం కథలు, గమ్మెటకథలు, బైనీడి సుద్దుల కథలు, యక్షగానములు, వీధినాటకములు మొదలైనవి. రగడ ప్రాధాన్యము గలది జంగంకథ గేయ ప్రాధాన్యము గలది హరికథ, సుద్దుల ప్రాధాన్యము గలది బైనీడికథ ఇట్లు వీనికి ఒక్కొక్క రచన ప్రాధాన్యత గలిగి యున్నప్పటికినీ ఇతర రచనా ప్రక్రియల సమ్మిళితముగా ప్రతికథయు వానివాని ప్రత్యేక లక్షణములు గలిగి శోభిల్లు చున్న కొందరు హరిదాసులు స్టేజినాటకములనే హరికథలుగా జెప్పుచున్నారు. యక్షగానములను మార్పుల చేర్పులతో హరికథలుగా చెప్పుచున్నారు. కేవలం మహారాష్ట్ర అభంగముల తోనే హరికథలు చెప్పువారునూ గలరు. కానీ హరికథయని యనుటకు దాని ప్రత్యేక లక్షణములు వేరుగానుండును. ప్రస్తుత మీగ్రంథమున విచారణీయ మైనది హరికథ గాన గేయప్రబంధముగా హరికథ లక్షణములు గల హరి కథా వాఙ్మయమే మనికిచట విచారణీయము. అధ్యాత్మ రామాయణము హరి కథగాదని నాతలంపు. శంకరాచార్యుల వారి భజగోవింద శ్లోకములు పాట లుగా మనము ఆకాశవాణి భక్తిరంజనీ కార్యక్రమములో వినుచుందుము,

అంతమాత్రమనునే వానిని కీర్తనలనుటకు వీలులేలుగదా? అట్లే కథా గేయ ములనేకములు న్ననూ వానివాని ప్రత్యేక లక్షణముల ననుసరించి మనకవ సరమైన వానిని గైకొని చర్చించుట సమంజసము అనితలంతును. యక్ష గానపక్కిక వేరు హరికథ పక్కిక వేరు అయిననూ మనమిప్పుడు హరి కథలు చెప్పుకొనుచున్నట్లు పూర్వము యక్షగానములు అమలులో నుండిన వని రచనా శైలిని బట్టి గ్రహింప వచ్చును. ప్రస్తుతం హరికథలను పేర ప్రచురించబడి ప్రత్యేకముగా ప్రచారములో నున్నవి అనేకములైన గ్రంథ ములు గలవు. యక్షగానములు హరికథలు తల్లిబిడ్డలవలె పోలికలు గలిగి యున్నందున ఈ గ్రంథమున కొంత యక్షగాన పరిశీలన గూడా జరుగు చున్నది.

## య క్ష గా న ము లు.

### శారద రామాయణం :—

చివరి కీర్తన చరణమందు "రామభక్త కవి చెప్పె కథనంబు" అని వ్రాయబడెను. ఇందు షట్కాండలు సంపూర్ణముగా రామాయణము ఒకే దరువులో నడపబడినది. అటతాళములో మొత్తం 220 చరణములలో కథ సంపూర్ణమైనది. "ఓ శారదా కరుణానిధీ" అను ఒకేపల్లవి గలదు. ఇందలి దరువులందు అసమాపక క్రియలెక్కువగా యున్నవి.

దరువు - మొదటి చరణం

యించి॥ విఘ్నేశ్వరుని ముందుబూజించి। శారదాంబ
నేర్పడ బ్రస్తుతించి। సత్కవుల నెల్లను మదినుతించి।
రాముడవతరించిన యొద్దనుంచి।

— — — — — — — —

ఇట్టికథ చాల నేవిస్తరించి। మంచి నేర చమత్కారముల
నెంచి యొౌశారదా కరుణానిధీ।

## ధర్మపురి రామాయణము :—

ఇది యక్షగానము కవి శేషాచలదాసు, ధర్మపురిలోగల నృసింహ స్వామి కర్పితము గావింపబడినది, షట్కాండలు గలదు. 1899 లో ముద్రణము జరిగెను. దేవతాస్తుతులు లేవు, నాటకీయ సంవాద రచన లేదు అఖ్యానశైలిలో రచన సాగినది. ఇది శ్రవ్యకావ్యము భాష సరళము, దరువులు గలవు. ఇతర గ్రంధముల శ్లోకములు చేర్చబడినవి.

మొదటి కీర్తన - ఏకతాళం

పలికెద నోట రామాయణం - స్వామి పలికింపపూనె రామాయణం॥
బరువైన కథ రామాయణం - రామభద్రుని లీల రామాయణం॥
ముక్తినొసంగు రామాయణం సుర - మునులకు మెప్పు రామాయణం॥
బోధకు దగిన రామాయణం - లోక పూజితమైన రామాయణం॥

## జ్ఞానకురవంజి :—

ఇది యక్షగానము, భక్తి జ్ఞాన వైరాగ్య మూలంబగు వేదాంత విచారంబైన గ్రంధము. 1867 ప్రాంతమున జిందాళ్ల నంజప్ప గారిచే రచింపబడినది. మునిపతికి ఎరుకలసాని సోది చెప్పుట ప్రారంభము. పరమాత్మ శింగడు, ముక్తికాంత శింగి, ఈరెండే యిందలి పాత్రలు. ద్విపదలు, దరువులు, దండకములు, పద్యములు గలవు.

క॥ మనసే జగములు యుగములు
మనసే సంసార కర్మ మలినము లెల్లన్
మనసే యిహపర బంధము
మనసే మోక్షంబు మర్మమెరిగిన యంతన్.

శింగి - శింగడు సంవాదం :— యాల

శింగి :- నిత్యానందా పట్టాణము నా
సత్యమానే మేడనెక్కి వుత్తమా
వీధినీ యుందమా ఓ ఓ యెరుకాల శింగా
కోరికాదీరా కూడియుందామా ॥నిత్య॥

శింగడు :- యెన్నాడు బాయనీ రాతిపొన్న
పువ్వులతోటలో నాకన్నెరా నిన్ను
కలపి యుండెనే ఓ ఓ యెరుకాల శింగి
కన్నులాశ కరువు దీరెనే ॥యెన్నా॥

## నిజలింగ చిక్కయ్యా చరిత్ర :—

యక్షగానము కవి పిడుపర్తి గురుశిష్యుండగు నిమ్మయ్యా, కళ్యాణ పురమున మున్నాటి కులమువాడు. నిజలింగ చిక్కయ్యా దుర్గుణములు కల వాడైనాడు చివరకు దొంగతనమునకేగి బసవేశ్వరుని పూజామందిరమునకు కన్నమువేసి లోపల జరుగుచున్న బసవేశ్వరుని శివపూజలు రాత్రి యంతయు గాంచి భక్తుడై బసవేశ్వరుని యొద్ద ఉపదేశమంది పోవుచుండ తలారి రాముడు భక్తుడైన నిజలింగ చిక్కయ్యాను తనయింటికి గొనిపోయి విందులు

చేసెను. ఆ రాత్రి తలారిరాముని భార్య చిక్కయ్యను ప్రేమించెను. కానీ చిక్కయ్య అందులకు నిరాకరించగా ఆతడే తనను బలవంతము చేసెనని నిందమోపెను. మఠాధిపతులు విచారించి చిక్కయ్య తల నరికించిరి. శిరస్సు మాట్లాడెను. భక్తులు తమ తీర్పు తప్పయని గ్రహించి తమ శిరస్సులు నరుక్కొనిరి. శివుడు ప్రత్యక్షమై యందరిని బ్రతికించెను. ఇది ఇందలికథ, ఇదినాటకముగాదు. ఏలలు, ధవళములు, అర్ధచంద్రికలు, జలలు అను రచనలు గలవు. ఈ కవి పాల్కురికి సోమనాథుని శిష్యుడనిన్న (1390-1440) ప్రాంతమున వాడనిన్న మునుసూరి వెంకట శాస్త్రిగారి విద్యార్థి కల్పతరువులో తెలుపబడెను. ఈ కథ మూఢభక్తికి వీరశైవమత విజృంభణమునకు నిదర్శనము.

సుగ్రీవ విజయము :—

ప్రచురిత యక్షగానములలో మొదటిదని R. V. S. సుందరం గారనిరి. S V జోగారావు గారు ప్రోలుగంటి చెన్నశౌరి 15వ శతాబ్దములో రచించిన సౌభరిచరితమును మొదటిదిగా సుగ్రీవ విజయము తరువాతదిగా పేర్కొనెను. సౌభరి చరితము అలభ్యము, సుగ్రీవ విజయమును కందుకూరి రుద్రకవి రచించెను. ఈతడు 1620 సం॥పు ప్రాంతము వాడని విద్యార్థి కల్పతరువునందు గలదు. మరియు ఈతడు స్వర్ణకారుడు, చెన్నశౌరి ఆర్వేల నియోగి, మునునూరి వెంకటశాస్త్రి విద్యార్థి కల్పతరువును బట్టి చూచిన మొదటి యక్షగానం (1390-1440) నిమ్మనాధుని నిజలింగచిక్కయ్య యక్షగానము, తరువాతది (1500) చెన్నశౌరి సౌభరి చరితము అగుచున్నది. ఈగ్రంథ మందలి జనవాడుకలో నున్నపాట.

ఎంతపని జేసితివి రామా॥ నిన్ను।
నేమనందును సార్వ భౌమా।
చెంతకిట్లు రాలేక - చెట్లలో దాగుండి
వింత మృగమును గొట్టు - విధమాయెనా బ్రతుకు॥

ఇట్లు తార విలపించును, ఇది శ్రవ్య యోగ్యము. ఇట్టి యక్షగాన ములే తంజావూరి విజయరాఘవుని కాలమున నాటకములుగా మారినవి.

గంగా గౌరీ విలాసము :- యక్షగానము, (1513-1563) ప్రాంత మున పాలించిన పెదకెంపరాయడను రాజు రచించెను. ఈ గ్రంధము నందలి అర్ధరేకు.

అటతాళము

శంకరుని జూపరే నవమీవాంకుని జూపరే!
యీశుని జూపరే నాప్రాణేశుని జూపరే!
శూలిని జూపరే వర శుచిపాలుని జూపరే!
కోవిదుని జూపరే————————

ఉమా మహేశ్వర విలాసము :- యక్షగానము అధునికము, కవి భారతి రామరాజు, కడప జిల్లా పొట్లదుర్తి నివాసము. వందిమాగధుల వంశము, కనికులము. నెల్లూరు జిల్లా పార్లపల్లి లోని కైలానాధస్వామి వన విహారమును కథగా వర్ణించెను. ఇది శ్రవ్యకావ్యము, దీనిని పార్లపల్లి వాసి ములుమూడి పిచ్చిరెడ్డిగారు ముద్రింపజేసిరి. హరికథ పక్కీకలో నున్నది. సీసపద్యముల చివర " పార్లపల్లి పురీశ సంభరిత భేశ! లలిత లోకాధినాధ కైలాసనాధ! " అని మకుటము గలదు. తొహదాలు రగడలు లేవు. చక్కని కవిత్వము.

కన్యకా పరమేశ్వరి చరిత్ర :- యక్షగానము, (1898) చెన్నపురి నివాసులు రఘునాయకం రామానుజ సూరిచే విరచితము, కృతిపతి కల్లెపల్లి

కృష్ణమూర్తి శ్రేష్ఠి హరికథ పక్కాకగా యున్నది. శ్రవ్యకావ్యము రచనలలో తోహరాలు కీర్తనలు గలవు. కథ 8 ఆశ్వాసములుగా విభజించబడినది. వాసవి వైశ్యాంగనల కిచ్చిన శాపము ఈ కందములో గ్రహింపుడు.

క॥ ఇది మొదలు వైశ్యకులమున
మదవతు లుదయించి రేని మహనీయ గుణా
స్పదులై కురూపులగుదని
యదయత శాపంబువిచ్చె యార్యులు వినగన్

అయోధ్య రామాయణము :- కాలము తెలియదు, కవి గంగు కృష్ణదాసు తండ్రి లక్ష్మణాచార్యుడు బాలకాండ మొదలు యుద్ధకాండతో సంపూర్ణము దరువులు లేవు, కీర్తనలు గలవు. ద్విపదలు ఎక్కువ. రచన సులభశైలి, ఏకపాత్రాభినయ యోగ్యము. ఆంజనేయుడు మొదట రామలక్ష్మణుల కలసి కొనప్పటి కీర్తన.

నా ద నా మ క్రి య - ఆ ది.

అయ్యా మీరెవరయ్యా యియ్యెట రాపనులేమయ్యా॥
అయ్యా మీరెవరయ్యా!
మూలపు టయ్యలైన యాహరిహరులో
మేల్వయ్యారపు దివాకర చంద్రులో
నయ్యన దెల్పుడ సాష్టాంగంబిడు ॥దయ్యా॥

పాత్రోచిత భాషగలదు. ఇందలి పద్యరచన సంబోదన రీతిలో లేద్కు కథచెప్పురీతిలో నున్నది. వచనములు ఉపమానోదాహరణములలో గ్రాంధికముగా పండిత రంజకముగా నున్నది.

వచనం :— అప్పుడప్పురవరంబు పురందర మందిరంబునుం బోలె సుధర్మాభిరామంబై వైకుంఠంబునుం బోలె అనంత సేనానాయక విరాజితంబై రాజరాజనందనంబునుం బోలె———
సీతారామ పరిణాయావలోకన కుతూహలాగత సమస్త రాజన్య కిరీట సంఘట్టన నిపతిత పద్మరాగాది మణిగణాలంకృత————-----
వారాంగనాజన పతిత ఘంటాపదంబును ...............
విదేహ ధాత్రీవరపుత్రీ కల్యాణ కాలంబున సకల గోత్రాగోత్రభిన్నస్తోత్ర పాత్రంబై జెన్నొందె నయ్యె విధంబున——— ———

పతివ్రతా మహాత్మ్యము :- (1920) కవి, కాంట్రంబాక కేశవాచార్యులు ఇది యక్షగానము శ్రవ్యకావ్యము 3 ఆశ్వాసములలో కథ ముగిసినది. స్త్రీలు అత్తవారింటిలో మెలగవలసిన రీతి పుష్పవతుల లక్షణములు ఋతుకుల వివరణము సుమంగళుల లక్షణములు దుర్మార్గస్త్రీల లక్షణములు లక్షణయను, పతివ్రతా లక్షణము సునందినీ ప్రభావము అనసూయ, సావిత్రి, పార్వతి, లక్ష్మీదేవి గారల ప్రభావములు ఈ గ్రంధమున టూకీగా రచింప బడినవి. కురుజంపె లను రచన గలదు. కురుజంపె యనగా కురుచ జంపె యని యర్ధము. కీర్తనలకు సంబంధించినవి యయి యుండును. ఈ గ్రంధమున ఇట్లు అడ్వర్టైజుమెంటు గలదు. "మద్రాసులో శ్రీమాన్ పండిట్ లక్ష్మణాచార్యులవారు 1917-1918 లో మహాభారతమును 72 హరికథలుగా ఉపన్యాసములిచ్చిరి. వానిని ప్రచురించి యుంటిమి" అని గట్టుపల్లి శేషాచార్యులు శశిలేఖ ఆఫీసు, మద్రాసు వారు ప్రచురించిరి.

త్యాగరాజ స్వామివారి ప్రబంధములు 18వ శతాబ్దియంతమున రచింపబడినవి. ప్రహ్లాద భక్త విజయము, నౌకాచరిత్రము:- ఇందు కందములు

గీతములు ద్విపదలు కీర్తనలు సీసములు వృత్తములు గలవు, ఇది నాటకము. అంక విభజన గలదు. కథాప్రారంభమున దౌవారికు డొచ్చుట ప్రశ్నించుట, సూత్రధారుడు సమాధాన మిడుట గలదు. పూర్వము నాటకములకు రంగ స్థలములు ప్రత్యేకముగా లేవు, వీధులలో కూడలిగా యున్నచోట్ల నాల్గుగుంజలు పాతుట మరుగునకై దుప్పట్లను తెల్లని గుడ్డలు కట్టుట వెలుతురుకై దివిటీలు వెలిగించుట, ఆ రోజులలో గ్రామములలో ఈదివిటీలు వెలిగించి మోయుట చాకలి వారిపని అయివుండెడిది. అందులకు వారికి మాన్యము లుండెడివి. త్యాగరాజు గారి వచనమును పరిశీలించినచో ఆనాటి నాటకము లెట్లుండెడివో విదితమగును.

ఇవ్విధంబున దౌవారికుండు వచ్చి సూత్రధారునింగని, ఈసభ(యేమి? ఈదివిటీల ప్రభలేమి? ఈమృదంగాది వాద్య ఘోషములేమి? ఈసొగసైన వేషములేమి? ఈనాటకంబునకు పేరేమి? దీనిఫలమేమి? ఈనాటకంబాడుమని ఎవరానతిచ్చిరో యావిషయముల నెరిగింపుమనగా సూత్రధారి యెరిగించు మార్గం బెట్టులనిన———— —— ..... దౌవారికుని వేషమెటులుండునో వాని అభినయమెట్టిదో యీ దిగువ త్యాగరాజ కీర్తన పరిశీలించిన తెలియగలదు.

### కల్యాణి - ఆది

ప॥ వాసుదేవ యని వెడలిన యీ దౌవారికుని గనరె॥

అ॥ వాసవాది సురపూజితుడై - వారిజ నయనుని మదిని
దలచుచును॥

చ॥ సిరుకావి ధోవతులను గట్టి - నిటలమునను శ్రీచూర్ణము
బెట్టి పారివెడలి యీసభలో జుట్టి - సారెకు బంగరు
కోలను బట్టి ॥వా॥

2చ॥ మాటిమాటికిని మీసము దువ్వి - మన్మధరూపుడు తాననిక్రొవ్వి
దాటిదాటి పడుచును తానివ్వి - ధంబున బలుకును పకపక నవ్వి॥

3చ॥ బాగుమీర నటనముసేయుచును - పతితపావనుని తావేడుచును,
రాగతాళ గతులను బాడుచును - త్యాగరాజ సన్నుతుని బొగడుచును ॥వా॥

**1921,** బి. సుందరమ్మ :- వీరు రచించినది యక్షగాన మైననూ అంతా హరికథగనే యున్నది. కథ పేరు సంపత్శుక్రవార వ్రత కథ. ఈమె భర్త బి. శేషగిరిరావు హైదరాబాదు హైకోర్టు వకీలుకు అంకిత మిచ్చినది. సతీ కర్తవ్య సూచన యవి ఒక కంద పద్యము వ్రాసినది.

క॥ భగవతి భార్గవి నెంచుచు
మగువకుఁ గర్తవ్య మెద్ది మహిమకొంటిన్
మగని మనసెఱిఁగి బ్రతుకుట
తగు సతి కిదియొకటి దివ్య తపమను కొంటిన్॥

తన భక్తురాండ్ర నుద్ధరించు నుద్దేశ్యముతో పార్వతి శివు నను జ్ఞ పొంది తన వ్రత మహిమ లోకంబున చాటుటకై బయలు దేరగా నారదు డెదురుపడి కలియుగములో లక్ష్మి పడుచున్న బాధలు పార్వతి కిట్లు వివరించె నను సందర్భమున ధనము దుర్వినియోగములను, గూర్చి ధనవంతుల దుష్ప్ర వర్తనలను గూర్చి కవయిత్రి ఈ క్రింది సీసమును వ్రాసినది.

సీ॥ సోమరి పోతులై। సొక్కుచుండెడి వారి
సొగసులకై యుండు। సొమ్ము నేను
నిజ ధర్మముల్ మాని। ప్రజల పీడించెడు
డాంబికాధములకు। డబ్బు నేను
తనుజులై తలి దండ్రు। లను విడవాడెడు
తంటల మారికి। ధనము నేను
హింసా పవాదంబు। సంసార మనియెంచు
తంటరి వారింట। పంట నేను
టంకులాడిని జేరి। బొంకులు బ్రతుకైన
నమ్మిక ద్రోహి ధ। నమ్ము నేను
దోపు తిరునాళ్లతో। ద్రోహులై జీవించు
దుర్మార్గులింటిలో। దుడ్డు నేను
కలహించి యన్యుల। కన్నీటిలో ముగ్గి
కడతేరు వారికి। కాసునేను
మద్యపానంబులో। మహితులై పోట్లాడు
మానహీనుల ధన। మైతి నేను

గీ॥ ఎన్ని దుశ్చేష్టలున్న నే। నన్నిటికిని
లొంగి యుందును వారింట। భంగపడుచు
సుకృత శేషంబు కరగిన। సున్నయగుదు
నైన నేమి ఫలంబు సం। మ్మాన మగునే॥

పార్వతి శుక్రవారమున సోమగిరి నగరంబు జేరి పద్మసాగరమను అయిదిండ్ల అగ్రహారము పోయి మొదటి యింటిలో ప్రొద్దెక్కినను

అందరూ నిదురించు చున్నందున రెండవ యింటికి పోయినది. అచట అందరు చద్ది యన్నము తినుచుండిరి, మూడవ యింటిలో చింపిగుడ్డలు కుట్టుకొనుచుండిరి. నాల్గవయింటిలో తలప్రేలు గ్రుక్కుకొనుచుండిరి. వారిండ్లకు పార్వతి పోలేదు. అయిదవ యింటిలో గృహిణి ఇల్లలికి ముగ్గులు వేసి తోరణము లలంకరించి తులసీ పూజచేసి గౌరి పంచాక్షరిని జపించుచూ బిచ్చమునకై పోయిన పతి రాకకెదురు జూచుచున్నది. ఉమ అట్టి బీద భక్తురాలింటికి పోయినది. ఆభక్తురాలి పేరు సుగుణవతి, ఆమెభర్త సదానందశర్మ మంచి భక్తుడు. గౌరి ముసలి ముత్తైదువ వేషములో వారింటికి పోయి ఇల్లాలిచే తులసీ పత్రం గరిక పుష్పములు గైకొని సుగుణవతిని సోమగిరి నగరమున గల ఉంద్రాళ్ల శెట్టి వద్దకంపెను. ఆమె పోయి గరిక పోచల నాతనికిచ్చి భోజన సామాగ్రి తెచ్చుకొనెను. ఇంటికి వచ్చు సరికి సుగుణవతి గృహము భోగ భాగ్యములతో విలసిల్లు చుండెను. పార్వతి అదృశ్యమాయెను. అనాడు పూజా సమయంబున ఒక గొల్లపడుచు సుగుణవతి యింటికి మజ్జిగ పోయుటకై వచ్చి త్వరగా మజ్జిగ పోయించు కొనండి నాభర్త చావు బ్రతుకులతో మంచములో నున్నాడు, నేను త్వరగా పోవలెనని యనగా ముసలి ముత్తైదువ వేషంలోగల పార్వతి ఆ గొల్ల పడుచుకు అక్షింతలు యిచ్చినది. ఇంటికి పోవుసరికి గొల్లదాని భర్త చని పోయి వుండెను. శవముపై అక్షింతలు చల్లగా భర్త బ్రతికెను. ఈవార్త ఆ దేశపు రాజు భీమవర్మవిని సుగుణవతిని రావించి శుక్రవార వ్రతకథ తెలుసుకొని పుత్రులు లేని తన భార్య హేమాంగిచే శుక్రవార వ్రతమాచరింప జేసెను. అంత వారలకు సుపుత్రుడు కలిగెను. ఇది ఇందలి కథా విషయము.

ఇట్టి కథలను మొన్న మొన్నటి వరకు చదువుకొన్న స్త్రీలందరు పిచ్చికథలని నిరశించి నారు. మరల ఏదైనా సినిమాలో ఇట్టి వ్రతాచరణము

చూచినారేమో ఇపుడు విద్యావంతురాంధ్రగు స్త్రీలు సయితము సదాచార సద్భక్తితో శుక్రవార వ్రతములాచరించుచూ, లక్ష్మి, పార్వతి, సరస్వతుల విగ్రహముల వలె అలంకారికులై భారతనారీమణులమని యనిపించు కొను చున్నారు. ఇది శుభసూచకమే గదా? వ్రతములు నీతులు నియమములు ఆచారములు ధర్మములు, పుణ్యములు తీర్థములు క్షేత్రములు కళలు కవిత్వ ములు అన్నియూ మానవులకేగాని పశువులకెందుకు?

ఇంతవరకు చదువరులకు, యక్షగాన రచనకు హరికథారచనకు తార తమ్యములు గ్రహించ గలందుకు కొన్ని యక్షగాన రచనలను వివరించితిని. మరియు ఇతివృత్తము వాని నామధేయముల తేడాచు గ్రహించుటకై మరి కొన్ని వివరముల నిచ్చెదను.

బాలపాపాంబ అక్కమహాదేవి చరిత్రను, కొనేటి దీక్షితుడు విజయరాఘవ కల్యాణ నాటకమును, పురుషోత్తమ దీక్షితుడు తంజాపురాన్న దానమను నాటకమును, తంజావూరులోనున్న శహజీ మహారాజు ఆంధ్రము లో 20 యక్షగానముల నాటకములు. కఠీరవుడను మైసూరు మహారాజు తెలుగులో 14 కురవంజికల్లై, పంచాయుధకల్లై, నాట్యవిద్యావిలాసము వసంతోత్సవ విలాసము, విభక్తికాంతా విలాసము, అష్టదిక్పాలక విలాసము, పావకినాటకము, వైవస్వత, నైఋతి, వారుణి, వాయవి, కౌబేరి మొదలగు నాటకములు, శరభోజమంత్రి ఆనంతరాయమణి విద్యాపరిణయము తులజాజి అనునతడు శివకామ సుందరి పరిణయము, రాజనందన విద్యావిలాసము, ఆలూరి కుప్పన ఆచర్యవిజయము, పంచనదీ స్థలపురాణము, భాగవత ఛాయాయణాది చరిత్రలు యక్షగానములు,

భాస్కర వెంకటాచలపతి :- (1731-1767) నాంచారు పరిణయము యక్షగానము. తక్కెళ్ళపాటి లింగన్న విద్వత్స్త్రభావి లాసము యక్షగానము. 18వ శతాబ్ది మధ్యభాగమున కంకటి పాపరాజు విష్ణుమాయ విలాసము, శివాజి అన్నపూర్ణా పరిణయ మను నాటకము. వేలటూరు వెంకటరామ శాస్త్రి 12 యక్షగానములు 1846 లో ఎల్లయకవి చంద్రతారావిలాస యక్ష గానము, దీక్షితుల పాపాశాస్త్రి చెంచు నాటకమును రచించిరి.

నిజాము రాష్ట్రమున మంథెన నివాసులు, ముద్దయ కవి మంథెన రామాయణమను యక్షగానమును రచించియుండెను. 1860 సంవత్సరము లో ఇటుకల తిమ్మయ్య శెట్టి కన్యకా పురాణమును మైసూరు సామంతరాజగు సుగుటూరి ముమ్మడి తిమ్మరాజు (1614-1630) లో శంకర సంహిత యక్ష గానము 17వ శతాబ్దమున సిద్ధేంద్రుడు భామాకలాపము, లేక పారిజాతాపహర ణమను యక్షగానము, త్యాగరాజు శిష్యుడు మేరటూరు అరుణాచలం 19వ శతాబ్దమున కంసవధ యక్షగానం, 1830లో పిఠాపురం తాలూకా కొమరగిరి నివాసం చిలకమర్తి నారాయణాచార్యులు భాగవత దశమస్కంధ పూర్వభాగం రచించిరి. (మునుసూరి-విద్యార్థికల్పతరువు)

1885 లో కావూరి వెంకటరామకవి సత్యన్నారాయణ చరిత్ర యను యక్షగానమును రచించెను. ఆగ్రంథము ప్రథమ పేటిపై యిటుల వ్రాయ బడి యుండెను "శ్రీమత్సమస్తసుజనులకు భగవద్భక్తి, నిశ్చలం బగు నటుల చేయ సమర్థంబగు నీసత్యనారాయణ చరిత్ర యక్షగానము సంగీత సాహిత్య విశారదులగు శ్రీమాన్‌తచ్చూరు శింగరాచార్యుల వారిచే పరిష్క రింపబడినది".

1935 లో రామాయణము హరికథగా రచించిన రామపుత్రి 1905లో షణ్ముఖీదేవి చరిత్ర యక్షగానమును రచించినది. ఇది ప్రతిప్రత కథ, హరి

కథ రచనవలెనే యున్నది. 1878 లో వరగంటి శేషగిరిదాసు రామాయణ యక్షగానము షట్కాండలు రచించెను.

1909లో అగస్త్యరాజ రామన సీతాకల్యాణమును యక్షగానముగ రచించెను. ఈ గ్రంథము కేవలము బాలుర కుపయుక్తముగా వ్రాయబడి నట్లు గ్రంథకర్తయే తెలిపినాడు. బాలరామాయణం సుమతీశతకం భాస్కర శతకం రుక్మిణీ కల్యాణము పిల్లలచే పూర్వము పాఠశాలలలో కంఠస్థము చేయించెడివారు. ఈ గ్రంథము గూడా అదేయుద్దేశముతో రచింపబడినది. కీర్తనలకు రాగములు నిర్ణయింపబడలేదు, ఇందు శ్రీరాముడు ఎరుకలసాని వేషములో సీతను కలుసుకొన్నట్లు వర్ణించబడినది. లిపి పెద్దసైజులో నున్నది. రాముని గాంచినపుడు సీత పరిస్థితిని ఇట్లు వర్ణించబడినది.

అర్ధ చంద్రిక.

ముందరగా పోకముడి యటు వీడెన్
గ్రక్కున రవికె పటుక్కున పగిలెన్
మృగనేత్రికప్పుడు మేనుచెమర్చెన్
భయమును సిగ్గును పై పైగ్రమ్మెన్
గాజులు బిగువులుగా గనుపించెన్
జాజులు కొప్పున జలజల రాలెన్
కొంచెముగా పైటకొంగిటు జారెన్
అందెలు ఘల్లుఘల్లుమనుచు మొరసెన్
కుచములు బరువు గునిసెను నడుమున్
బొమ్మల కాంతులు గ్రమ్మెను దిశలన్.

రా॥ గోపాల రామదాసు :_ (1884) సీతాస్వయంవరమను యక్షగానమును రచించెను. గ్రంథముపై "జగత్సమేధిత పుణ్యసీమంతిని బాలికా ప్రముఖులు చదువుకొనుటకుపయుక్తముగా రచింప బడినది." అని వ్రాయబడి యున్నది. ఈ కీర్తనను బోలిన కీర్తన హరికథలలో నెక్కువగా పాడబడుచుండును.

దరువు - సారంగ - ఆదితాళం

ఇందరిలో నెవ్వరిని బెండ్లాడెద విపుడుదెల్పుమో సీతా।
యందగత్తె నీమదికిట సమ్మతమైన దెవరు సీతా।
రతనాల తొటవు లమరిన యతడా! యతడుకాడు పోపోవే
ప్రతిలేని కిరీటము గలయతడా। యతడుకాడు పోపోవే
జతశాల్వలు కప్పుకొన్నయతడా। యతడుకాడు పోపోవే

---

చెలికత్తెలు సీతకు సభలోని రాజులను గూర్చి తెలుపుచూ ఇందెవరిని వరించితివని అడిగి తెలుసుకొను సందర్భములో పై కీర్తన పాడబడు చుండును.

1927 లో వరయూరు జియ్యరు తిరువడి సంబంధురాలగు రామానుజమ్మచే రచింప బడిన శ్రీరంగనాధుని పంగణ్యుత్తరోత్సవ మను యక్షగానము ఇందలి అర్ధచంద్రిక.

శ్రీరంగాధిప సేవిత వరదా। కామిత ఫలదా। కరుణ
వినోదా। కమల మనోహర। కవికులపోషా। కన
కాంబరధర। కంజదళాక్షా। పంచాయుధర। పన్నగ
శయనా! కౌస్తుభాంక శ్రీకస్తూరి రంగా॥

ఇందు కథయేమియు లేదు వర్ణనలమితము. రంగనాథస్వామి ఉత్స వములు, అలంకారములు వర్ణితములు. ఇట్టి యక్షగానములు నెల్లూరు వర్ధ మాన సమాజ గ్రంథాలయములో అనేకములు గలవు ఇట్లు ఆంధ్రదేశము నంతను ఎన్నివేలు రచింపబడి యుండునో అనూహ్యము

## హరికథా కవుల కాల పట్టిక

క్రీ. శ. 17 వ శతాబ్దములో శ్రీ కంచెర్ల గోపన్న (రామదాసు)

,, 17 వ శతాబ్దములో శ్రీ తిరుక్కాడయూరి కృష్ణదాసు

,, 1829 — 1847 శ్రీ స్వాతి తిరునాళ్ మహారాజు

,, 1805—1870 శ్రీరామాయణం వెంకట నరిసింహ కవి

,, 19వ శతాబ్దం చివర శ్రీ వెంకట విఠల్ దాసు

1898 శ్రీ గొల్లపూడి రామలింగ శాస్త్రి

1900 ,, తాళ్లూరి నారాయణ కవి

1900 ,, అన్నంరాజు సుబ్బరావు

1900 ,, కందుకూరి చంగల్వరాజు

1902 ,, మన్నేపల్లి వెంకటాచలం

1092 ,, వేటూరి కన్నయ్య దాసు

1905 ,, సీలి రాఘవదాసు

1905 ,, మీసరగండం మునిస్వామి

1906 ,, క్రొవ్విడి శేషవెంకట కాశీపతి

1909 ,, ఆనైతాండాపురం భారతి గోపాలక్రిష్ణయ్య
1910 ,, ఆదిభట్ల నారాయణ దాసు
1912 ,, ముక్కవెల్లి నరిసింహదాసు
1913 ,, వెంట సూర్యనారాయణదాసు
1914 ,, తోట గురుమూర్తిదాసు
1914 ,, గూడ క్రిష్ణయ్య
1920 ,, బాబు P. S. నౌషర్‌వాన్
1920 ,, నందివాడ జగన్నాధకవి
1921 ,, వెలగల సుబ్బారెడ్డి
1921 ,, అన్నదేవర నాగభూషరాయుడు
1921 ,, చదువుల బసవ శంకరకవి
1921 ,, చెరుకువాడ వెంకటరామయ్య
1923 ,, తోట వెంకటాచలదాసు
1923 ,, గుద్దంటి గోకర్ణము
1924 ,, అయ్యగారి వీరభద్రరావు భాగవతార్
1924 ,, పుతుంబాక శ్రీకృష్ణయ్య
1926 ,, చీమకుర్తి వీరరాఘవరాయ కవి
1927 ,, బి. బాలాజీదాసు
1927 ,, బొమ్మరాజు జానకిరామశర్మ
1927 ,, చల్లా రామలింగయ్య

1929 ,, కందుకూరు చంగయ్యార్యులు

1929 ,, కారెపాకం శేషాచలంపిళ్లె

1930 ,, గొర్తి కామరాజు భాగవతార్

1930 ,, రామాయణం రామక్రిష్ణయ్య

1933 ,, కారుపల్లి శివరామదాసు

1934 ,, తిరునగిరి శేషదాసు

1935 ,, కొమ్మూరి బాలబ్రహ్మానందదాసు

1935 ,, కోసూరి భోగలింగదాసు

1935 ,, హరినాగభూషణం

1936 ,, లకవరం శ్రీరామకవి

1936 ,, మద్దూరి సాంబయ్య

1937 ,, రామపుత్రి

1938 ,, కట్టా అచ్చయ్యకవి

1938 ,, మైనంపాటి నరిసింగరావు భాగవతార్

1939 ,, నల్లమల్లి బసివిరెడ్డి

1940 ,, జగ్గర్లపూడి వెంకటసుబ్బయ్య భాగవతార్

1940 ,, పెంటపాటి సర్వేశ్వర్రావు భాగవతార్

1941 ,, మంచెళ్ల వెంకటసుబ్బరాయ భాగవతార్

1941 ,, అచ్చుల లక్ష్మణకవి

1941 ,, పరిమి సుబ్రహ్మణ్య భాగవతార్

1942 ,, కామరాజు రామమూర్తిశర్మ భాగవతార్

1946 , గొన్నాబత్తుల వీరేశలింగదాసు

1946 ,, పెద్దింటి సూర్యనారాయణ దీక్షితదాసు

1946 ,. తిరుమల నల్లాన్ చక్రవర్తుల వెంకట
కృష్ణమా చార్యులు

1947 ,, ఉదయగిరి చన్నయ్య

1948 ,, అడిగోపుల వెంకటరంగం

1948 ,, జొన్నకూటి శామ్యూలుకవి

1950 ,, ధూళిపాళ వెంకట సుబ్రహ్మణ్యకవి

1950 ,, పెదపాటి కృష్ణమూర్తి బాలభాగవతార్

1951 ,, పుట్టా గోపాలదాసు

1952 ,, కొల్లవూడి మల్లికార్జునరావు

1955 ,, ములుకుట్ల పున్నయ్యశాస్త్రి భాగవతార్

1955 ,, తెల్లాకుల వెంకటేశ్వరగుప్త భాగవతార్

1956 ,, దండు వెంకురెడ్డి

1958 ,, పెళ్లూరు మస్తానయ్య

1959 ,. నేమాన వెంకట కొటీశ్వరశర్మ B. A.

1960 ,, సాధు సాంబశివ శర్మ

1964 ,; కడలి వీరదాసు

1967 ,, రావుల శ్రీరాములు

1970 ,, కె. శివరామిరెడ్డి భాగవతార్

1972 ,, బండ్ల సుబ్రహ్మణ్య పండిట్

1973 ,, పొత్తూరి మధుసూధనశాస్త్రి

1973 ,, పొలంరాజు శీతారామయ్య భాగవతార్

1976 ,, వాడరేవు శీతారామాంజనేయ భాగవతార్

1976 ,, శ్రీపతి పండితారాధ్యుల సాంబమూర్తి భాగవతార్

ఈ కాలపట్టిక, గ్రంధములు అచ్చొత్తించినపుడు వేయబడిన సంవత్సర సంఖ్యననుసరించి తయారు చేయబడినది. బి. బాలాజిదాసుగారి బాబు పి. యస్. నౌషర్‌వాన్‌గారి రచనలు ఆదిభట్ల వారికి పూర్వమే ప్రచారములో మన్నవని పెద్దలవలనదెలియుచున్నది.



## హ రి క థ లు — గ్ర ం థ ప రి శీ ల న

కంచెర్ల గోపన్న గారు 17వ శతాబ్దములో స్వీయచరిత్రను యక్షగాన రూపముగ రచించెనని శ్రీ శ్రీనివాస చక్రవర్తిగారి నాట్యశాల గ్రంథమున తెలుపబడి యుండెను. మరియు తిరుక్కడయూరి కృష్ణదాసుగారు 17వ శతాబ్దమున రామదాసు హరికథను రచించెనని ముసునూరి వెంకట శాస్త్రిగారి విద్యార్థి కల్పతరువులో వ్రాయబడి యున్నది. దీనిని మొదటి హరికథ అని చెప్పవచ్చును. కానీ ఆ పుస్తకము పరిశీలనకు దొరుకలేదు. డాక్టర్ రాఘవన్ గారు, 18వ శతాబ్దములో యక్షగానములు హరికథలుగా, మారినవన్నారు. శాలివాహనశకము 1574 లో వరదరామదాసు గారు కంచి నుండి భద్రాది చేరినట్లు (అనగా క్రీ. శ. 1652లో) నిర్ణయించిరి. వరద రామదాసుగారు ఆ ప్రాంతముననే రామదాసు హరికథ రచించియుందురు. గాన దీనినైనను మొదటి హరికథగా నిర్ణయించవచ్చును. లేక 1720-1790 ప్రాంతమున హరికథగా ప్రచారములో నున్న గోకులపాటి కూర్మన్నగారి మృత్యుంజయ విలాసమును మొదటి హరికథగా నిర్ణయించవచ్చునేమోనని తలంచెదను.

(1829-1847) స్వాతి తిరునాళ్ మహారాజు తిరువాన్కూరు పాలించెను. వీరు మేరుగోస్వామి ప్రోత్సాహముచే సంస్కృతములో కుచేలో పాఖ్యానము, అజామిళోపాఖ్యానము హరికథలుగా వ్రాసెనని శ్రీ రజనీ కాంతారావుగారు ఆంధ్ర వాగ్గేయకారకుల చరిత్రలో తెలిపియుండిరి.

19వ శతాబ్దపు చివరి ప్రాంతమున శ్రీమాన్ వెంకట విఠల్ దాసు గారు గజేంద్ర మోక్షమను హరికథ, రామజననము, రుక్మాంగద, ...

బాయి అను హరికథలను రచించెను. గజేంద్ర మోక్షమను హరికథలో ప్రార్థనాదికములు లేకనే కథారంభము చేయబడినది.

రామదాసు చరిత్ర :- ఈ గ్రంథము హరికథగా బహుళ ప్రచారములో నున్నది. దీనిని మొదట వ్రాసినవాడు రామదాసు అని యీ క్రింది తోహరానుబట్టి తెలియును.

తో హ రా :—

రామదాసుకథ వరరామదాసు రచియించెను సూచనగా
ప్రేమతోడ పింగరిదాపీ కథ ప్రకటన పలచెను బాగ॥

రామదాసు తనస్వీయచరిత్రను తానే వ్రాసుకొనినట్లు వారి కీర్తలలోని భావమును బట్టియే విదితమగుచున్నది. ఈతడు చిన్నప్పటినుండియే భక్తి భావమును అలవడజేసుకొనినాడు. అయిదేండ్ల ప్రాయమున రామాయణకథను విని భక్తిపరవశుడైనాడు, బాల్యమున బాలరామాయణాది గ్రంథముల పఠించినాడు. గోపనయని యీతని మొదటి పేరు. గోపన యనగా క్రిష్ణయ్య• కానీ యీతడు రామదాసైనాడు. చూచితిరా బాల్యమున బాలరామాయణ పఠన ప్రభావము !

రామదాసుగారి కీర్తనలలోని భావములు ముత్యములు రత్నముల వంటివి.

రామనామమే జీవనము అన్యమేమీరా కృపావనము॥
తారకమంత్రము కోరినదొరకెను ధన్యుడ నైతిని ఓరన్నా॥
శ్రీరామనామము మరువను సిద్ధము యముసకు వెరువను॥
పొయ్యేటప్పుడు వెంటరాదుగా పుచ్చిన వక్కైనా॥

తక్కువేమి మనకు రాముండొక్కడుండు వరకు॥
అబ్బబ్బ దెబ్బలకు తాళలేర రామప్ప గొబ్బున నన్నేలుకోరా॥
రక్షించె దొరవని నమ్మితి నన్ను శిక్షింప తప్పేమి జేసితి॥
ఇక్ష్వాకుకుల తిలక ఇకనైన బలుకవె రామచంద్రా॥
అడుగుదాటి కదలనివ్వను నాకభయమివ్వక నిన్నువిడువను॥
నను బ్రోవమని చెప్పవే శీతమతల్లి॥

అని యిట్లు రామునితొ తనభాధలను భక్తితో పట్టుదలతో పంతముతో బ్రతిమలాడుచూ బెదరించుచూ దీనముగా ధైర్యముగా స్వతంత్రముగా నిష్ఠురముగా విన్నవించుకొని ముక్తిని గొన్న చరితార్థుడౌ రామదాసు చరిత్ర, వారి కీర్తనలలో తెలియుచున్నది. త్యాగరాజు భక్తి మనవి చేసుకొన్నట్లుండును, రామదాసు భక్తి, అప్పు వసూలు చేసినట్లుండును. అంతేగదా మరి, రామదాసు రామునికి House building loan యిచ్చినాడు. త్యాగరాజట్టి అప్పు యేమియు రామునికి యివ్వలేదుగదా? అందుచే రాముని దబాయించుటకు త్యాగరాజుకధికారము లేదు.

1898 **గొల్లపూడి రామలింగశాస్త్రీగారు** శంకర విజయమను హరి కథను రచించిరి. వీరి నివాసం ప్రకాశం జిల్లా కొత్తపట్నం.

**తూము నృసింహదాసు చరిత్ర :—**

దీనిని నంబెరుమానూరు సూరి రచించెను. పింగరిగాసు వ్యాప్తిలోనికి దెచ్చెను. ఈ గ్రంథము రామదాసు చరిత్రమును బోలియున్నది. నృసింహదాసు గుంటూరు వాస్తవ్యుడు, ఆంధ్ర సంస్కృత పండితుడు, రామదాసు

వంటి భక్తుడు. హరికథలు జెప్పెడివాడని ఈ క్రింది తొహరాను బట్టి తెలియును. ఈయన త్యాగరాజు సమకాలికుడట.

తొ హ రా :—

అనిశము హరికథ చేయుచు నానందాబ్ధిలోన దేలుచును॥
మునుపు ఘనులు నడిచిన మార్గమున మోక్షమంద గోరుచును॥

ఈ చరిత్రమందలి కీర్తనలు కొన్ని నృసింహదాసుగారి స్వంతరచనలే అయి యున్నవి. కీర్తన చివర వారి నామము మకుటముగా గలదు. రామదాసు గారి కీర్తనల ననుకరించినాడు, తీర్థయాత్రలు చేసినాడు. తిరువళిక్కేణి పురమున భక్తుడగు వరద రామదాసు ఆయనవెంట భద్రాద్రికి పోయి లక్షయాభై వేల వరహాలు (వరహా అనగా నాలుగు రూపాయలు) నృసింహదాసుగారికిచ్చి రామోత్సవములు చేయించిరి. కొంతకాలము పిమ్మట అస్వస్థతచే వరదరామదాసు గారు పరమపదించిరి. నృసింహదాసుగారు భక్త బృందముతో భజన చేయుచూ తెప్పనెక్కి గోదావరిలో మునిగి మోక్షమందిరి. భగవదవతారపురుషులు గూడా యిట్లే అంత్యమున దేహమును చాలించిరిగదా! తెలియకుండా రైళ్లలో విమానములలో బస్సులలో ప్రాణాలు పొగొట్టుకుంటారు సామాన్యులు. భక్తులు తెలిసి భక్తితో భగవన్నామ స్మరణతో పరలోకయాత్ర కేగుదురు. ఈగ్రంథమందలి ప్రసిద్ధమగు కీర్తన యిది.

## కీర్తన

భజనజేసే విధము దెలియండీ - జనులార మీరు
నిజముగనుగొని మోదమందండి॥
భజనజేసే విధము దెలియక - నిజముగా హరిభక్తు లనకొని॥

మదగజము దెగ్రవేయలేకను - సుజనులని
తిరుగలగ నేలను॥

వారువీరని యెంచబోకండి జనులార మీరు
నోరువచ్చిన వారు గాకండి॥

వారువీరని యెంచుటెల్లను - సారము లేనట్టిహీనత
పౌరుషులకే గాక పుణ్యధారి కథలందేమి యున్నది॥

జ్ఞానులనుకొని యెగపి పడకండి - జనులార
తత్త్వజ్ఞానమందే మనసు నిలుపండీ॥

జ్ఞానులనుకొని యెగసిపడి - యజ్ఞానములు పైబెట్టి కొనినను॥

మానసంబున బుట్టిజచ్చియు౯ - బూని మరి
జన్మింపవలయును॥

ఝూటమూటా లాడబోకండి - నరులార కలియుగ
నాటకములోఁ జిక్కబోకండి॥

ఝూటమూటా లాడి పొట్టకూటికీ - వేషములు దాల్చుక॥

మాటికీ యమబాధలాచే - గాటికిం బోవంగ నేటికి॥

ఈ కీర్తనలోని నీతిని ప్రజలు గ్రహించి పాటిస్తే మనకిక ఈ రాజకీయ పార్టీలతో నిమిత్తమే వుండదు. కులమత ద్వేషములేయుండవు, భూలోకం స్వర్గతుల్యమగును. ఇట్లు పూర్వం హరిదాసులు పండితులు గురువులు లోకశాంతికై బోధనలు చేయుచుండెడివారు. ఇప్పుడు వారి ప్రచారము

తగ్గించి. రేడియోలు, సినిమాలు, పత్రికలు ప్రజానాయకుల ప్రచారమునెక్కు-వైనవి.



కామరాజు సింగరిదాసు

**కామరాజు సింగరిదాసు :-** జననం క్రీ. శ. 1840 వీరిది పండిత వంశము. ఈయన మనుమడు అనుభవానందస్వామిగా మారెను. ఆయనయే భక్త సింగరిదాసు చరిత్ర అనుపేర నొకగ్రంధమును వ్రాసెను. సింగరిదాసు తండ్రి కృష్ణయ్య మహాభక్తుడు; కొణిదెన అను గ్రామమున ఆంజనేయస్వామి గుడిగట్టించెను. సింగరిదాసు యొక్క పితామహుని సోదరుని కుమారుడు అబ్బయ్య అను భక్తుడు నెల్లూరులో నివాసముండినపుడు పురవీధులలో బిగ్గరగా భక్తిగీతములు పాడుచుండెడివాడట. అద్దంకి వద్దగల సింగరికొండలోని నరిసింహస్వామి వీరికి ఆరాధ్యదైవము, అందువలననే సింగరిదాసు అని నామకరణము జరిగెను. బాల్యమునుండియే భక్తుడాయెను. పది సంవత్సరముల వయస్సున ఆరేండ్ల కన్నియ రుక్మిణమ్మను పెండ్లాడెను.

ఆనాటి యాచారమట్టిది. శూద్రస్త్రీ భక్తురాలగు సీతాంబవద్ద దాసుగారు తారక మంత్రోపదేశము పొందిరి.

అద్దంకిచేరువలో వెంకటాపురము నివాసము. అటనుండి దాసుగారు కాలినడకన తంబూరాదులతో భజన చేసుకొనుచూ పదిహేను రోజులలో నెల్లూరుచేరి రంగనాధుని దర్శించి కీర్తించి తన్మయుడై తిరిగి ఇరువది రోజులలో వూరు చేరినాడు. తనభక్తి కార్యక్రమములకు భంగకరమని యెంచి ప్రభుత్వోద్యోగమును నిరాకరించినాడు. బంధువుల ఆహ్వానముపై చిత్తూరు జిల్లా పూతలపట్టు గ్రామములో పాఠశాల నెలకొలిపి ఉపాధ్యాయుడుగా ఒక సంవత్సరము జీవికము గడిపినాడు. మరల వెంకటాపురము చేరి ఒకప్పుడు 35 దినములు కాలినడకను తిరుపతియాత్ర గావించినాడు. రేపల్లెలో పొన్నూరులో నూజివీడులో బందరులో గూడా నివసించాడు. 1889లో భార్య స్వర్గస్తురాలాయెను. అనేక కీర్తనలు వ్రాసినాడు, రచనలు సాగించినాడు. ఈ క్రింది కీర్తన పొన్నూరు భావనారాయణ స్వామిమీద చెప్పిన కీర్తన.

యమునా కల్యాణి - ఆదితాళం

నారాయణ యనరాదా మనసా
నరకము దొలగునె యో మనసా॥

పొన్నూరిపుర భావదేవుని
పొంగుచుమదిలో నుంచవె మనసా॥

చెన్నువెలసిన సాంబశివుని నెద
సన్నుతించరాదట వే మనసా॥

కంజదళాక్షానుజుని లక్ష్మణుని
ఘనముగ బ్రోచిన ఘనుడే మనసా॥

పింగరిదాస హృదబ్జకర్ణికా
సంగతుడాయెను యో మనసా॥

పింగరిగిరి నివాసుడయిన
శ్రీనరహరి నమ్మవె యో మనసా॥

వృద్ధాప్యములో రామేశ్వర యాత్రచేసి 1916 జూన్‌లో సన్యసించి సమాధి బొందెను.

పింగరిదాసు కుమారులు మంచి యుద్యోగములలో నుండిరి. భజనలు చేయుట పురాణకాలక్షేపములు చేయుట ఈయన దినచర్య. ఈయన మంచి పండితుడు గూడా. ఈయన ఆర్వేలనియోగి బ్రాహ్మణుడు, ఆంధ్రలో ఉత్తరమున కోస్తా ప్రాంతమున నివసించువారు ఆర్వేల నియోగులనబడుదురు. నెల్లూరు చిత్తూరుజిల్లాల ప్రాంతవాసులను ప్రాంఙ్నాడు నియోగులందురు. ఉభయుల వృత్తిధర్మము లౌకవే. అయిననూ రాజు మంత్రి అమాత్యుడు, అనుపదములు నామధేయముల చివరగలిగి యుండుట ఆర్వేలవారి ఆచారముగా యున్నది పూర్వము. అందునుబట్టి వారలు పూర్వము రాజ్యపరిపాలనాధికారములు కలిగియున్నట్లు విదితమగుచున్నది.

రామదాసు చరిత్ర తూము నృసింహదాసు చరిత్రను వ్యాప్తిలోనికి దెచ్చిన భక్తుడీతడే అయివుండునని నమ్మవచ్చును. కానీ యీ విషయము పింగరిదాసు చరిత్రలో కనుపించదు. అయితే హరిభజన పింగరిదాసు, అను పేర, పెద్దదాసు అనునొక హరికథ రచింపబడి యున్నది. ఆ గ్రంధము పరిశీలనకులభ్యము కాలేదు. భక్త పింగరిదాసు ఆంధ్ర ప్రాంతము వాడు, వరదరామదాసు, తూము నృసింహదాసు చరిత్రను రచించిన నంబెరుమానూరు సూరి, దక్షిణాది వారుగానున్నారు. మరొక సింగరిదాసున్నట్లుదృష్టాంతములు దొరుకలేదు.

## రామాయణం వెంకట నరసింహ కవి :—

వీరు 1805-1870 సంవత్సరముల మధ్య కాలమున జీవించి యుండిరి. ప్రకాశం జిల్లా పెదకొత్తపల్లి నివాసము. తండ్రి పేరంరాజు, ఆర్వేల నియోగి బ్రాహ్మణులు. రచన గోపాలక్రిష్ణ విలాసము, గ్రంథము ద్రణ కావలి వాయునందన ముద్రణాలయమున జరిగినది. ఇది గేయప్రబంధము. భాగవతమునకు సంబధించినది. గ్రంథము పైన యక్షగానమని గాని హరికథ యనిగాని లిఖింపబడ లేదు. గేయప్రబంధమని గ్రంథ పీఠికలో తెలుప బడినది. కవిగారి పౌత్రీ పౌత్రుడు చదలవాడ వెంకట రమణదాసు 1964లో ఈ గ్రంథమును ముద్రింప జేసినాడు. అంత క్రితమిది వ్రాతప్రతి గనే యుండి యుండెను. కవిపండిత పంశస్తుడు, సంగీత సాహిత్యము లందు నిష్ణాతుడు. వీరి మునిమనుమడు రామాయణం సీతాపతి యనునాతడు 1930 ప్రాంతమున ప్రఖ్యాత హరిదాసుగ నుండెను. కవికి అభినవ పోతన యను బిరుదు గలదు. వేదాంత జోతిష వాస్తు ఆయుర్వేద వైద్యశాస్త్ర పారంగతుడు. గ్రంథము త్రయోదశ ప్రకరణములుగా విభజింప బడినది. ఇందు షోడశోపచార పూజ ఏకాంత సేవ ప్రభాత సేవ పెండ్లి ఎదురుకోలలు బువ్వము బంతిపాటలు నాగవల్లి పాటలు గలవు. అనుప్రాసాది శబ్దాలంకారములతో గూడిన పద్యరచన గలదు. శ్లోకరచన గూడ గలదు. సంస్కృత పదరచన యధికము. ప్రతి కీర్తన చరణముల యందు కొంత తెలుగు కొంత సంస్కృతము అంత్యమున భరతశాస్త్ర శబ్దముల ముక్తాయింపుతో రచన సాగినది. కవితాశైలి కాఠిన్యము, పామరులకగోచరము. గొప్ప విద్వాంసుడయి యుండియు కవిగారు పోతనవలె హాలికవృత్తితో జీవితము గడపినాడని వారిబంధువు కావలి హైస్కూలు తెలుగు పండితుడు శ్రీవదాల రామమూర్తిగారు గ్రంథమున పీఠికలో వ్రాసియున్నాడు. శ్రీకృష్ణజననము

బాలక్రీడలు గోవత్సపాలనము వేణుగానము కృష్ణగోపికాన్వేషణము రాధా మాధవ సంవాదము గోపికాగీతలు రాసక్రీడ మధురాప్రవేశము కంసవధ రుక్మిణీ కల్యాణము పూజావిధానము ఏకాంత సేవ పృథగ్విధ రుక్మిణీ కల్యాణము అను కథలుగ గ్రంధము విభజింపబడినది. కథ చాలా సంగ్రహముగా రచియింప బడినది. మచ్చునకొక పద్యరచన పరిశీలించుదము.

ఉ॥ రాసము పాపబంధకని। రాసము నాట్యకథా ప్రబంధనో
ల్లాసము బంధిచిత్రిత వి। లాసము మోహలతానుబంధ నా
భ్యాసము కుండలీకృత వి! భాసిత తాళ లయానుసంధ వి
న్యాసము ప్రస్తుతేక్షణ వ। కాగత నేత్ర లసద్వికాసమున్-

ఈ మాదిరి అంత్యానుప్రాసము లెక్కువై జిగికూర్చిన పద్యములనేకము లీ గ్రంధమున గలవు.

కీర్తన - కల్యాణి - ఆదితాళం

పల్లవి॥ శ్రీకల్యాణౌ భైష్మీకృష్ణౌ
సేవేహం సతతం॥

అనుపల్లవి॥ లోకోద్ధరణ చణార్ధమవన్యాం
శ్రీకల్యాణ గుణైరవ తరితౌ॥

చరణము॥ ఈకాముని జననీ జనకుల విదె
యాకామములెల్ల దీర గొల్తుము
తాకిట తకఝొ। ధిమికిట। ఝుకిట కిణఝొ
దిణకిట! తాకిద్ధ్కతక ధీకిద్ధతక ధిమితక!
ధణాఝణా! కిణధిమితక! దదిగిణ ॥శ్రీక॥

కన్నయ్యదాసుచే రచించబడినది కాశిదాసు హరికథ. కాలము తెలియదు పురాతన గ్రంథము. వీరి గురువు వీరభోగేంద్రుడు, బాషగ్రామ్యము అన్యదేశీయము. " అల్పద్రేహము, యాపై అయిదు దేశములు " ఇట్టి పదములు గలవు కవి అరవదేశ ప్రాంతము వాడైయుండనొావు. రచనలో ఆధ్యాత్మిక బోధ ఎక్కువ.

క్రీ. శ. (1900) అన్నమురాజు సుబ్బారావు గారు నూతన చంద్రహాస హరికథను రచించిరి. బుచ్చమాంబ, పిచ్చయ్య తల్లిదండ్రులు, ఆర్వేల నియోగులు. ప్రార్థనాదికములు లేవు, రగడలు మిక్కుటముగా రచించ బడినవి. ఈ గ్రంథము సకలేశ్వరున కంకిత మివ్వబడెను. దీనిని బుర్ర కథగా గూడ చెప్పెడినారట, చంద్రహాసుని వివాహ సందర్భమున బ్రాహ్మణులకు సంభావన లిచ్చుట ఈ రగడలో హాస్యముగా వర్ణింపబడెను.

రగడ

కాకినాడ శివ్వావధానులు - కాంతా సాంబయ్య
రేకపల్లి నరిసింగ శాస్త్రిలు - తొకల మంగయ్య
చింతల తిమ్మన సోమయాజులు - చీకుల కోటయ్య
గంతుల పోతన గంగన చింపన - గరుగల కోనయ్య

---

అడ్డులేక నీ బ్రాహ్మణు లందరు - అతి వేగంబునను
బుడ్డి చెంబు లంగోస్త్రములను చే - బుచ్చుక గుంపుగను.

క్రీ. శ. 1900 సం॥ కడూరి చెంగల్వరాజు నూతన చంద్రహాస యను హరికథను రచించెను.

1900 సం॥ [illegible] నారాయణ కవి గారిచే మోక్షగుండ రామాయణము హరికథ రచింపబడెను. ముద్రితమై ఆంధ్రమున ప్రఖ్యాతి గాంచి బహుళ ప్రచారములో నున్న సంపూర్ణ లక్షణములు గల హరికథ ఇదే అయివున్నది. అధ్యాత్మ రామాయణములోని కొరతలు తీర్చినది మోక్ష గుండ రామాయణమని రజనీ గారనిరి. వీరి తలిదండ్రులు జ్ఞానాంబ కృష్ణయ్య మంత్రి. మంత్రి యనగా అర్వేల నియోగి బ్రాహ్మణుడు. వీరు బ్రహ్మోత్తర ఖండమను మరియొక గ్రంధమునుగూడా రచించిరి. ఈ రామా యణమును మహాకవి జనమంచి శేషాద్రి శర్మగారు పరిచూచినట్లు గ్రంధ మున తెలియచున్నది. ఈ గ్రంధము విళంబి సం॥ర చైత్రమాసమున శ్రీరాముడు పుట్టిన మాసములోనే రామాయణ రచన ప్రారంభమగుట విశేషము.

క్రీ. శ. 1898 సంవత్సరములో ఈ గ్రంధము రచింపబడె యుండు నోపు. గ్రంధమునకు హరికథ యని నామ మేర్పరుప బడి కాండ విభజన జరిగినది. ప్రారంభమున రామస్తుతి గురుస్తుతి గణపతి, సరస్వతి స్తుత్యంత ములు కీర్తనలు పద్యముల ద్వారా జరిగెను. కవిగారి స్వగ్రామమగు మోక్ష గుండ రామునకే గ్రంధము అంకిత మీయ బడెను. కవి వంశావళి వివరింప బడినది. వీరికి స్వప్నమున రాముడు కారణాచార్యులగు వెంకట శివుని రూపంబున గానిపించి ఆజ్ఞ యిడి నందున రామాయణ రచన ప్రారంభ మయ్యెనట. కీర్తనల చివర మోక్షగుండ రామయను మకుటము గలదు. వాల్మీకి విశ్వామిత్ర రామాయణముల ననుసరించి ఈ గ్రంధము రచింప బడెను. మొదట ఈగ్రంధమును వేమూరి యజ్ఞనారాయణ, నరసింహ శర్మ లను వారలు పఠించి లోకమున ప్రచుర పరచిరి. ఇతర రామాయణ హరికథ లందు గానరాని విచిత్ర విషయము లిందు కొన్ని గలవు. అవి యేవనగా దశరధునికి ముగ్గురుగాక మరి 350 మంది భార్యలు గలరు. కపి వైన్యము

72 వేలుగాదు 72 వెల్లువలు, సీత పూర్వ జన్మ వృత్తాంతము గలదు. రాముడు మేనమామల కుమార్తెలను భూ, నీళ, విమల, జ్ఞాన, క్రియ యో గాది నామముల బరగు 129 మందిని పెండ్లాడెను. కలహో పాఖ్యానము అనగా గయ్యాళి భార్య చరిత్ర గలదు. సీతా స్వయంవరమునకు రాజులే గాక కొండలు, నదులు, నాగులు, యక్షులు, దేవతలు గూడా వచ్చిరట.

చ॥ నరులను ఖేచరుల్ సురలు। నాగులు యక్షులు సిద్ధ చారణుల్।
గరుడులు రావణా ద్యసుర। కాంతులు మౌనులు వార్ధులున్ గిరుల్।
దరువులు కామ రూపములు। దాల్చి మహో విభవంబుతో స్వయం
వరమును జూచు కోరికను। వచ్చిరి తన్నగరంబుఁ జేరగన్॥

కాకాసురుడు సీతకాలి వ్రేలును ముక్కుతో బొడిచెను. శూర్పణఖ కుమారుడగు జంబు కుమారుని తల లక్ష్మణుడు కత్తితో నరికెను. మైరావణ చరిత్ర గూడా గలదు. సీతను రావణు డంటలేదు.

క॥ జనకజ చుట్టును భూమిని
దన నఖములఁ ద్రవ్వి బాహు। తతిచేఁ గడున్
బల్మిని నెత్తి రథముపై నిడి
వినువీధిని బఱప నవుడు। వేగము తోడన్॥

తాళ ద్రుమములు బడగొట్టు నవుడు రాముడు, ఆదిశేషుడైన లక్ష్మణుని అంఘ్రితలము తనకాలితో నలుపుట, ఇట్టి విశేషములు ఈ గ్రంధమున గల ప్రత్యేక విషయవర్ణనలు, కవిత్వము సులభ గ్రాహ్యము. సరళము మృదు మధురము. ద్రాక్షాపాకము హాస్యరస భరితము వర్ణన కర్ణానందము, కీర్తి

నలు జాగాలు ముత్రలు గలిగి యున్నవి. అంత్యప్రాస యమకాది నియమములతో రంజకముగా నుండును. ప్రాచీన సంప్రదాయము ఆకాశవాణి భక్తి రంజనీ కార్యక్రమములో ఈ మోక్షగుండ రామాయణ కీర్తనలు ముఖ్యముగ సదాశివ శాస్త్రి భాగవతార్‌గారు పాడుచుండుట మనము వినుచునే యున్నాము. తోహరాలకు ఒకే పల్లవి గలదు.

తో హ రా :—

రామా రామా యనవే! శ్రీరామా యణ కథ వినవే।
రామా రఘుకుల రామా। సీతారామా రామా యనవే।
రామామణిరో రమ్యంబగు శ్రీరామాయణ కథ వినవే॥

రామామణిరో యనగా పార్వతిని శివుడు సంబోధించి రామాయణ గాథను చెప్పుచున్నాడు.

కీర్తనలవైన చదువరులకు పాడుకొను పద్ధతి తెలియ జేయుటకై "భజియింప వలె మనసా, వలె" అని అప్పట్లో ప్రచారములో నుండు కీర్తనల మాదిరులను గుర్తించ బడినవి. వచన రచనలో ప్రాసవిన్యాస మెక్కువ. ఇప్పటి భావకవిత్వములో గూడ ఈలక్షణ మెక్కువ. మత్త కోకిలలు ద్విపదలు షష్ట్యంతములు లావణులు మున్నగు పాతపద్ధతి రచన యెక్కువ. విషయ సూచిక విశదముగా నివ్వబడినది. విషయ సూచికను చూచినంతనే సంగ్రహముగా రామాయణ కథ గ్రాహ్యమగును. హాస్య రసము రచనలో మిక్కుటముగా నున్నది, మచ్చునకీ దిగువ వచనమును పరిశీలింపుడు. ఇది సుందర కాండలో జంబుమాలి హనుమంతుల సంవాదము.

జంబుమాలి :- వేదండ తుండ నిభంబగు నుద్దండ భుజా దండంబున బ్రహ్మాండంబున నుండిన కొండలయినఁ బిండిపిండిగఁ జేయఁజాలిన దండిమగండ నగు నాదండకు రాగ బుండరీకాక్షుండైన నోపఁడు, నీకండ లోక కంటకయినఁ జాలవే! మంచిదుండుడు ము ఖండనంబున నీగుండెలు ఖండించి దండధరుని యొండకుఁ బంపెద మొండీ యనిన విని, యాంజనేయుండు ఖండేందు మౌళి కోదండంబుఁ బిండిచేసిన కోదండపాణి భటుండ చండాంశ సుతుని సచివుండ నాంజనేయుండ ఖండన భీముండ గుండెగల శూరండవైన నిందు పేడ్కతో రారా రండా! ఇప్పుడే మోయింతు నీముండ చేనెడ మరల మాట్లాడకుండ :—

ఈ వచనములో భావమునకుఁ దగిన శబ్దరచన గూడ చేయబడినది. ఇందు సున్నతో గూడిన, డకారము, పలుమారు ఆవృత్తియై చెవికింపు దోచు చున్నది, కొన్ని కీర్తనలు తాళ జ్ఞానము లేని వారు పాడజాలరు. కానీ కవులెల్లరకు నన్నయ్య భారత మెట్లుపయోగపడినదో అట్లు హరికథా రచయితలకు మోక్షగుండ రామాయణ ముపయోగ పడినది.

బ్రహ్మోత్తర ఖండము :—

దీనికి హరికథయని నామకరణము చేయబడెను. నెల్లూరుజిలా కోవూరి డివిజన్ తర్లుపాడు నివాసులు వైశ్యకులజులు [illegible] రామ[illegible] ప్రేరణమున తాళ్లూరి నారాయణశాస్త్రి కవి పదపద్య గద్య మిశ్రము[illegible] చెను. మోక్షగుండ రామాయణము హరికథ తరువాత రచింపబడినది, ఈ కథ స్కాంద పురాణాంతర్గత మైనది పద్యరచన తక్కువ, సంభాషణ వచనములు గలవు. ఇట్టి సంభాషణలు బి. బాలాజి దాసుగారి రచనలో గలవు. కాని పరిమివారి ఆదిభట్ల వారి రచనలో లేవు, ఈకథ 14 భాగములుగ విభ

జింప బడినది. 1 శైవపురాణము 2 శివరాత్రి మహిమ 3 దీపకళికా ప్రదాన మహిమ 4 శనిదోష మహిమ 5 పక్షప్రదోష మహిమ 6 సోమవార వ్రత మహిమ 7 శివకవచ ప్రభావము 8 విభూతి మహాత్మ్యము 9 లింగారాధన మహిమ 10 ఉమామహేశ్వర వ్రతము 11 రుద్రాక్ష మహిమ 12 రుద్రాభిషేక మహిమ 13 పురాణ శ్రవణ ఫలము 14 గౌరి కల్యాణము.

ఈ క్రింది పద్యమును బట్టి హరికథలు యక్షగానములు ఒకే జాతికి చెందినవని మనము గ్రహింపవచ్చును.

సీ॥ శ్రీమీఱ నేరెళ్ల। రామయ్యగారి ప్రే
రణను తాళ్లూరి నా! రాయణ కవి
శాలివాహనశక। సంవత్సరంబులు
షట్కార వసుసోమ! సంఖ్యఁదనరఁ
గ్రోధిసంవత్సర। మాధవాశితపక్ష
వర దశమి శశివా। సర శతభిష
తారా మిధునమున। నారంభమొనరించి
కడగి బ్రహ్మోత్తర। ఖండ పద్య॥

గీ॥ కావ్యమును యక్షగానంబు। గారచించి
తర్లుపాట్బుర సీలకం। ధరున కొసఁగె
నవని నాచంద్రతారార్కు। మగుచు నీవు
రాణజంబుకడు నల! రారు గాత॥

పైపద్యమున చెప్పిన ప్రకారం శాలివాహనశకం 1826 అనగా క్రీ. శ. 1904 వ సంవత్సరమున ఈ గ్రంథము రచింపబడినట్లు విదితమగు చున్నది.

కీర్తనల చివర "తర్లుపాటీశుని" అను ముద్రగలదు. మోక్షగుండ రామాయణమున కున్నంత ప్రచారము ప్రశస్తి ఈ గ్రంధమునకు లేదు.

1902 సం॥ ప్రాంతమున మన్నేపల్లి వెంకటాచలం పంతులు గారు శ్రీరామచంద్ర లీలాతరంగిణి యను హరికథను రచించియుండిరి. గ్రంధము నెల్లూరు రామకృష్ణా ముద్రాక్షరశాలలో ముద్రించబడినది. నివా సము నెల్లూరు, తలిదండ్రులు వెంకమ్మ శీతారామయ్యగారలు, ఈ హరికథా గ్రంధ ప్రారంభమున కవిగారి జీవిత చరిత్ర తెలియజేయబడినది. వీరు కథ కులుగాదు కవులు మాత్రమే అయివున్నారు, ఉపాధ్యాయవృత్తిలో కొన్నా శ్లుండి కనిగిరిలో ప్లీడరు వృత్తిలో ప్రవేశించిరి. సంగీత సాహిత్యములందు కృషిచేసిరి, అరణ్యకాండ వ్రాయుచు 1905లో కవిగారు స్వర్గస్తులైనారు. రచన 1902లో ప్రారంభించబడినది, గ్రంధము బాల అయోధ్యకాండలు మాత్రమే రచింపబడినది. కవి జీవించి యుండినచో గ్రంధము షట్కాండ ములు పూర్తిచేసియుండెడివాడు, ఈరెండు కాండల గ్రంధమే పూర్తి రామా యణ గ్రంధమునకుండు పేజిలుగలిగి కథవిస్తారముగా రచింపబడినది. రచన ప్రాచీన యక్షగాన సంప్రదాయ పద్ధతిలో నున్నది. గ్రంధమునకు హరికథయని పేరు. ప్రారంభమున విఘ్న, శ్రీ, భూ, నీళ, శ్రీగురు, విష్వక్సేన, హయ గ్రీవ, అనంత, వైనతేయ, ద్వారపాలక, పంచాయుధ, తిరువాభరణ, బ్రహ్మ, సరస్వతి, శంకర, పార్వతి, పరమభాగవత, ఆంజనేయ, గురు పరంపర, సంస్కృతాంధ్ర కవి, కృతినాయక స్తుతి గీతములు, పద్యములు గేయములలో రచించి అటు పిమ్మట షష్ఠ్యంతములు రామాయణ మహాత్మ్యము వ్రాపి తదుపరి కథారచన ప్రారంభింపబడినది. షష్ఠ్యంతములనగా గ్రంధము ఎవరిపేరుతో అంకిత మిచ్చునది తెలియజేయుట, ప్రపంచమునకు ప్రకృతి పురుషుడు మూలకారకులు గాన కవిగారు దేవతలను భార్యా భర్తలతో సహా

పరిపూర్ణముగ ప్రార్థించినాడు. పూర్వపు హరిదాసులు హరికథా గ్రంధస్థ మైన రచన యంతయు తూ చా తప్పకుండా గానము చేయుచుండెడి వారు. ప్రార్థనకే గంటకుపైగా కాలము పట్టును, తరువాత కథారంభము. పూర్వపు హరిదాసులకైతే నేమి శ్రోతకైతే నేమి భక్తిపై అంత మక్కువ, ఓపిక ఎక్కువ. హరికథలు గూడ ఇంచుమించు వీధి నాటకముల వలె రాత్రి యంతయు జరుగుచుండెడివి. నేటి కాలపు పరిస్థితు లన్నియు విపరీతమే, దాసుగారు వేదిక నెక్కినప్పటి నుండి కథారంభము చేయమని శ్రోతలు ఒకటే గోల పెట్టుదురు.

ఈగ్రంథ రచనలో గల వృత్తములు మాలిని పద్మనాభ మేఘవిస్ఫూరిత, మానినీ, కవిరాజ విరాజితము పంచచామరము, క్రౌంచపద, సుగంధి, కల్పిత కల్పవల్లి, ఛుస్కార విలసిత ప్రహరణ కవిత, ఉత్సాహ, ధృవకోకిల భుజంగ ప్రయాత మందా క్రాంతస్రాధ్వి, మహాస్రగ్ధర, ఇంద్రజ అనునవి. ఇవి యన్నియు సూక్ష్మమగు తేడాలతో నుండును. కవి సామర్థ్య ప్రదర్శనకు మాత్రమే ప్రయోజనము. మరియు చూర్ణికలు, తంగమెట్టులు, కందార్ధములు, అమితొగ్రదండులు, కళికలు, ఉత్కళికలు, లయ విభాతులు, మధుర గతి రగడలు మంగళాష్టకములు తేవార మను పలు రకముల రచనా ప్రక్రియలు గలవు. పీల్‌రాగం జుల్వా తాళం (పాతపద్ధతి) గలవు. ఇవి ఈ గ్రంథమందలి ప్రత్యేకతలు, ఇన్ని వివిధ రచనలతో మరొక గ్రంము రచింపబడి యుండలేదు.

ఈ గ్రంథమున విశ్వామిత్ర చరిత్ర సంపూర్ణముగ వివరింప బడెను. ఇతర గ్రంథము లందిదిలేదు, అయోధ్యకాండ చివరన పోతన రచనను బోలు పద్యమొకటి విరచితమైనది.

క॥ పలికించె దీని నరహరి
పలికితి నే నమిత భక్తి! భవహర మగునీ
పలుకు రమేశుని దగుటను
పలు సౌఖ్యము విచ్చుదీని! బ్రజలు చదివినన్॥

1902లో వేలూరి కన్నయ్యదాసు రోహిదాసు కబీరుదాసుల సంవాద హరికథ రచించెను. రోహిదాసు మాలవాడు కృష్ణభక్తుడు, కబీరు, రామభక్తుడు. ఉభయులు తమ దేవుని పొగడుకొనుట, ఇతరుని దేవుని విమర్శించుట జరిగి చివరకు రామ క్రిష్ణ లిరువురు విష్ణ్వాంశ సంభూతులే యని గ్రహించి మత ద్వేషములు విడనాడుట ఇందలి రచన సారాంశము :-

(1905) పిలి రాఘవ దాసు మాధవదాసు చరిత్రను హరికథగా రచించెను. నివాసం నెల్లూరు, బలిజకులస్థుడు, తండ్రి నరిసింహయ్య పాల్కడ గోత్రం, 1875లో కవిజననం. రామాయణము సుందర కాండ వరకు రగడ, వచన, దరువు, పద్యములతో రచించెను. చిత్రసేన, దేవదాసు రామానుజ చరిత్ర బీబీనాంచారమ్మ వివాహం మరియు ననేక గ్రంధముల రచించితినని కవి మాధవదాసు గ్రంధమున తెల్పి యుండెను. తన జీవిత చరిత్ర గూడ గ్రంధములో వ్రాసి యున్నాడు. ఈకథ అన్యభాష లందుండినది గాని ఆంధ్రమున లేదట, తానే ప్రధమముగా రచించెనట. ఈ కథకు మూలము జైమిని రచించెనని తెలిపెను. చోళ దేశమున తిరెక్కూరుం గుడి యను గ్రామములో మాధవదాసు యను నొక వైశ్యుడు పరమ భాగవతొత్తము డుండెను. హరి ద్వారములో నొక గురువునొద్ద విద్య నభ్యసింపు చుండును. గురువు దేవతా విమానములో స్వర్గమేగుచూ పన్నిధిలోలేని శిష్యునకై తిరుమంత్రము నేలపై వ్రాసి పోవును ఒక ఈపెల

సాని ఆ తిరుమంత్రమును చెరిపి తాటి యాకుపై లిఖించి తన చెవులలో ధరించును. శ్రీహరి గొల్లవాని రూపమున వచ్చి మాధవదాసుకు విషయ మంతయు తెలుపును. మాధవదాసు ఆ మెలసానిని జేరి సేవ జేయుచుండును. ఒకనాడు ఉభయులు పాండవాగ్రజుడైన ధర్మజు నొద్దకు జేరుదురు, ఆ మెల సాని నాట్యమునకు మెచ్చి ధర్మరాజు రవలకమ్మల నివ్వగా అపుడా ఆ మెల సాని చెవుల తాటాకులు క్రింద పారవైచును. ఆతిరుమంత్రపు తాటాకులను మాధవదాసు గైకొని జపించుచూ కొంత కాలమునకు స్వర్గమున కేగును. ఇది ఇందలి వృత్తము.

**1905** మీసరగండ మునుస్వామి వీరి రచన సక్కుబాయి చరిత్రము. నివాసం పడవాలపేట గ్రామం, తిరుపతికి దగ్గరలో గలదు, విశ్వకర్మ కులస్థుడు, సానక గోత్రం. పడవాల అగ్రహార నివాసుడు వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రులను పండితునిచే బరిష్కరింప బడినది. శాలి వాహన శకము, విశ్వావసు నామ సంవత్సరం కార్తీక ౫ తేది (పంచమి) సోమవారం చెన్నపట్టణము వెంకటేశ్వర ముద్రాక్షరశాల యందు ముద్రించ బడినది. ముద్రింప జేసినవారు కైకాల గురవయ్య గారు మరియు జల్లడం చెంగల్వరాయ నాయుడుగారు. ఈ గ్రంథము పడవాలపేట యందలి శేషాద్రీ శ్వరున కంకితమివ్వబడినది. కీర్తనల చివర శేషాద్రీశ్వర అను మకుటము గలదు. ప్రతి కీర్తనకు ఆరేసి చరణములు గలవు. కథాప్రారంభమున షట్పాద పంచము వ్రాయబడినది.

ధో రా కు ప ల్ల వి :—

రంగా రంగా యనుడీ పొందు - రంగని దయ చేకొనుడీ॥

కవిగారికి బాల్యముననే కవితాశక్తి యబ్బినది, ఈతడు భజనమంది రములు గట్టించిన భక్తుడు. కలికాలచరిత్రము, రుద్రాక్షప్రభావ చరిత్రము,

సక్కుబాయి చరిత్రము, నిజలింగయ్య చరిత్రములు పద్యగద్యాది కీర్తనల రూపమున కవిగారిచే రచింపబడిన యితర హరికథలు. కృతిభర్తలు కృతి కర్తను ప్రార్థించి తమ నామధేయము చిరకాలముండుటకై సక్కుబాయి పుస్తకమును అచ్చువేయించితిమని గ్రంథమున వివరింపబడి యున్నది.

పూర్వపు భక్తి అట్టిది, ఈరోజులలో కృతికర్తలు కృతిభర్తలను ప్రార్థించిననే గాని గ్రంథములు అచ్చుగాలేవు. అందుచేతనే కవులకు పూర్వపుటౌన్నత్యము నేడు గానరాదు.

డోరాలకు రాగతాళములు నిర్ణయించబడినవి. అపురూప రాగమని ఒక కీర్తనకు నిర్ణయించబడినది. సాధారణముగా వాడుకలో లేని రాగమును అపురూపు రాగమందురు. ఈ దిగువ రచన సక్కుబాయి పండరికి పోవు నపుడు పాడునట్టిది.

తంగము - శ్రీరంజనిరాగం - ఏకతాళం

1 శ్రీకుంజరములారా - శివంగములార
ఝుల్లి మృగములార - టింకల గుములార,
సూకర వళులార - మీరు, సుందరాంగుని గానరె॥

2 వానరోత్తములార - పంచకంబులార
భల్లూకములార - బల్తురంగములార .
మానిత హంసలార - మీరు - మాధవుని గానరె॥

3 కాక ఘూకములార - స్తోకకములార
కోక పుంజములార - కోకిల తతులార
కేకీ లోకములార - మీరు - కృష్ణమూర్తిని గానరె॥

4 భరత పిట్టలార - పావురంబులార
పైడిగంటలార - పాలపక్షులార
వరచకోరములార - మీరు - వైకుంఠుని గానరె॥

5 భిసకంటికములార - పిగిలి పిట్టలార
బెళగువ్వగములార - బెండంగ గుములార
పనమించు పక్షులార - మీరు - పండరీశుని గానరె॥

6 కలవింకములార - కలికి పిట్టలార
జలకుక్కుటములార - జెలగు సాళ్వములార
చిలుకల గుంపులార - మీరు - శేషాద్రీశుని గానరె॥

పండితులకింపుగొల్పని పందులను, ఎలుగుబంట్లను కాకులను గుడ్లగూబలను, పాలపిట్టలను, పిగిలిపిట్టలను, కోళ్లను మొదలగు వానిని గూడా కవి ఈతంగములో చేర్చినాడు. హరికథ పామర పండిత రంజకము గావలెనన్న ప్రకృతిలో గల సృష్టినంతటిని కవి గైకొనవలెగదా! అందుచే ఉత్తమశ్రేణి జీవులను అధమశ్రేణి జీవులను సమానదృష్టితో జూచినాడీకవి, అసలు భక్తులకు ఈ భేదాలు గోచరించవు. సక్కుబాయి నిష్కల్మష భక్తురాలు, ఆమే భక్త్యావేదనతో ఆర్తితో ఆరాటనతో అమాయకతతో అయోమయావస్థలో పరవశతలో పండరినాథుని వెదకుచున్నది. ఆమె జీవరాసుల

నన్నింటిని, భగవంతుని చూచినారా? యనియడుగుచున్నది. అనగా ఆత్మ లన్నింటిని పరమాత్మను గాంచితిరా యని ప్రశ్నించినట్లున్నది. సక్కా ఆ సమయమున ప్రాపంచిక లౌకిక దృష్టిలో లేదు గనుక కవిగారి పై కీర్తన లోని వర్ణన సబబుగానే యున్నదని భావింపవచ్చు.

1906 క్రొవ్విడి శేష వెంకట కాశీపతి రచించిన హరికధ గజేంద్ర మోక్షము. వీరి కీర్తనలలో ముక్తాయింపుకై ప్రత్యేకించి వ్రాయ బడినవి. అంత్యాను ప్రాసముతో గూడిన పదములు.

కా ఫి రా గ ం - రూ ప క తా ళ ం

ప॥ రమా మనోహరా రక్షింపర నీవాడరా ॥ర॥

అ॥ సోమశేఖరాదులైన నీమహిమనే పొగడుదురట
లసదంగ భవభంగ జితసంగ ॥రా॥

1906 షేక్ నబీసా ఈ కవి గుంటూరుజిల్లా ముప్పాళ గ్రామ వాస్తవ్యుడు. కపోతీశ్వర చరిత్ర, ధ్రువోపాఖ్యానం హరికథల రచించినాడు. మహమ్మదీయుడయియుండి హరికథలను రచించుట యను అతని సర్వమత సామరస్యతను ప్రశంసింప దగియున్నది. రచన సాధారణము.

1909 ఆనైతాండాపురం భారతి గోపాలక్రిష్ణయ్య గారిచే నందనారు చరిత్ర హరికథ రచింప బడెను. లిపి తెలుగు, కథ అరవభాషలో గలదు. చెన్నపట్టణమున ముద్రితము.



శ్రీ మదజ్జాడాదిభట్ల నారాయణ దాసు

**(1910)** శ్రీ మదజ్జాడాదిభట్ల నారాయణ దాసు :— దాసుగారి నివాసము విజయనగర ప్రాంతమున అజ్జాడ యను గ్రామము. ఇంటిపేరు ఆదిభట్ల, అసలుపేరు సూర్యనారాయణ, జననము 31-8-1864 తేది. పరమపదించినది 2-1-1945 తేది. ఆదిభట్ల నారాయణ దాసు చరిత్రము M. V. R. కృష్ణ శర్మ గారు 1975లో వచనములో రచించి యున్నారు. అందు దాసుగారి రచనలు 49 అని తెలుప బడినది. ఆదిభట్ల నారాయణ దాస సారస్వత సమీక్ష నీరాజనము అను గ్రంథము S.V. జోగా రావు గారి సంపాదకత్వమున యిటీవల ప్రచురింప బడినది. దాసభారతి అను గ్రంథము ఆచార్య ఓరుగంటి నీలకంఠ శాస్త్రి గారి సంపాదకత్వమున

ప్రచురింప బడినది. ఈ గ్రంధమున దాసుగారి రచనలను గూర్చి యిట్లు వ్రాయబడెను. ప్రారంభ రచన ధృవచరిత్ర, ఇది 1883లో వారి 19వ ఏట రచింపబడినదట. అంబరీష చరిత్ర, 1884వ సంవత్సరమున, మార్కండేయ 1891లో ప్రహ్లాద, 1898లో హరిశ్చంద్ర 1898కి పూర్వమే రచింపబడెను. భీష్మచరిత్ర సావిత్రి చరిత్ర హరికథలుగా 1902లో రచింపబడినవి. (కానీ దాసుగారి కథలు 1910 నుండి ముద్రించుట ప్రారంభమైనవి).

యదార్ధ రామాయణం 1915లో రచింపబడి తన భార్యపేర అంకిత మివ్వబడినది. ఇంకా ఇతర రచన లనేకములు గలవు, హరి కథలలో ధృవ చరిత్ర గోవర్ధనోద్ధారము అనునవి అలబ్ధములు. గౌరప్ప పెండ్లి అచ్చతెను గున రచింపబడిన హరికథ. శ్రీహరి కథా మృతము అనుపేర శ్రీకృష్ణ జననం, పితృబంధ విమోచనము, ధర్మసంస్థాపనము అను మూడు హరికథ లుగా వ్రాసెను. శ్రీకృష్ణజననం హరికథను 1913లో కలకత్తాలో రవీంద్ర నాథఠాగూర్ గారియెదుట చెప్పి మెప్పుబడెసెనట. మొదట ఈకథ సంస్కృ తమున రచింపబడి తదుపరి 1930లో తెలుగులో ముద్రణ జరిగెను. దాసు గారు పోతనవంటి కవి, త్యాగయ్య జయదేవులవంటి భక్తుడు. లయబ్రహ్మ నన్నయ్య తిక్కన శ్రీనాథ తిమ్మనార్యులతో సమానుడని M V.R. కృష్ణ శర్మగారు వర్ణించిరి. దాసుగారి తలిదండ్రులు సరసమ్మ వెంకటచయనులు, F. A. వరకు విద్యాభ్యాసము. సంస్కృతాంధ్ర పారశీక ఉరుదూ అరబ్బీ మొదలగు అష్ట భాషలలో మంచి విద్యనార్జించిన మహానుభావుడు. కవి, గాయకుడు, నృత్యమందు నేర్పరి, రాజాస్థానములందు కథాగాన మొనర్చిన దిట్ట. విజయనగర రాజావారి ఆస్థాన విద్వాంసుడు విజయరామ గజపతి సం గీత కళాశాలకు ప్రధానాచార్యులు.

మామిడిపూడి వెంకటరంగయ్య గారి సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము మొదటి సంపుటమున ఆదిభట్ల నారాయణ దాసుగారిని గూర్చి యిట్లు వ్రాయబడినది. మద్రాసు వాస్తవ్యులు కుప్పుస్వామి నాయుడుగారు విజయ నగరమందు హరికథను చెప్పగా విని నారాయణదాసు గారికి హరికథలందు కుతూహల మేర్పడి విశాఖపట్టణ వాస్తవ్యులు ధూళిపాటి క్రిష్ణయ్యగారు రచించిన ధృవచరిత్రను నేర్చి భాగవత పద్యములు కొన్ని తన పద్యములు కొన్ని కలిపి ప్రథమ హరికథ తన సోదరుడగు శీతారామయ్యగారింట్లో చెప్పెను. వీరి అన్న పేరన్నగారు దాసుగారి కథలో వంతపాట పాడుచుండెడివారు, వాజపేయ యాజుల వెంకట సుబ్బయ్య, నేతి లక్ష్మిన్నారాయణ గారలు ముఖ్య శిష్యులు. తిరుపతి వెంకటకవులు దాసుగారిని గూర్చి ఒక పద్యము రచించిరి.

॥మ॥ అల నారాయణుఁడప్డు కృష్ణుఁడయి గే। యమ్మందు సంతోషముం
గొలిపెం గాని కవిత్వమందుఁ గొలుపన్। గొంతేనియు న్నేఁడుకో
డల లోపమ్మును దీర్చుకోఁదలచి కా। దా యిట్టి రూపమ్ముతో
నిల నారాయణ దాస నామమున। నిల్చెసారె నాఁజెల్లదే॥

రాంభట్ల జగన్నాథశాస్త్రి గారిట్లు ప్రశంసించిరి! —

శ్లో॥ అనన్య సాధారణ శక్తి యుక్త
స్స్వయంతు నారాయణ దాస ఏకః
అన్యేతు సాధారణ శక్తి యుక్తా।
సర్వేపి నారాయణ దాస దాసాః॥

అనగా దాసుగారి హరికథా శక్తి అనన్య సామాన్యమైనది. సాధారణ దాసులందరు దాసుగారికి భృత్యుల వంటివారే, దాసుగారు 5 ఏండ్ల ప్రాయముననే పోతన భాగవతమును చదివెడివాడట, వీరు రామాయణ హరికథా గ్రంధ పీఠికలోనే కథనంతయు విమర్శించి సోదాహరణముగా పరిశీలించి పాత్రల మంచిచెడ్డలు చర్చించి తమ పాండిత్య ప్రకర్షణను ప్రదర్శించి యున్నారు. సామాన్య జనులకు రామాయణ కథలో ననుమానము కలుగు చోట్ల కలుగ నీయక కధకు తానొక రూపమిచ్చి యదార్ధ రామాయణ మను పేర గ్రంధమును రచించిరి. ఇట్లు మరొక కవి హరికథను రచించిన వాడు లేడు. ఇంద్రుడు తనను అంటక పూర్వమే వట్టిరట్టు తనపై పుట్టునని యెంచి రాముఁడొచ్చి తనను తాకు వరకు తాను పాషాణముగా నుందునని అహల్య తనకు తానే రాయి యయ్యేను. ఇట్లు అనేక సందర్భములలో కథను సవరించి పామరుల మనోగ్రహణ శక్తి కనుకూలముగ రచించెను.

సీ॥ స్వార్ధపరులు రాజు। లక్కట తమ కార్య
సిద్ధికై యితరుల। జెఱచు చుందు;
రక్షపాదున కెట్టు। లైన గోపంబు దె
ప్పించి యాతం డొన। రించు తపము
పాడుచేయుట కిట్లు! పన్నితివా? వట్టి
రట్టు నాపై నీఁకఁ। బుట్టుఁ గనుక
న్యాయముగా ధర్మదే! వత వచ్చి నన్నంటు
వఱకుఁ బాషాణ రూ! పమున నుందు

గీ॥ ననుచుఁ దీన సతత్వ మహిమ। మున నహల్య
రాయి యౌటకు మిగుల న। బ్రంబు నంది
యేఁగుచుండిన యింద్రున। కెదురువచ్చి
గౌతముఁడు పల్కె నిట్టులఁ। గతమెఱింగి॥

రాజులు స్వార్థపరులని నారాయణ దాసుగారు వారి యనుభవమును లోకమునకు చాటిరి కాబోలు. వీరి హరికథా రచన లందు సీసపద్యములు మిక్కుటముగా వాడబడినవి. సీసములం దెక్కువ విషయమును దెలుప వచ్చును. మరియు వర్ణనలకు వీలుగా నుండును. దాసుగారి గద్యవర్ణనల లోని దృశ్యములు ప్రత్యక్షముగ గోచరించును, రచన ఉపమానోదాహరణ లతో గూడి యుండును. ఇట్టి రచన హరికథ కెంతయో ముఖ్యము.

ఆదిభట్ల వారి కవిత్వము పండిత పామర రంజకమైనది. రామాయణము కథ 6 భాగములుగా విభజింప బడినది, గానీ కాండములుగా విభజింప బడలేదు. నారాయణదాసు గారి రచనాశైలి జాతిపద్యములగు సీసము, ఆట వెలది, తేటగీత మొదలగు వానితో గూడి భావ ప్రధానముగా రసాత్మకమైన మాధుర్య గుణము గలిగి యుండును. భక్తి భావము మనోహరమైన యూహలు ఔచిత్య మగు లోకోక్తులు మనోజ్ఞమైన వచనములు గలిగి రచన మృదు మధురముగ నున్నది. హాస్య శృంగార రసములు చక్కగా పోషింప బడినవి. హాస్యము గల వచనము :— ఇందులో భయానకము మిశ్రితము.

కుంభకర్ణుని యుద్ధము :—

"కుంభ కర్ణుడు సింహ గర్జనలు సలుపుచు నౌడుగరచుచు గపులఁ గొందఱ గ్గాళ్ళేతుల నల్లులమాడ్కి నేల రాయుచుఁ గొందఱ న్వెనగలవలె నములుచుఁ గొందఱ న్వెన్నముద్దల కరణి మ్రింగుచుఁ గొందఱ న్తోమల లాగున దోలుచుఁ గొందఱ న్పొదుమట్లు దెగబీల్చుచుఁ జేఱకుతోట విఱచి తిను మదపు టేనుంగు తీరునం జెదలకుఁ దలపడిన యెల్గు బంటి విధమున——————

రామాయణమున శ్లోకరచన గలదు మైనంపాటి వారివలె ఇతర గ్రంధములందలి శ్లోకములను చేర్చలేదు. వీరి కీర్తనలు పాడుటకు సంగీత భరత శాస్త్రముల పరిచయముండ వలెను, లేనివారి కసాధ్యము. కీర్తనలు జాగాలు మిశ్రములు తాళ గతి మార్పులు రాగ మార్పులు మొదలగు విన్యాసములతో నుండును. సంగీత సాహిత్య సర్వ్కసులలో ఇతరులకన్న దాసు గారగ్రగణ్యులు. మంజరులకు గూడ భావమునకుఁ దగిన రాగములు నిర్ణయింప బడినవి, ఇతర గ్రంధములందిట్లు రాగనిర్ణయముగా గానరాదు, ఇది దాసుగారి రాగభావ సమ్మేళనమునకు నిదర్శనము. కథా గమనము సంభాషణ రీతిలో ఏకపాత్రాభినయమున కనుగుణ్యముగా నున్నది. త్యాగరాజు కృతుల వలె కొన్ని కీర్తనలు స్వరములతో సహా రచింప బడినవి, ఈ పరిశీలనకు దాసుగారి జానకీ శపథమను హరికథ నిదర్శనము. మచ్చుకొక కీర్తన.

కేదార గౌళ - మిశ్ర జాతి త్రిపుట

అయిదవ కాలాక్షరము తెన్మిదింటిపై ఎత్తుబడి. 2వ కాలము పల్లవి.

పల్లవి :- కమలాక్ష నీకై నేనిటు - కనిపెట్టు కొంటి ॥క॥

అనుపల్లవి :- అమల చరిత్ర నాదెంత - పుణ్యమో నినుగంటి ॥క॥

చరణం :- నిలువ నోప నొడలెల్ల చెఱలో - నేనతి దీనుడ
పెలవిమ్మా నీలో నిఁకఁగల - సెదఁ ద్వధధీనుడ ॥క॥

(3వ కాలము)

తోంగరిన - నిదపని - పరిమస - గరిహత - ద్ధిం -
ధరుణు - త - ధహితఝుం - పపమ - నిదపస - నిదపమ - గరిస.

(4వ కాలము)

తర్ఝుణత ద్ధిహి - తగ్గధి ఝుణుత - ద్ధిగి తగ్గ ద్ధిత
త్తద్ధిరుగుడుదా - డిరుగుడు.

హరికథలు కొన్ని చెప్పబడును. వీనిలో సంగీత ప్రాధాన్యము తక్కువ. మరికొన్ని హరికథలు గానము చేయబడును. వీనిలో సంగీత ప్రాధాన్యతెక్కువ. దాసుగారి రచనలు రెండవ కోవకు చెందినవి. భక్తి భావము చక్కగా ఒక్కముక్కలో బోధించునది పద్యము.

గీ॥ శాశ్వతైశ్వర్య వంతుడే। జగతి లోన
రామ పాదాంబుజ ధ్యాన। రతు డొకండె
ఘోర సంసార రోగ ని। వారక మగు
మందు శ్రీరామ చంద్ర నా। మ జపమొకటె॥

హనుమంతుడు రావణునికి నీతిదెల్పుటలో వ్రాయబడినది పైపద్యము. సీసపద్యముల చివర "భక్తమందార భవదూర పరమపురుష" యను మకుటము గలదు. శ్రీరామ జననము, సీతాకల్యాణము, శ్రీరామ పాదుకా పట్టాభిషేకము, శ్రీరామ సుగ్రీవ మైత్రి, హనుమత్సందేశము, సామ్రాజ్య సిద్ధి అను ఆరుభాగములుగ విభజింపబడినది. యదార్థ రామాయణము ఆరు కాండలకు ఆరు పేర్లు నిర్ణయించబడినవి. అచ్చతెనుగు పదములు దాసుగారి రచనలో ఎక్కువ, దాసుగారు వాడినట్టి అపురూప రాగములు మరొక కవి వాడి యుండలేదు. జానకీ శపథమను హరికథ యందలి రాగములివి, ధాతు వర్ధని, హైమవతి, నాయకి, అమృతవాహిని, కోసలము, ఆహిరి, దేశి,

దేశాక్షి, నవరోజు, మానవతి, చిత్రాంబరి తానరూపి, గాంగేయ భూషిణి, కాంతామణి, జ్యోతి స్వరూపిణి, దివ్యమణి, సేనాపతి, శ్యామలాంగి, హాట కాంబరి, యాగప్రియ వరుణప్రియ, విశ్వంభరి, పావని, సాంగము, శూలిని మారరంజని:—

రాగములకు అధిష్ఠాన దేవతలు గలరందురు గదా? దేవతలందరిని సేవించినట్లు భావించి రాగములలో వీరి కీర్తనల రచించిరి. ఈ రాగములు సాధారణ హరిదాసులు పాడ జాలరు, ఇతరుల కథలకంటె దాసుగారి హరి కథా రచనలలోని అరణ్య వర్ణనలు కడురమ్యముగా నున్నవి. ఇట్టి వర్ణన లలో దాసుగారి రచనకు ప్రత్యేకస్థానము గలదు. ఊదా:—

"దమ పిల్లలకు వేటమప్పుచు జెరలాట మాడు బెబ్బులులన్। బెబ్బు లులన్, రాచ ప్రాపున విఱ్ఱవీగు చు బెద్దల నిరసించు నల్పులవలె మెట్టకొనల గంతు లిడు చీసడించు కొండ మేకలన్. కొండ మేకలుండు గుట్టల। కెక్క జాలక వానింగని యూట లూరుచు నందరాని పొందున కాసించు క్షుద్ర జారులవలె నోరావులించు కొని చూచు నక్కలన్ నక్క నైచ్యంబులం గొంగ జపంబులన్ పిరిగల వారి పంచలం బట్టి వ్రేలాడు యాచకుని వలె మఱ్ఱి యూడల నూగులాడు మర్కటంబులన్— — — —

ఇట్టి వర్ణనలు వ్యంగ్య ధోరణిలో నీతి బోధించుట కుపయోగపడును. సభా వందన పద్యములు గూడ "తెల్ల వగవర్చి మందిచ్చు తల్లిమాడ్కి" అన్నట్లు నీతులు శ్రోతలకు గఱపు చుండును. వీరి రచనలో రాజస గుణము పొడ సూపును. ఉన్నవారికి గర్వముండుట సహజమేగదా! ఉదాహరణకు రుక్మిణీ కల్యాణ హరికథలోని ఈసభావందన పద్యరత్నమును పరికింపుడు.

సీ॥ పేద సాదుల నెల్లఁ బ్రియమున గాపాడు
సదమల కరుణార్ద్ర। హృదయులార
లంచమిచ్చకముల। నెంచక సతతంబు
సత్యవ్రతంబూను। నిత్యులార
తమవలె గూడ ని। తరుల నూహించెడు
సుజనులారా బహు। శుద్ధులారా
మత కులాచారముల్। మానక లోకోప
కారులై వెలగు ని! గర్వులార॥

గీ॥ దాతలారా ప్రహర్ష సం! ధాతలారా
యోగులారా సదా సము। ద్యోగులార
పిన్నలార తెలియు మంచి। పెద్దలార
రుక్మిణీ పరిణయము న్ని! రూఢి వినుడి॥

పూర్వము మతకులాచారములు పాటించుట ధర్మము. నేడధర్మము, రాసుగారి హరిశ్చంద్రోపాఖ్యానములో సత్యమను ప్రవృత్తి ఈకాలమున బడు బోధలను చక్కగా వర్ణింపబడిన దీపద్యము. చేకాను ప్రాసముతో అలంకరింప బడినది.

సీ॥ ధనముల నాశించి। తగని బేరము చెప్పు
వతకు నోటికి। వడకి వడకి
దీనుల కొంపలు। దీసెడు ప్లీడరు
ఖూటసాక్ష్యంబులఁ। గుంది కుంధి

మిగుల లంచము మేసి! నిగిడెడు నుద్యోగి
కులమున కన్నీరు! గార్చి గార్చి
సోమరి పోతులై! సోదెలు బల్కెడు
మత గురువుల చెంత! మాడి మాడి॥

గీ॥ యెట్టు లుంటివి చెప్పుమా! యెల్లవేద
సరసులంబొల్చు రాయంచ! సాధుమైత్రి
గడుపు మక్కాని సత్కులాం! గనల సొమ్మ
సువ్రతమ్ముల ముఖ్యమ్మ! సూనృతమ్మ॥

దాసుగారి హరికథలలో ఇట్టి నీతిబోధనలు కోకొల్లలు. వారికె కథను రచించిన ప్రయోజనమేమి? కథా కథనము చక్కగా వర్ణనలతో విమర్శనలతో సాగినవుడె రచన ప్రావీణ్యత గన్పించును. హరిశ్చంద్రుని విలువ చెవర నలవికానిదని ఈ మంజరిలో హరిశ్చంద్రుడు తిట్టబడుచు పొగడబడెను. విప్ర బాహుడు హరిశ్చంద్రుని నిందించుట —

మ ం జ రి

వట్టి గొట్టు తాకట్టు పోల్కి ని - ర్భాగ్యుడా నిన్ను గొంటి
నొట్టు బెట్టిన ట్లిచట బీనుంగు - నొక్కవైన గనకుంటి
కాశిలోన నీవెంత జెట్టవో - కాలుబెట్ట నివ్వలను
గాసువిలువ దూడ యైన జావదు - కప్పమెటు గట్టగలను॥

సావిత్రి చరిత్రలో యమలోక మిట్లు వర్ణింప బడెను:—

సీ॥ లాతి కొంపలు దీసి! లంచము ల్మేయు మూ
ర్ఖులను రంపంబుల! గోయుచుంద్రు
తగ దీర్ఘ దైవ నిం। దకుల నెల్లప్పుడు
మించినిప్పులఁ బొర! లించు చుంద్రు
లలి గురుద్రోహు లం। బలు శూలముల బొడి
పించి పాతరుల ద్రొ। కించు చుంద్రు
త్రుళ్లి లోభుల బట్టి। నోళ్ల మన్నుం గొట్టి
చెట్టులకు ద్రేవల। గట్టుచుంద్రు

గీ॥ పొరి బొరి పర కన్యా శుల్క! ములను దినెడు
కుత్సితుం డొక్క జీల్చి రా! ల్గొట్టు చుంద్రు
మరి కృతఘ్నుల బట్టి మా। నరకమందు
జెలగి సకల శిక్షలకు బా! ల్పేయు చుంద్రు॥

కథకుడు కథను "గోయు చుందురట బొర లించుదురట" అని చెప్పిన కథ పటుత్వముగా నుండదు. శ్రోతలకు కథయందు ఆసక్తి నన్న గిల్లును, ఆ విషయము నెఱింగిన దాసుగారు తాను యమలోకము చూచివచ్చి నట్లే చక్కగా వర్ణించిరి.

భక్తులు భగవంతుని స్మరించి నంత మాత్రముననే చాలదు. తోటి మానవులకు గూడ సహాయ పడుచుండ వలెనను సోషలిజము సహితము హరికథలో బోధింప బడుచున్నదని భీష్మ చరిత్ర లోని ఈ క్రింది పద్య ములో విదిత మగు చున్నది.

సీ॥ పసుల జన్నమున జం। పంగ నేల నాకలి
గొన్న భూతమ్ములు। కన్నమిడుదు
నొవ్వంగ వేద పా। రాయణములు యే
నందటి ప్రేమోల న। త్యము పలుకుదు
తీర్థ యాత్రల దప్పి। తిరుగు లాడఁగనేల
నార్తుల కెల్ల న। హాయపడుఁడు
సన్యాసి భిక్ష నెం। చఁగ నేల మన తోటి
సాటి వారలకునై। పాటు పడుఁడు

గీ॥ ఎందుకిక వేయుమాట లీ! యిలను సర్వ
జనుల కు పకారముగ నడు। వని మనుజుడు
జప తపంబులు నిష్ఫలు! సలుపు చెల్ల
బూడిదం బోయు పన్నీటి। పొల్కి గాదె॥

దాసుగారి యితర రచనలు గజేంద్ర మోక్షము, జానకీ శపధము, గౌరప్ప పెండ్లి మొదలగు హరికథలు మరియు భగవద్గీత యను వేల్పుమాట, పద్య శతకము, విష్ణుసహస్రనామ సంకీర్తనము, సూర్య నారాయణ శతకము ఇంకనూ అనేకములగు రచనలతో సహా 40 గ్రంధములు గలవు.

దాసుగారిని గూర్చి ములుకుట్ల పున్నయ్య శాస్త్రి భాగవతారు గారు తమ పూల బుట్ట యను ఖండకావ్యమున నిట్లు వర్ణించెను.

ఉ॥ హాయిని గూర్చు పాట హృద! యంబు రమింపగ జేయు నాట ఆ
ప్యాయిత మైన మాట ఘన! పండిత బృందము లెల్ల మెచ్చి వ
హ్వాయను సత్కవిత్వ ఫల! భాగ్యపు మూటగు అధిభట్ల నా
రాయణ దాసు సద్గురుని! రంజిలు భక్తి భజింతు నెమ్మదిన్॥

1912 ముక్కపెల్లి నరిసింహదాసు :— పార్వతీ పరిణ యము అను హరికథను శివకథ అను పేరుతో రచించెను. కాకినాడలో ముద్రణ జరిగినది.

1913 పెంట సూర్యనారాయణ దాసుగారు, రత్నమాలికా పరిణయమను హరికథను రచించెను. విశ్వబ్రాహ్మణుడు, తండ్రి అప్పయ్య, ఉపమన్యస గోత్రం, విశాఖపట్టణం జిల్లా విజయ నగరం తాలూకా మెరక ముడి కాపురము. ఇందలి కథ :- వారణాసి దగ్గర మేఘమంజరి పుష్ప రాజు, నర పాలకుడు, ఈయన కుమార్తె రత్న మాలిక, అనంతపుర రాజు వీర సేను డామెను పెండ్లాడును. త్రోవలో రాజును గుడ్లగూబ నెత్తుకొని పోయి ఒక కొలను చెంత విడుచును, భర్తను వెదుకు కొనుచు ఒంటరిగా వచ్చు చున్న రత్నమాలికను రత్నాల పోలిసెట్టి బలాత్కారము సేయును. బాల్యము నుండి రత్నమాలిక అధిరోహించు ఏనుగ అస్థలమునకు వచ్చుట తటస్థించి పోలిసెట్టిని చంపి రత్నమాలికకకు సాయపడును. మరల భార్యా భర్తలు కలుసు కొందురు, ఇది ఇందలి వృత్తాంతము. కీర్తనలకు స్వర ములు కల్పించ బడినవి. అందుచే కవి సంగీత విద్వాంసుడని తెలియు చున్నది. హరిశ్చంద్రోపాఖ్యానము అను హరికథను గూడ రచించినట్లు పీఠికలో తెలియ బరచ బడినది.

**1914** శ్రీ గుహమూర్తి దాసు శ్రీరామ నామామృత మను హరికథను రచించెను. నెల్లూరు జిల్లా కల్లూరు గ్రామం, తండ్రి వెంకట నారసింహయ్య ముచ్చర్ల గోత్రం. దరువులు ద్విపదలు ఎక్కువ. మూడు అధ్యాయములుగ కథ విభజింప బడెను. నామ సిద్ధాంతము రామ నామ మహిమ, అమనస్కరాజ యోగ శివ జీవైక్య సంధాన మను పరమార్థోప దేశము అను విషయము లీకథలో వర్ణింప బడినవి:-

**1914** గూడా క్రిష్ణగోప్త గారు ఏకాదశీ మహాత్మ్యము (రుక్మాంగద) అను హరికథ రచించెను. తెనాలి తాలూకా పెరవలి గ్రామం:-

**1920** బాబు, పి. యస్. నౌషర్వాన్జి వీరి రచనలు సీతా కల్యాణము, వైజయంతీ విలాసము (విప్రనారాయణ) శ్రీరామ జననము, కబీర్ మొదలైనవి. గ్రంథములు నౌషర్ వాన్జి కవి సన్సు వారిచే ప్రకటిత మైనవి. తలిదండ్రులు చందమాంబ, హసు, రచనాక్రమము పాత పద్ధతి. కబీరు గ్రంధమున నామ సిద్ధాంత మెక్కువగా గలదు. కేవలం ఆధ్యాత్మిక విషయము భక్తిప్రబోధము. ఇట్టి విషయమునే గుణానుభవ మను పేర సీతా కల్యాణ కథలో వ్రాసెను. ఆంధ్ర కవుల నందరిని రెండు సీస ములలో నౌషర్వాన్ కవి స్తుతించెను.

బెంగాలి హిందూస్థానీ గ్రంధముల నుండి విషయము సేకరించ బడినదని కవి గ్రంధమున తెలిపెను. కబీరులో పద్య రచన లేదు, సీతా కల్యాణ కథలో పద్యరచన గలదు. గేయరచన హిందూస్థానీ ఫక్కిలో నున్నది. హాస్య రస పోషకము. పెద్దలయెడ నీతి ధృవుని పతివ్రతా ధర్మములు ముముక్షువులకు భక్తి శ్లోకములు సుభాషితములు సామెతలు పిట్టకథలు ఇతర

గ్రంథముల నుండి అధికముగా సేకరింప బడినవి. హాస్యముతో గూడిన భక్తి నీతి గల ప్రబోద గేయమును తిలకింపుడు.

నా ద నా మ క్రి య - ఆ ది

నవ్వు చున్నాడు యముడు - నవ్వు చున్నాడు
నవ్వు చున్నాడయ్యా - యముడు ॥న॥
నారాయణ స్మరణ మరచి క్రొవ్వు బట్టి తిరిగే
కామ క్రోధ లోభ మోహ మతుల జూచి ॥న॥
స్నానము చలినీళ్ల జేసి పైనిండా విభూతి పూసి
మానవతుల వలచు మదన ధ్యాస సంపన్నుల జూచి ॥న॥
జపము సేయక నెపము బూని జపమాలా పూసలెన్నుచు
చపలాక్షుల వారగంట్ల చపలులై జూచే వారిని జూచి॥

నౌషర్ వాన్‌గారి కవిత్వమును గూర్చి A. E. B. M. కాలేజి గుంటూరు. తెలుగు పండితులు నేతి వెంకట సుబ్బరాయ శాస్త్రి గారు రెండు కందముల నిట్లు వ్రాసిరి.

క॥ కలిలో నుత్తమ భక్తులు
కలరేమొకొ కోటికొకరు। కల్గినయెడ వా
రలు పూర్వుల గ్రంథములన్
కలిమిం దరించెదరు వారి। కై మనకేలన్

క॥ ఈ కలి మనుజు లనేకులు
ప్రాకృతులే గాన వారు। ప్రాకృత భక్తిం
జేకొన సు భ గ్రంధము
లే కావింపంగ నగు న। దే మనగలిలోన్॥

పై పద్యముల సారాంశమును బట్టి చూడ పండితుల మని భ్రమించే మనకోటి వారందరము పామరులమే యని తోచుచున్నది. 64 విద్యలలో ఆరితేరిన విశారదుఁడు లోక మందరుదు గదా! ఒక విద్యలోని విద్వాంసుడు మరొక విద్యయందు పామరుడె, గాన విజ్ఞులెల్లరు హరికథా కార్యక్రమములలో పాల్గొనుచు పండితుల నాదరించుచూ నానాటికి దిగజారుచున్న హిందూ సంస్కృతిని హరికథా గాన కళను ఉన్నతస్థితికి పునరుద్ధరించుటకు తోడ్పడవలసిన యవసరము నేడెంతైననూ గలదని గ్రహింతురు గాక.

నౌషర్వాన్ గారి గేయములు కొన్ని కన్నడ దేశపద్ధతిలో నడచినవి. భక్తుల పేర్లుఁ దెల్పుచూ ఒక అందమైన రగడ రచింప బడెను. కీర్తన చివర కవి పేరు ముద్రగా చేర్చబడినది. కథ విసుగు జనింపకుండుటకై కన్నడ హింది తెలుగు గేయములలో ఇంగ్లీషు ముక్కలతో నవ్వు పుట్టించు నట్లు చిత్ర విచిత్రములుగా రచన సాగినది. శృంగార రసముతో కీర్తనలు రచించుచూ అందు వైరాగ్య బోధన గావింపబడినది. ఈ కవిగారి కీర్తన లందలి భావములు వ్యంగ్యార్థములతో హాస్యపూరితముగా నుండును.

కీర్తన హిం - కాఫి - ఆది

మాయకు లోబడకా। కడకన్యాయముగా
జెడకా। ఓ కొడకా ॥మాయ॥

సాయంతనమే స్నానము జేసి - చందనాది వాసనలను బూసి
బాయక ముత్యపు పేరులెద వేసి -
బయటనుండి తలపించెడు దాసి ॥మాయ॥

తెల్లని పెంట్రుకల్ లగపడంగా - తిర్చి కన్నులకు కాటుక నింప
అల్లన దిద్ది తలవాకిట గుండా - యుంది చూచెడి
లంజముండ ॥మాయ॥

కవిగారు నామ సిద్ధాంతమున ఇంగ్లీషు కొటేషన్లు గూడ యిచ్చి యున్నారు.

To have more than enough is need less and burden some. Too much rain does not nowrish but causes the fruits of the earth to tot and decay.

**1920** నందివాడ జగన్నాథ కవిగారి రచన సీతాకల్యాణ హ రి క థ. తండ్రి సుబ్బరాయామాత్యుడు, భారద్వాజ గోత్రుడు, ఆపస్థంబ సూత్రుడు. ఈ కవి భాగవతారుగాదు, ఈకథను ఏలూరు తాలూకా గుండుగొలను వాస్తవ్యులు సంగీత సాహిత్య నిపుణులు భోగరాజు వెంకట్రామయ్యదాసు గారు అనేక చోట్ల హరికథచేసి మెప్పుబడసి నందున వారిప్రేరణచే ఈ గ్రంథమును అచ్చు వేయించితినని గ్రంథమున వ్రాసియున్నాడు. వీరి యితర రచన కృష్ణరాయబారము, ఈ సీతాకల్యాణ కథలో గల కీర్తనాదుల సంఖ్య మొదటి పేజిలో తెల్పబడియున్నవి. పద్యములు 67 మంజరులు 66 వచనములు 35 కృతులు 41 గద్య 1. కీర్తన చివరన తనపేరును మకుటముగా జేర్చుకున్నాడు, భాస్కర రామాయణము ననుసరించినాడు

గ్రంథము రామునికి అంకితము గావింప బడినది. కీర్తనలు చక్కగా అధు నికముగా నున్నవి. ఈ కవి మంచి విమర్శకుడు, అయోధ్యాపట్టణమును వర్ణించుచూ ఒక 24 పాదములుగల సీసమాలికను వ్రాసెను. దానిని చదివిన కవిగారి లౌకికజ్ఞానము మనకు బోధపడును. ఆ పద్యములో చక్కని నీతి బోధగలదు.

సీ॥ నిజ కులాచారంబుఁ! నెరపక నీచసే
వాన్వితులగు విప్రు! లచట లేరు
దేవ భూదేవ భ! క్తిని విసర్జించి గ
ర్వాంధులౌ క్షత్రియు। లచటఁలేరు
సరుకులమ్మెడుపట్ల। సత్యమెన్నక ధనం
బార్జించు కోమటు। లచటఁలేరు
తమ పై కులముల పె। ద్దల సేవసేయక
హంకృతిఁగను శూద్రు। లచటఁ లేరు
హరికథా శ్రవణంబుఁ! జరుపక నితరవా
క్యములు పల్కెడువార! లచటఁలేరు
సోమరిపోతులై। సూర్యోదయా స్తమ
యముల నిద్రించువా। రచటఁలేరు
కులకాంతల త్యజించి। కూరిమి నొరులతో
య్యాలుం బొందెడు వార। లచటఁలేరు
పరున వావులోకింత। నరయకఁ సంభోగ
మాచరించెడు వార! లచటఁలేరు
కడుఁదరిద్రుల కొక్క। గవ్వైన నివ్వక
సంతయుఁ దినువార। లచటఁలేరు

పంచ పర్వము లందుఁ స్వంత కాంతలనైన
నంటఁబోయెడు వార। లచటఁలేరు
కామ మోహాంధులై। కనులుగానకఁ విధ
వాంగనఁ గూడు వా। రచట లేరు
మేనల్లుఁడు దరిద్రుఁ। డైనఁ గూతులనివ్వ
కన్యులకిచ్చు వా। రచటఁలేరు
పేదల గెంటించి। భీతిచే ధనులఁ మ
ర్యాదఁ జేసెడు వార। లచటఁలేరు
తీఱికైనపుడైనఁ। దేవునెంచక పేక
లాడుచుండెడు వార। లచట లేరు
సత్రనిర్మాణంబు। సలుపక దెచ్చు సొ
మ్మ పహరించెడు వార। లచటలేరు
కాలైన గడుగక। మైలగుడ్డల తోడ
నన్నంబుడిను వార। లచటలేరు
నిష్ఠ తామెనయక। నైష్ఠికులం జూచి
యపహాపించెడు వార। లచటలేరు
శాస్త్రము ల్వేదము। ల్పత్యంబు కావని
యపనింద సేయువా! రచటలేరు
తద్దినంబులు పెట్టు। తఱి నన్యభాషలో
వచనము ల్వాల్కువా! రచటలేరు
ఉత్తరీయము మాని! నెత్తిమీదను గుండ్ర
మగుటోపిఁబెట్టు వా! రచటలేరు

గీ॥ సకల సౌఖ్యకరమ్ము శ్రీ! సఖియకిమ్ము
భూపురంధ్రికి మాణిక్య। నూపురమ్ము
కలిత సజ్జనపరులకు! గాపురమ్ము
నందమున గోపురమ్మ! యోధ్య పురమ్ము॥

ఈ పద్యమందు విమర్శించ బడిన పనులన్నియు ఈ కాలమందు మిక్కిలి గౌరమును పొందుచున్నవి. అందువలననే దేశకాల మానముల ననుసరించి ధర్మములు మారుచుండునని మనము గుర్తెరుంగవలయును. పాలకులను బట్టి పద్ధతులు మారుచుండుట సహజము. పతిభక్తి లేని స్త్రీల పునర్జన్మలెట్లుండునో ఈ క్రింది పద్యమున వివరింపబడినవి. సీతను వివాహానంతరం అత్తగారింటి కంపునపుడు తండ్రియగు జనకమహారాజు చెప్పిన నీతులు యివి. ఈనీతులు ఈరోజులలో కూతుండ్రకు తండ్రులు చెప్పినట్లయితే వెంటనే ఆ కొమరితలు తండ్రులను shut-up అని నోరుమూయిస్తారని యనుకుంటాను.

సీ॥ మగఁడు భక్షింపగా। మిగిలిన యన్నంబు
నారగించనిది దు। ర్నైన్ని జనించు
మగఁడూరలేనిచోఁ। నగలు ధరించి సో
కైయుండు చెలి పంది! యై జనించుఁ
మగని శృంగారక। ట్టగొని యూడించి పొ
మ్మనితిట్టునది గాడి। దై జనించు
మగనికన్నను ముందు। తెగదిని తాంబూల
మాచరించునది కు! క్కై జనించు

గీ॥ మగనికింజావనిచ్చి తా । మంచమెక్కి
మగువ యొకకొండచిలువయ్యె మహిఁ జనించు
మగని నెంతైన నంపి తాఁ । మారుమగనిఁ
దగులుకున్నది కొత్తియై । ధరఁ జనించు॥

భర్తకు భార్య బానిసకాదు, తోటి స్నేహితురాలు. భార్య భర్త హక్కులు సమానము, మగవాడికొక ధర్మము ఆడదానికింకొక ధర్మమా? యని ప్రశ్నించు ఈరోజులలో హరికథలో హరిదాసు ఈ పద్యము చదివినచో ఆయనకు పళ్లెమందు కానుకలు బడుటకు బదులు ఊళ్లోనుంచి వెళ్లగొట్టబడుట తథ్యము.

1921 పెలగల సుబ్బారెడ్డి గారు పీరు ధ్రువచరిత్ర ప్రహ్లాద యను హరికథలను వ్రాసిరి. నివాసము కృష్ణాజిల్లా మార్టేరు పంచకం. తల్లి గంగమ్మ తండ్రి రాజయ్య, బాబు పి. యస్. నౌషరవాన్ గారి సహాయమున తాను కథలు రచించెనట. కథారచనను గూర్చి పీఠికలో నిట్లున్నది. స్త్రీ పురుష బాలవయోవృద్ధుల కుపయోగమగు నటుల కాలప్రశంస వివేక మహిమ మూర్ఖపద్ధతి కపటగురువుల మాయోపాయము గురుశిష్యుల నడవడిక భగవంతుని మహిమ సద్గురు లక్షణము సంసార ఛిద్రము కర్మపద్ధతి బ్రహ్మ జ్ఞానము మూఢభక్తి మహిమ, స్త్రీ మోహము కలిమి లేముల స్థితి వెలయాలి మోసము మొదలగు విషయములు నీతి భక్తి జ్ఞాన వైరాగ్య విషయములు వెల్లి విరియునట్లుగా ఈకథలో పొందు పరచ బడినవని పీఠికలో కవి తెలిపి యుండెను. గ్రంథము శ్రీహరి కంకితము. నౌషర్వాన్‌జి పద్ధతినే అనుస రించెను. వీరి రచన యగు నొక చక్కని పద్యమును పరిశీలింపుడు.

సీ॥ అజునిచే నిర్మించు! నన్ని జీవుల యందు
మానవు జన్మంబు। మంచి దనిరి
అందు పూరుష జన్మ! మతి దుర్లభం బండ్రు
పురుషుడై బుట్టి ఈ। పుడమి లోన
వనితల వలజిక్కి। వాంఛతో దిరుగుచు
దాసుల బొడగాంచి! దండమిడక
ధన మదోన్మత్తులై। దనుజుల రీతిగా
దైవమా యనినోట! దలచకెపుడు

గీ॥ జీవహింసలు మిగులను। జేయుచుండ
కాల కింకరు లరుదెంచి। కఠినము గను
దండనలు జేయుచుండంగ! దాశరధిని
తలవ లేమైతిమని మదిన్। తలకు జెంది
చింత జేసిన ఫలమేమి। సిగ్గులేక॥

ఇట్టి భావము గల పద్యములు హరికథలకు చాలా ప్రాముఖ్యము.

1921 అన్నదేవర నాగభూషరాయ విరచితము ప్రహ్లాద చరిత్ర. ద్రాక్షారామము కవి నివాసము.

1921 చదువుల బసవశంకర కవి భక్తశిరియాళయను హరికథను రచించెను. నివాసము పెద్దాపురము.

1921 చెరుకువాడ వెంకట రామయ్య దామోజి పురపు వెంకట నరిసింహ రావు అను ఇరువురు కవులు తిలక్, అను హరికథను

రచించిరి. వీరిలో దామోజి పురపు వెంకట నరిసింహారావు గారిది తాడేపల్లి గూడెము. ప్రారంభమున భాగవత పద్యము. తదుపరి భరతమాత ప్రార్థన కీర్తన, అటు పిమ్మట సభావందన పద్యము కథా ప్రారంభము. శ్రీరాముని గుణములగు స్వార్థ త్యాగము దుష్ట శిక్షణ శిష్ట రక్షణ ధర్మసంస్థాపన ఆర్త త్రాణ పరాయణత తిలకు మహారాజులో గూడ గలవు. గాన తిలకు చరిత్ర గూడ హరికథ యగునని కవులు గ్రంధమున తెలిపి యుండిరి.

1923 తోట వెంకటాచలదాసు శ్రీరామ జననం హరికథను వ్రాసెను. తెనాలిలో ముద్రణ జరిగినది. వాల్మీకి రామాయణ శ్లోకములు రామ కర్ణామృత మందలి శ్లోకములు చేర్చబడినవి తల్లిదండ్రులు జానకమ్మ పానకాలు, గురువు యలహరి శేషాచలం, అంకితము రామునకు.

1923 గుద్దంటి గోకర్ణము ప్రకాశం జిల్లా పేరాల నివాసం, రచన భావనా ముని చరిత్రము.

1924 అయ్యగారి వీరభద్రరావు భాగవతారు, రాజమండ్రి ప్రాంతము మినుమంచిలిపాటి అగ్రహారం. ఆర్వేల నియోగి, కౌండిన్యస గోత్రము తలిదండ్రులు బాపమ్మ వీరయ్య. వీరి రచనలు మయూరధ్వజ, నందనారు, రామదాసు, కృష్ణ తులాభారము, కుశలవ, శివలీల, రామాయణము. గ్రంథములు సంస్కృతాంధ్ర బుక్ డిపో వారిచే రాజమండ్రి రాజేశ్వరి ప్రెస్‌లో ముద్రితములైనవి. సాహిత్య విద్వాన్ పట్టభద్రులు మహాకవి దైవజ్ఞ భూషణ బిరుదాంకితులు, మయూరధ్వజ కథలో నాటకములో వలె పాత్రల పేర్లివ్వబడెను. (మయూరధ్వజుడు - మణిపురాధిపతి కథానాయకుడు) (తామ్రధ్వజుడు - మయూరుని కుమారుడు) ధర్మ, భీమ,

అర్జున, కృష్ణ (వృషకేతుడు కర్ణుని పుత్రుడు) (మేఘవర్ణుడు - ఘటోత్క-చుని కుమారుడు) ఇది జైమినీ భారత మందలి కథ. రచనాశైలి సులభము మృదు మధురము. పాత్రౌచిత్య భాషకు ప్రాధాన్యత లేదు, భాషౌన్నత్యము నకు ప్రాముఖ్య మివ్వబడినది. హేతు వాదనతో ఆస్తిక మతమును ప్రచార మొనర్చుటకు తగినదీ క్రింది పద్యము ఇది నందవారు గ్రంథములోనిది.

సీ॥ జగము నిసర్గంబు। సత్యంబు పరమేశుఁ
డొకఁడు లేఁడనుట నా' స్తిక మతంబు
పదునాల్గు జగములఁ! బాలింపగా దక్షుఁ
డొకఁడుండె ననుట యా। స్తిక మతంబు
నాస్తికుఁ డనినట్లు। భూస్థలి నొకఁడైన
దేవునిఁగని వచ్చి। తెల్పినాడె
యని మించి పరమేశుఁ డనువాడు లేఁడని
తలఁపు గలిగి యుంట। తగవుగాదు

గీ॥ చిత్రకారుఁడు లేకుండఁ! జిత్రమున్నె?
శిల్పి లేకయే భవనంబు। చెలగుచున్నె?
అగ్ని లేకుండఁగా ధూమ మడరుచున్నె?
అట్లె జగమున కాధారుఁ! డడర కున్నె?

ఏ విషయమున కైననూ 'లేదు కాదు' అనియనుట సులభము. "ఉన్నది అవును" అని ఋజువు చేయుట కష్టము. ఈ సూత్రము ననుస రించియే న్యాయస్థానములందు ప్లీడర్లు వాది, వాదన అబద్ధము అని ప్రధమ మున చెప్పుదురు. ఏ గ్రంధమునూ పరిశీలించకయే నాస్తికుడు సులభముగా దేవుడులేడు అనేస్తూంటాడు. అట్టివారికి కవిగారు చక్కగా ఉపమానములతో

నయబోధచేసినారు. భాగవతార్ గారి గేయరచన మక్కికిమక్కి పక్కికి పక్కిగ పూసగ్రుచ్చినట్లు త్వరగా బుర్రకెక్కుటకు వీలుగా రచించిరి.

**1924** పుతుంబాక శ్రీకృష్ణయ్య గారు వీరి స్వగ్రామం గుంటూరు జిల్లా పెదపాలెం, వీరు కథకులుగాదు. కవులు మాత్రమే అయి యున్నారు. వీరి రచన పరీక్షిద్విలాసమను హరికథ. కవిగారి ఆధ్యాత్మిక గురువుగారైన పురుషోత్తముగారికి అంకితమివ్వబడిన దీగ్రంథము. బెజవాద శారదా భాండార ముద్రాక్షరశాల యందీపుస్తకము ముద్రించబడినది. సంగీత సాహిత్యములు లేనివాడనని కవి గ్రంథమున తెల్పియున్నాడు. కానీ గ్రంథ రచనను పరిశీలించినచో కవి మంచి పండితుడేయని నమ్మకము గల్గును. ఈ కథ పోతన భాగవతము ననుసరించి రచింపబడినది. రచన పాఠకున కాలో చన కల్పించును. పేరు చెప్పకయే కృష్ణుడు చేసిన పనులను వర్ణించి భగ వంతుని ప్రార్థిస్తాడు. ఆ భగవంతుని పాఠకుడు వూహించుకోవలె.

సీ॥ నిరుపేదయై యున్న। నరుజూచి ద్రౌపది
చేపట్టుచెవని యా। శిస్సు వలన
కురురాజు ద్రౌపది! కోకల నీడ్పింప
చెదరలేదెవని యా! శిస్సు వలన
వనముల దిరుగాడు। పాండవుల్ గ్రమ్మర
క్షితినేలుచెవని యా। శిస్సు వలన
ఉత్తర గర్భాన। నున్నట్టి బాలుడు
చెడకుండుచెవని యా। శిస్సువలన

గీ॥ ఆదినుండియు పాండవు। లన్నివిధుల
జేటుగనకుండు చెవని యా। శిస్సు వలన

నట్టి దిట్టను గట్టిగా! బట్టిమదిని
శిరమువంచెద వానియా! శీస్సుకొరకు॥

అసలు కోరిక చివర పాదములోనే యున్నది. మిగత పద్యమంతయు భగవంతుని పలురీతుల పొగడుయే, మానవుడు ఎక్కువ పొగడ్తలందు కొలది కరుణ స్వభావుడగునుగదా! అట్లే భగవంతుని దయనుబొంద భక్తుడు ప్రయత్నించును. ఈ సూత్రము ననుసరించియే హిందూ మతములో పలు విధముల భగవదారాధన పూజలు అష్టోత్తరములనియు, సహస్రనామావళు లనియు, శతసహస్రనామావళి, లక్షబిల్వార్చన, లక్షతులసి పూజ, సహస్ర గటాభిషేకములనియు గలవు

ఈ క్రింది సీసపద్యములో కృష్ణునివనుల లోని మంచి భావమును చెడుభావమును విడమరచి చెప్పి తుదకు కృష్ణుడు మంచి వాడని నిరూపిం చుట కవిగారి చాకచక్యము. కృష్ణుని పనులు విమర్శించువారికి సమాధానము పద్యమున గలదు.

సీ॥ దుష్టరాజుల నెల్ల! దునుమాడెనే కాని
కోపమాత్మను లేని। కోవిదుండు
మనుజ రూపముచేత। మసలినాడే కాని
దివ్యమంగళమూర్తి! దేవభర్త
గోపికా కుచగుంభ! నాపహారియె కాని
రతిసీతి నెరుగని! బ్రహ్మచారి
నా బంధువితడని! నటియించెనే కాని
బంధువిహీనుడౌ! పరమయోగి

గీ॥ సకలకామ్యంబు లాతడు! చక్కబెట్టె
గాని యిసుమంతయేనియు! కామిగాడు
బాహ్యదృష్టిని వానిత! త్వంబు గనిన
జార చోరత్వ మయమగు! సరణిదోచు॥

హిందూమతంమీద అభిమానములేనివారు కృష్ణుడు జారుడు చోరుడు పిరికిపంద, పక్షపాతి. అబద్ధాలకోరు మోసగాడు అని ఏమేమో విమర్శలు భక్తులకు తెలియజెప్పి భక్తులనుగూడ నాస్తికులుగా మార్చప్రయత్ని స్తుంటారు. ఈ కువిమర్శలన్నియు భక్తులకు తెలిపియే యదార్ధతను గమ నించి భక్తితత్పరులగుచుందురని ఈ పద్యరచన తెల్పుచు. ఇట్టి పద్యరచన వలన హరిదాసు ఎన్నియో ఉపమానోదాహరణములు పోల్చి వివరించి కథా కాలక్షేపమును నిక్షేపముగా చేసుకొనవచ్చును. ఈ కవిగారి కవితాశైలి బహు రమ్యమైనది, భక్తిజల్లులు వెదజల్లునది భాష సులభముగాయున్నను భావ గంభీరము గలిగి ప్రౌఢముగా యుండును. కథ చదువమొదలిడిన విసుగు జనించక పూర్తిగా చదువ కుతూహలము గల్గును. అట్టి కవితయే కవిత. కీర్తనలు సర్వసామాన్యము సర్వులు గానము చేయుటకు సులభ సాధ్యము.

1925 పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి గారిచే పరిష్కరింపబడిన మద్రాసు R. వెంకటేశ్వర అండు కంపెనీ వారిచే ముద్రించ బడిన రామదాస చరిత్రము. ఇందు కంపెనీవారు ముద్రించిన విమర్శయను శీర్షికలో హరికథా వాఙ్మయ పుట్టుపూర్వోత్తరములు వివరింపబడినది.

1927 బి. బాలాజీ దాసు పేరిది విశాఖపట్టణం జిల్లా అనకా పల్లి నివాసము, కన్నమ్మ కేశవరామయ్యలకు ద్వితీయ పుత్రుడు. కులగోత్ర

ములు తెలియవు. ఈయన సోదరుడగు బాలాప్రసాదు గాన ప్రవీణుడు, గురువు పొట్నూరి వెంకటస్వామి సంగ్రహ రామాయణం మూడురోజుల హరికథ. 1927వ సంవత్సరములో శశిరేఖ 1929లో కుశలవ 1930లో పురందరదాసు కథలు రచింప బడినవి. మరియు గయోపాఖ్యానము ప్రియంవద జయప్రద హరిశ్చంద్ర నలచరిత్ర సీతాకల్యాణము రుక్మాంగద దయాకర విజయము ద్రౌపది మానసంరక్షణము కుచేల సూరదాసు అను హరికథలు హరికథేతిహాసమంజరి లేక సమాయోచిత పద్యగేయములు కవిగారిచే రచింపబడినవి. సంగ్రహ రామాయణమున గుడివాడ తాలూకా అంగలూరు మానవాదర్శ గ్రంథాలయా ధక్షుడు దుగ్గిరాల బలరామ క్రిష్ణయ్యా చౌదరి తొలిపలుకులో దాసుగారిని గురించి ఇట్లు వ్రాసియున్నాడు ప్రప్రథమున ఆంధ్రదేశమున హరికథా బీజముల వెదజల్లి అంకురింప జేసి తగు నభివృద్ధికి గొని వచ్చిన దీ మహనీయుడే ఔదార్యవంతుడు శిష్య వాత్సల్యపరుడు సర్వజన సౌభ్రాతృత్వము పర మత సహనము సరసాంధ్ర కవితా రచనా శక్తి వీరిలో స్వాభావికముగనే వెలయుచుండును కవిత్వము రస వంతము పాత్రౌచిత్యము మృదు మధురమైనది. గేయముల నడకలు పురాతనముల భావము సౌందర్యముగా నుండి చమత్కార పద్యములతో శ్లేషార్థములతో హాస్య రస ప్రధానముగా రమ్యత గలిగి రచన సాగినది.

బాలాజీ గారి ప్రతిరచనలో ఏదోఒక క్రొత్తదనము గాన్పించుచుండును. ఈ శక్తియే వారి గొప్పతనమునకు మూలము. కవులందరిలో నీశక్తియుండదు. యమకాది శబ్దాలంకారములతో గూర్చిన యీ ఉత్పలమాలను తిలగింపుడు, సీతమ్మ యందము వర్ణింప బడినది.

ఉ॥ కంబుగదే గళంబు కన। కంబుగదే తనుకాంతి చక్రవా
కంబుగదే కుచంబు నన। కంబుగదే శ్రుతి మత్తచంచరీ

కంబుగదే కచంబు మధు। కంబుగదే రదనాంశుకంబు నా
కంబుగ దేవలగ్నము పి। కంబుగదేనుడి భూమిజాతకున్॥

కంబుగదే, కంబుగదే యని ప్రాసధ్వనులు లయాన్వితములై చెవి కింపు గొల్పుచున్నవి. కానీ ఈ పద్యభావము వివరించుటకు హరిదాసు పండితుడై యుండవలయును.

హాస్యరసపూరిత గేయములకు ఈ క్రింది మచ్చుతునకను పరిశీలింప వచ్చును. హరికథేతిహాస మంజరి లోనిదీకీర్తన.

హిం బై ర వి - త్ర్యశ్ర గ తి

1 చెలరేగకె యుక్కా నీ! తలబట్టి చలినొక్కా
తలపకుమా చిట్టి నిను। దరుము విసనకట్టి॥

2 అనుసరించకె నల్లి। నిన్నట్టే మ్రింగు బల్లి
ననుదాకకె యీగ నిను! బనస జిగటు లాగ॥

3 ఎగరకుమా ధూళీ యి! ల్లిదిగో వర్షాళీ
ఎగరకె యెంగిలాకనీ। న్నెండు కుక్క పీక॥

ప్రతి కవిత్వములో కవి అనుభవము ప్రతిబింబిస్తుంటుంది. అందుచే విమర్శకుడు తన కనుభవము లేనంత మాత్రమున కవి యనుభవమును విమర్శించరాదు. పనస జిగటలో ఈగలుపడి చచ్చుట విశాఖ పట్టణ జిల్లావాసి యగు కవి యనుభవము పైగేయమున గోచరము. కవులల్లాడు తుంటారు కవనము వ్రాయుటకు తగిన విషయము చిక్కక. బాలాజీగారి కాబాధ లేదు. కంటి కగపడున దంతయు కథ. వీనులకు వినబడున దంతయు విషయము.

రుక్మాంగద హరికథలో కందార్థములు సీసార్థములు గూడ గలవు. సర్వమత సమ్మతమగు ప్రార్థన తెలుపు నీ దీపద్యం.

గీ॥ తల్లి దండ్రులు లేనట్టి ధన్యు డెవడొ
చావు పుట్టుక గనరాని! నరసు డెవడొ
హెచ్చు తగ్గుల నెంచని! యీశు డెవడొ
అట్టి భగవంతు నురుభక్తి! నాశ్రయింతు॥

ఈ గ్రంథ మందలి రచనా ప్రక్రియ లన్నియు రత్నరాసులే, నాయకీ నాయకుల గుణములు ఏకాదశీవ్రత ఫలితములు, భజన మందిరములు, రాజుల పాప కార్యములు, సూర్య చంద్రోదయ వర్ణనలు, శ్రీరామునిలో గల నవ రస గుణములు, త్రిమూర్తుల ప్రార్థనాదికములు, చక్కగా పద్య గేయము లలో వర్ణింప బడినవి. ఇట్లు హరికథా గ్రంథముల నన్నింటిని సంపూర్ణ ముగా పరిశీలంచినచో అదియొక మహా ఉద్గ్రంథమగును.

ప్రియంవద అనునది చోళరాజులకు సంబంధించిన హరికథ. వీర వనిత పతివ్రత చతురత యగు ప్రియంవదచరిత్ర మందలిదీ క్రింది సీసము అక్బరు పాదుషా నెదుట ప్రియంవద సంగీతము పాడిన విధము తెలుపును

సీ॥ తిరుగ మేల్పొట్లాల! ద్రిప్పినట్లొకచోట
నురుజువ్వ లెగసిన! ట్లొక్కచోట
భరత విహంగము! ల్భ్రమియు నట్లొకచోట
నొడ్డీలు నెగరి న! ట్లొక్కచోట

మలయా నిలంబును। మలపునట్లొకచోట
మునిద మాట్లాడి సు। ట్లొక్కచోట
దనివి దీరగ సుధం! ద్రావి నట్లొకచోట
జక్కెర మెక్కి న। ట్లొక్కచోట

గీ॥ మజన కేళి సల్పి న। ట్లొక్కచోట
యువతితో వెంట లాడి! నట్లొకచోట
బోటి మెప్పురా నీదగు। మేటిపాట
వెలసె సకల మనుజుల హృ ద్వీధి నాట॥

ఈ కవిగారి బాల్య సంగీతాసక్తి పై పద్యమున విదితము. ఆధునిక సంగీతము అమృతధారవలె మాధురీ గంగా ప్రవాహమురీతి కోకిల గానమువలె నుండునని వర్ణింపబడెను.

బాలాజీ దాసుగారు ఇంగ్లీషు సాంగ్సు కూడ ఉపయోగించినాడు. ఈ క్రింది కీర్తన హరికథేతిహాస మంజరి రెండవ భాగము లోనిది.

### కమాని రాగం - ఆదితాళం

1 Ominipotent and the Omniscient and the Omnipresent Him we always should obevy 'The one'

2 Honorable creator assembled we should adore Him god evading even high minds Perbading "The one"

3 His one career there is none say here sure
whole of his history is full of much mystery
"The one"

4 Full loved by us children be loved to His
well drawn
forgives and Paternally gives bliss eternal
"The one"

బాలాజిదాసు గారి సంగ్రహ రామాయణ హరికథలో అనేక రామాయణము లందలి విచిత్ర గాథలను క్రోడీకరించి చేర్పబడెను. అద్భుత రామాయణము, భార్గవ పురాణం, ఉత్తర వాసిష్ఠ పురాణం ఉత్తర రామాయణం విచిత్ర రామాయణం మొదలగు గ్రంథములలో విషయములు సేకరించ బడినవి. రావణుని సంహరించుటకై [illegible] నారదుని వలన యీ వార్త రావణుడెరిగి [illegible] తపమొనర్చుచున్నపుడు వారి కమండలము [illegible] భూములలో పడెను. ఆజల ప్రభావమున పుట్టినదే నాగటిచాలలో దొరకిన సీత, స్వయంవరమునకు బాణాసురుడు గూడ వచ్చెనట. నారదుని గర్వభంగ కథగలదు, సుగ్రీవుడను వదమున కర్థ మేమనగా మూడు వేల మైళ్ల దూరము వరకు ఆయన కంఠనాదం వినిపించుట, ఇట్టి విచిత్ర విషయములతో రమ్యముగా సంగ్రహ రామాయణము రచించ బడెను.

1926 చిలుకుర్తి పిల రాఘవరాయ కవి రచన గయోపాఖ్యానము. తండ్రి కోటీశ్వరవరపు భుజంగరాయ మాత్యుడు, ఆపస్థంభ సూత్రుడు. గురువు ఇలపావులూరు కోటీశ్వరుడు. దర్వులు 8, ఒకసుగంధి వృత్తము ఇందుగల రచనా ప్రక్రియలు.

**1927** బొమ్మరాజు జానకిరామశర్మ నివాసం ప్రకాశం జిల్లా పోతవరము. ఉభయభాషా ప్రవీణ శతావధాని మంచి విద్వాంసుడు. 1933 లో పరమపదము చేరినాడు. వీరు రచించిన హరికథలు సక్కుబాయి, నందనార్, కథాపరంగ భక్తిభావముగల్గి చక్కని భాషాపటిమతో సరళముగా నున్నది. కవిగారి వంశమే విద్వాంసులకు పండితులకు ఆలవాలమైనది, నిశ్చలమైన నిస్వార్థమైన నిష్కళంకమైన భక్తియన నెట్టిదో సక్కుబాయి చేత ఈ క్రింది సీసపద్యముతో చెప్పించినాడు.

సీ॥ అలరి నా ప్రేమంబు! నార్జింప శ్రమియించు
పతిపైన ప్రేమభా। వంబు లేదు
నవమణి కల్పితా। నర్ఘ భూషాంబర
హారి వస్తువులపై। నాసలేదు
కనిపెంచి పెద్దగా। నినుచేసి యున్నట్టి
తల్లిదండ్రులపయి। దయ్యమ్మ లేదు
నా పెట్టి సరిపడ। కేవేళ తర్జించు
మీమీద కోపమే। మియును లేదు

గీ॥ వంశమును నిల్పవలెనన్న! వాంఛలేదు
ఇంటిలో నుండవలెనను। నిచ్ఛలేదు
పాండురంగనితో నైక్య। భావముండి
కడిమి తరియింప గోర్కెయొ। కండు దక్క॥

**1927** చల్లా రామలింగయ్య ప్రార్థనాదికములు గాని వంశావళిగాని లేవు. ప్రారంభముననే కథారచన మొదలు పెట్టబడినది. వీరు రామదాసు హరికథను రచించిరి, కథారచన విమర్శనతో చక్కగా వర్ణింపబడినది.

పద్య రచన చాల తక్కువ, చమత్కారమైన విమర్శ, పాత్రోచిత భాష గలదు.

1929 కందుకూరి చెంగయ్యార్యులు నెల్లూరు జిల్లా పెనుబర్తి గ్రామ కాపురస్తుడు. తండ్రి చెంచురామాచారి తల్లి బుచ్చెమ్మ. సుకవీశ్వర, తత్వజ్ఞాన, బ్రహ్మానంద శివయోగి యను బిరుదములు గలవు. గ్రంధము నెల్లూరు ఎడ్వర్డు ముద్రాక్షరశాలలో ముద్రించబడినది. సాంబశివ భక్తుని చరిత్ర హరికథగా రచించబడెను.

1929 కారెపాక శేషాచలంపిళ్లె రచన వైదర్భీ పరిణయము. తలిదండ్రులు లక్ష్మాంబ మునిసామి, తాత శేషాచలం, పతంజలి మహాఋషి గోత్రం. నివాసం తాడిమేడు గ్రామం నెల్లూరు జిల్లా. కవి తాను విద్వాంసుడ గానని ఒక పద్యములో తెలిపియుండెను. గానీ తన ప్రత్యేకత రచనలో నిరూపించుకొనెను. వినాయక స్తోత్రములను విధుదారిసుత స్తోత్రమనియు, అంజనేయనుతిని సదాగతి నందను నుతియనియు కృష్ణుని ప్రార్థనమును తెలిదేవి గేస్తు గిడిగిడి యనియు సుకవితాస్తుతిని పరువు పెంకణాలు అనియు కుకవి విమర్శనమును కైకైనరుల నేరేడల్లులు అనియు పేర్లిడి ప్రార్థనలు రచించియున్నారు. ఇట్లు మరొక కవి వ్రాయలేదు.

కవి పిళ్లెగారు గాన అరవ భాషలో గూడ ఒక కీర్తన వ్రాసినాడు. ఒక మాతృభాష వానికి మరొక భాషలో మాటలు వింటుంటే హాస్యముగా ఆనందముగా యుండును. రుక్మిణిని గైకొనిపోవుచున్న కృష్ణుని వెంటనంటి రుక్మిణి అన్నయగు రుక్మి యిట్లు పలుకును.

హిం దూ - జు ల్వా తా ళం

కొణల్వణనె వెణె యిగ్గా కొణువా।
వెణెకొణుపన్ను కొడుత్తుశరణ జ్బెణస్యవా।
యిడై యరదుమన్నై గళివె!
తిరుడి తిరుడి పిళ్లై 'ఱుళ్లి' త్తవనే॥

ఱుళ్లి ఈ అరవ అక్షరము తెలుగులో లేదు.

1930 గొర్తి కామరాజు భాగవతార్ బెజవాడ వాస్తవ్యులు. పండరీపుర మహాత్యమను హరికథ వీరిచే విరచితము.

1930 [illegible] వీరి జననం ప్రకాశం జిల్లా [illegible] రెడ్డపల్లెలో [illegible] గ్రంథ పరిచయము [illegible] ఆర్వేల నియోగి బ్రాహ్మణుడు. వీరి [illegible] రామాయణం సీతావతిగారు గొప్ప పండితురాలు. అయిన తమ్ముడు బాలరామస్వామి తరంగ కాలక్షేపములో దిట్ట. లయబ్రహ్మ. పలౌక అన్న కుమారుడు రామాయణం అయోధ్య రామయ్య మంచి మృదంగిష్టు. ఈ కవిగారి కుమారుడు వెంకట సుబ్బయ్యగారు బాల్యమునుండి భక్తుడు పండితుడు.

వీరి రచన కృష్ణరాయబారము హరికథ (అముద్రితము) కృష్ణుడు దుర్యోధనునింటికి భోజనమునకు రాను విదురునింటికి పోయెదనని చెప్పు సందర్భమున ఈ క్రింది మత్తకోకిల రచింపబడినది.

కౌరవేశ్వర నేనురానను కారణంబును దెల్పగా
గోరెదేనియు దూతముందుగ కూడు సాపడ గూడదే॥

వారు మీరును పోరులేకను పక్కనై కూడుండెడు
దారిచేయగ వచ్చినేనిటు దారితప్పిన నవ్వరే॥

కవి దక్షిణప్రాంత నివాసుడయినందున 'సాపడు' అను అరవ పదము నుపయోగించినాడు.

1933 జానకపట్టి దేవ రామచంద్రాచార్యులు గారు రచించినది సత్యహరిశ్చంద్ర. కీర్తిరత్నాకర! తత్వభూషణ! విద్యానిధి! అను బిరుదులు గలవు. కవి సేలంజిల్లా కెలమంగలం గ్రామవాస్తవ్యుడు. ధృవచరిత్ర కుచేల యను హరికథలను గూడ రచించినాడు.

1934 తిరువనగరి శేషదాసు ఆయన కస్తూరి రంగదాసు కుమారుడు, హేలాపురం అనగా రాజమండ్రి కాపురస్తుడు. వీరు తనరచన లందు కీర్తనలను మాత్రము రచించిరి. పద్యములు మాత్రము పోతన భాగవతము, గోపీనాధ, విచిత్ర, అధ్యాత్మ మొల్ల ఆంధ్రవాల్మీకి (అనగా వావిలికొలను సుబ్బారావుగారు) భాస్కర రామాయణాది గ్రంధములలో మరి కొన్ని ప్రబంధముల నుండి సేకరించి చేర్చిరి. ఎందువలననగా ప్రాచీన కవీంద్ర విరచిత పద్యావళికంటే రసవత్తరముగ వ్రాయుటకు తనకు శక్తి లేదని చెప్పుకొనిరి. ఈ భావన కవికి కలుగుట వారి వినయ విధేయతకు నిష్కల్మష భక్తికి నిదర్శనము. కవిగారు ప్రతి సంవత్సరము పాదచారులై భద్రాద్రి యాత్ర సల్పుచుండెడి వారు. చలివేంద్రలు ,ధర్మశాలలు నెలకొల్పి నట్లు గ్రంధమున తెలియ జేయబడినది. పాదుక, సుభద్ర, సీతాకల్యాణము, సీతాప హరణము, కుశలవ అనునవి వీరి హరికథలు సరళమైన కవిత్వము, కీర్తనలు లయకు చక్కగా సరిపడును. వీరి కథలు సామాన్యులు సయితము నేర్చుకొని సులభముగా కథలు చెప్పుట కనుకూలముగా రచింపబడినవి.

బెజవాడ సరస్వతీ బుక్ డిపో వారు ఆంధ్రవాణి ప్రెస్సునందు గ్రంథము ముద్రింప జేసిరి.



కొమ్మూరి బాలబ్రహ్మానంద దాసు

**1935** కొమ్మూరి బాలబ్రహ్మానంద దాసు రాజమండ్రి నివాసం, గురువు శ్రీపాద కృష్ణమూర్తి గారు. బాల కవితా సరస్వతి, పరమ భాగవత శిఖామణి అభినవ లీలా శుక బిరుదాంకితులు. వీరి రచనలకు కవి సార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారు ఉపోద్ఘాతములను వ్రాసి యున్నారు. వీరికథలలో సంఘ దురాచారములు విమర్శింపబడినవి. గేయ రచనలో పాత్రౌచిత్య భాష గలదు. నందనారు, భీమార్జున గర్వభంగము, శ్రీకృష్ణ గురుచరిత్ర, శశిరేఖ, త్యాగరాజు, సత్యనారాయణ చరిత్ర, శ్రీరామ కథాలహరి బాలకాండ 3 భాగములు అయోధ్యకాండ 3 భాగములు, బృందాదేవి (తులసి), శివచరిత్ర, కృష్ణరాయభారము, విచిత్ర కథా నక్షత్ర

మాల సీమంతిని (సోమవారం వ్రతకథ) హరికథా విధానము. (నిఘంటువు) పూర్ణానందము యను హరికథలు దాసుగారిచే రచింపబడెను. పూర్ణానందము సాంఘికమైన కథ స్త్రీ పునర్వివాహము చేసుకొనవచ్చు నని ప్రబోధము చేయనట్టి కథ. ఇందలి ఇతివృత్తము ఒక వైశ్యునికి సంబంధించినదై యున్నది.

అస్పృశ్యత పనికి రాదని కవిగారు తన యభిప్రాయమిట్లు ఈ సీస పద్యమున తెలియ జేసిరి. గాన హరికథలు భక్తిబోధకే గాక సంఘసేవకు గూడ ఉపయోగపడునని గ్రహించవలెను.

సీ॥ అస్పృశ్యతా రోగ। మంత రింపక జనుల్
స్వేచ్ఛా విహారమున్। జేయలేరు
ననుముట్ట కొనబోకు। మనుమాట విడకున్న
మనసు నిశ్చలమైన। దనఁగ రాదు
హరిజనుల్ మన వార। లనక యుండిన వారు
సంఘబాహ్యుల్। నలుపలేరు
అంటరాని తనంబు। నణచి వేయక యున్న
వ్యక్తిత్వమున కైన। ఫలము లేదు

గీ॥ మాలయన సర్వ సౌకర్య మాలమటియు
రక్షణము సేయునట్టి రు! ద్రాక్ష మాల
మాలయని నంత మాత్రాన। మాల యగున
మౌఢ్యహ రణమౌవ్పటికపు! మాలగాక॥

బాలబ్రహ్మానందము గారు హరికథా విధానమను గ్రంథములో తన స్వానుభవములను తెలియ జేసియున్నారు. గాలిలో కథను చెప్పరాదు, తైతక్కమని నృత్యము చేయరాదు. వ్యభిచారి కారాదు. త్రాగుబోతులు దొంగలు హరికథలు చెప్పరాదు వినరాదు అని ఉద్బోధించి మరికొన్ని సలహాలను దాసులకు నిచ్చిరి. ఈ సలహాలు దాసులే గాక కథాపోషకులు గూడ పాటించి ఆమోదించినపుడే కథబాగుగా జరుగునని గ్రహించవలయును.

సీ॥ చలనమింతయులేక। నిలువబోయెదు కథన్
బఠియింపుమయ్య జ్ఞా। పకము కొఱకు
తరువాత గొంచెము। తక్కువగా ఘుజి
యించి తమకము సే। వించబోక
తంబురా ఫిడిలు హృ। దంగంబు వాయించు
వారి గథాస్థలిం। జేరబంపి
వెనుక శృతియు మృదం। గిని దక్షిణంబున
నెడమవైపున వైణి। కుడును బ్రక్క

తే॥ కొకొక యద్దెదమున ముందున। కొక్క గజము
గూర్చొనగ బంపి శృతులను। కూలముగ స
లుపగ మడినేగి దేవువే। డుకను బాడి
గజ్జలం గాలిలోవైపు గట్టి నిలచి॥ ——

—— —— —— —— —— —— —— ——

ఈ కవిగారి బృందాదేవి యను హరికథ రంగూన్ నివాసి రెడ్డినన్యాసయ్య గారికి అంకితమివ్వబడినది. ఈ కృతిభర్త దాసుగారిని రంగూన్ పిలిపించి గౌరవించినాడట. ఈ కవిగారు ఆశుకవిత్వము గూడ చెప్పగలడట.

**1935** కోసూరి భోగలింగ దాసు గారి రచనలు శ్రీయాళ, రుక్మాంగద, అంబరీష, విప్రనారాయణ, శశిరేఖ, గోపీచందు చరిత్ర, నంగి తానంద రామాయణము, నలోపాఖ్యానము. వీరి నివాసం పశ్చిమ గోదావరి జిల్లా తణుకు తాలూకా వేలువెన్ను గ్రామము. తండ్రి లక్ష్మణాచార్యుడు నేను పరిశీలించిన రామాయణము హరికథ రెండవ ముద్రణ 1938 లో జరి గినది. సంగీత సాహిత్యము లందు కవిగారు బాగుగా కృషిచేసితి నని గ్రంధమున తెల్పియున్నారు. ఈలోకమంతయు మాయ శోకమయము అని వివరించుచూ నామ సిద్ధాంతమున ఈక్రింది సీసపద్యమును రచించియుండిరి.

సీ॥ గయ్యాళి గంపకు! గడు సజ్జనుడు భర్త
పుణ్యసాధ్వికి తిండి! పోతు మగడు
కడు బీదవానికి! గంపెడు బిడ్డలు
ధనవంతులకును సం! తతి కొరంత
పండితునకు శుద్ధ! బండ మొండి సుతుండు
దుండగు కొమరుడు! పండితుండు
ధర నజీర్ణికి పెక్కు! ధాన్య రాసులుకొట్లు
కుడిచెడి వానికి! కూడులేదు

గీ॥ ఇట్టి కల్పన చే మాయ! కట్టు గట్టి
నాటకం బాడుచుంటివా! నళిన నేత్ర
భళిర నీమాయ దెలియ నె! వ్వరి తరంబు
రవికుల పయోధ చంద్ర శ్రీ! రామ చంద్ర॥

ఇట్టి పద్యమును ఆదిభట్ల నారాయణ దాసుగారు మాత్రమే రచించి యుండిరి. ఇతర కవులెవ్వరు రచించలేదు. ఇట్టి పద్యములు హరికథ బోధ

కెంతేని అవసరము. పార్వతికి శివుడు రామాయణకథను చెప్పునట్లుగా పురాణ పద్ధతిని కథ ప్రారంభింప బడినది. ఆదిభట్లవారి రామాయణము ఇట్లుగాక మామూలు పద్ధతిని రామాయణ కథతోనే ప్రారంభించబడినది. ఈ కవి గారు యజ్ఞదక్షుని కథ పాదుకా పట్టాభిషేక కథలో దశరథుని మరణ సమయమున చేర్చిరి. దాని ఆదిభట్లవారు ఈ గ్రంథ ప్రారంభముననే రచించిరి. కథలు వరుసక్రమము తప్పకుండ ఉండుటకొరకై ఆదిభట్లవారు ఇట్టి మార్పులు చేసిరి. ఇదే మాదిరిగా భారత హరికథలో పరిమి సుబ్రహ్మణ్యం గారు కూడా భీష్మ పర్వములో ఉండు భీష్మచరిత్రను మొదటనే తన గ్రంథమున రచించిరి వీరి రచన కర్ణానందముగా పాడుకొను రీతిలో సరళమైన భాష కలిగి చెవికింపుగా ఉండును. కథ సాఫీగా నడుచును, ఉపమానోదాహరణములు మితము.

1935 హరినాగభూషణం గారు, B. A. జననం 1884 బందరు నివాసం. వీరు త్యాగరాజు 3 భాగములుగా శంకరాచార్య 7 భాగ ములుగా, విభీష శరణాగతి పాదుక మొదలగు హరికథలు రచించిరి. స్వయ ముగా హరికథలు చెప్పెడివారు, తన హరికథా నైపుణ్యమునకు ఆదిభట్ల నారాయణదాసుగారి వలన విజయనగరం రాణి గారి వలన బహుమతులు పొందిరి. సంగ్రహముగా శ్లోకరూపమున రామాయణము రచించిరి. వీరి సంగీత సాహిత్య భావనా పారాయణ వాగ్గేయకారక రత్నమని బిరుదములు గలవు. వాయులీన విద్వాంసులు గూడా.

1936 లకవరం శ్రీరామ కవి నివాసం నెల్లూరు జిల్లా నాగ బొట్ల పాలెం, తండ్రి రామయామాత్యుడు భారద్వాజస గోత్రుడు. గౌరి కల్యాణము, వామన చరిత్ర, దుర్యోధన పరాభవము ఘోషయాత్ర యను హరికథలు వీరి రచనలు. గౌరి కల్యాణమునకు హరకథ యని పేరిడిరి.

మిగత వానిని హరికథలనిరి. గౌరీ కల్యాణమందు కొప్పరపు సోదర కవుల ప్రశంసా వాక్యము గలదు. ఈ కొప్పరపు సోదరులు ప్రఖ్యాతి వహించిన కవులు. ఆగమ శాస్త్ర విశారదులగు తుమ్మలపల్లి నాగలింగా రాధ్యుల వారి ప్రశంసా పత్రము గూడ గలదు. ఒరంగల్లు వాస్తవ్యులు ఉభయభాషా కవితా కరణ ప్రవీణ పండిత పులిపాక మహానంది శాస్త్రిగారు ఈ గౌరీ కల్యాణకథ యందలి రచన రసభావ పదప్రయోగ చాతుర్యములచే నొప్పి శ్రోతల హృదయా నందసంధాయకమై యనుపమాన భక్తిజనకమై యున్నదని ప్రశంసించిరి. స్కాందపురాణాంతర్గత మైన విషయము కథకాధారము. కవి శైవ మతాభిమాని హరికథ యనుటకు బదులుగా గౌరీకల్యాణ కథకు హరకథ యని పేరు పెట్టిరి. వీరి గ్రంథములు ఒంగోలు వెల్‌కమ్ ప్రెస్సు P.V.R. హిందూ స్కూలు ప్రెస్సునందు ముద్రాపితము. ఈ కంద పద్యము, కవి పోతన ననుకరించి నట్లు తెల్పును.

క॥ పలికెడిది శివుని చరితము
పలికించెడి వాడు శివుడు! భక్తిదనర నే
బలికిన కల్మష హరణము
ఫలమింతుని చెప్పనేటి! ప్రాజ్ఞుల దరమే॥

రచనాశైలి ప్రాచీనము, కుకవి తిరస్కార పద్యము చక్కని యుపమానముతో నున్నది:—

గీ॥ గంధమాలా విభాసిత! గాత్రమంత
విడచి యీగలు పుంటిని! వెతకు కరణి
భావ రసపద నైపుణి! వంక టొంక
తప్పు వెదకుదురు కుకవి! తండ మెపుడు॥

కవి హరికథకుడు గాదు, పండిత పరికి యగు రచన. గేయములు సామాన్య జ్ఞానులు సహితము గానయోగ్యములు మృదు మధురములు. కవిత్వము హాస్యరస భరితము. పైకుకవి తిరస్కార పద్యమును బట్టి యే కవి పోతన వలెనే లోకమును లెక్కచేయువాడు గాడనియు పాండిత్య ప్రతిభ గల ధీశాలి యనియు విదితమగును. కవిత సులభ గ్రాహ్యము. దక్షయజ్ఞం గౌరీ కల్యాణ మని కథ రెండు భాగములుగా విభజింప బడెను. ఇతర కవుల కథకు ఈ గౌరీ కల్యాణ కథకు కొంత తేడాగన్పించును. శివుడు ఎరుకల సాని వేసమున వచ్చినట్లు ఈకథలో వర్ణింప బడలేదు. ఈకథలో మన్మథుడు గర్వించినట్లు లేదు బ్రహ్మ శపించెద ననగా భయపడి మన్మథుడు శివుని పైకి పోయెను.

తే॥ గీ॥ పెద్దలందరు నిన్నిట! బిలచి చాల
ప్రియము తోడుత నిన్నొక! పెద్ద జేసి
మంచి మాటలు జెప్పిన! మదికి నెక్క
వింక నీపొగ రడగ శ! పింతు జూడు॥

పార్వతి మేనక గర్భమున జనించినట్లు ఇందు లేదు. మానస సరోవర ప్రాంతమున ధ్యానములో నున్న హిమవంతునికి ఒక కమలములో దొరికినది.

మ ం జ రి

పరమ చిత్రమగు పుల్లహల్లక ప్రసూన మున బాల
నిరుప మానయై కానుపించె నీతి సురుచిర లీలావాల॥

శివుడు వటువుగా పార్వతిని పరీక్షించుటకై వచ్చినట్లు ఇతర గ్రంధముల గలదు. ఇచ్చట వృద్ధ బ్రాహ్మణ వేషములో వచ్చినట్లు వివరింపబడి

నది. పోతన వ్రాసిన వీరభద్ర విజయము వాయు పురాణము లోనిది, అది సరి లేదని కవి కొంత విమర్శనము జేసి యున్నాడు. కవి మంచి గ్రంథ పరిచ యము గలవాడనీ తెలియు చున్నది. అంకితము శివార్పణము.

**1936** మద్దూరి సాంబయ్యగారు I. L. T. D. కంపెనీలో Head clerk పనిచేయుచూ భక్తిప్రపత్తులయి హరికథలు రచించిరి. శ్రీకృష్ణ తులాభారము, ధృవచరిత్ర, మయూరధ్వజ, శ్రీనివాస కల్యాణము వీరిచే రచింపబడిన హరికథలు. రచనలో అంబడిపూడి రామనాథ భాగవతార్ గారు తోడ్పడిరి. తులాభారం హరికథ తల్లిగారగు పార్వతమ్మ గారి కంకి తము, కవికి సంస్కృతములో ప్రవేశము గలదు. ఇష్ట దేవతా ప్రార్థనలు సంస్కృ భాషా పద మయములు. నిర్దుష్టమైన తెలుగు రచనము. సమ యాను కూల సంభాషణము, మైత్రీయుత పద ప్రయోగము ఉచిత భావ ప్రకటన, రస పోషణము, పాత్రౌచిత్యము రచన లోని గుణములు. కథ పండిత రంజకము, కవిత సులభశైలి, భక్తిరస భరితము. ఈకథలు ఆకాశ వాణి కేంద్రములలో చెప్పబడుచున్నవి.

**1937** రామపుత్రి అసలు పేరు సుబ్బమ్మట, తల్లి విశాలాక్షి తండ్రి శ్రీరాములు. ధ్యాన సమయమున ఈమెకు ఆంజనేయ స్వామి దర్శన మిచ్చి రామాయణము వ్రాయుమని అనుజ్ఞ నిచ్చెనట. అంతట రామా యణము హరికథను రచించెను. ఈమె భర్త పసితనముననే గతించినందున భర్తతో భౌతిక సంబంధము లేక భక్తురాలై జీవితము గడుపుచూ రామ పుత్రి యని పిలువబడు చుండెనట. కవయిత్రికి మిత్రురాలగు రుక్మిణమ్మ రచనలో తోడ్పడినది. నెల్లూరు జిల్లా బుచ్చిరెడ్డి పాలెంలో గల నవకోసల రామునకు గ్రంథమంకిత మియ్యబడెను. రచన సుబోధశైలి, దోరాలెక్కువ. 1905లో ఈమె సుముఖీ దేవి యను యక్షగానమును గూడ రచించెను.

డోరా పల్లవి :——

జయ జయ రామ జానకి రామా - జయ జయ జగదభి రామా
జయ జయ నవకోసల పురి ధామా - జయ జయ దశరథ రామా॥

ప్రారంభమున సంక్షేప రామాయణము రచింప బడెను. కీర్తన లయకు సరిపడుట లేదు, గేయములకు రాగములను, మిశ్రరాలు నెల్లూరు సంతాన రామయ్యం గారి కుమార్తె రుక్మిణమ్మ గూర్చినది. ఈ విషయం బాల కాండ చివర వ్రాసియున్నది. కాండములుగనే కథా రచన సాగెను. చంపక మాలాది వృత్త రచన లేదు, వచనములో అసమాపక క్రియలెక్కువ.

శ్రీహరి యుదయించి, కౌసల్యా దశరథుల కానందము గల్పించి, కౌశికముని యాగము గాచి, అహల్యను బ్రోచి, ధనుర్భంగము గావించి జానకిని వరించి——

1938 కట్టా అచ్చయ్య కవి వేటపాలెం బాపట్ల తాలూకా. శ్రీకృష్ణావతార మహాభారతము 30 హరికథలు రచించెను. అనగా పాండవ కౌరవుల చరిత్ర, కవి కథకుడు గూడా. కృతిభర్త పుచ్చల బ్రమర దాసు ఈయన ఒక గొప్పపేరు బొందిన హరిదాసు. కృతిభర్త గూడ హరిదాసగుట ఇందు విశేషము. ఆదిభట్ల నారాయణ దాసు గారు అభిప్రాయ మిట్లొసంగిరి.

గీ॥ ఒక్కొకని కొక్క నేర్పు పెం! పెక్కు చుండు
వొకని మించిన గొప్ప వాం॥ డొకడు లేడు

[illegible]

తూలనాడ దేవని నైన, దొడ్డవాఁడు
వేలు పందలిలో నేను, వెంపుఁగాన

గీ॥ భారతము వేల్పు మదుపులం బట్టి తెలుఁగు
ముక్కముక్కకు దోపిరి, ముందుగానె
త్రొక్కఁజాలరు నీపలె, స్తోత్ర త్రోవ
నచ్చయా! యిట్టి నేర్పు నీ, కబ్బవచ్చె॥

కవిత్వము అలంకారములతో ఇప్పుడు మధుర పద శోభితమై పొదలు ద్రాక్షా పాకము వలె పద్య గద్యములతో నవరస భరిత నూత్న కల్పనలతో నున్నదీ గేయ ప్రబంధము.



మైసంపాటి నరసింగరావు భాగవతార్

**1938** మైనంపాటి నరసింహరావు గారు ప్రకాశం జిల్లా టంగుటూరు వాస్తవ్యులు, ఆంధ్ర [illegible] గారు మంచి పండితుడు కవి. అనేక గ్రంథములు [illegible]. వీరిది పండిత వంశము. నరసింగరావు గారి [illegible], హరికథా కేసరి బిరుదాంకితులు. శ్రీ [illegible] రామాయణం హరికథను రచించెను. శ్రీరామాంజనేయము, [illegible]ము, వత్సలా పరిణయము, సుభద్ర, రుక్మిణీ కల్యాణము, గౌరీ కల్యాణము, భీమార్జున గర్వభంగము, గరుడ గర్వభంగము, [illegible], ద్రౌపది వస్త్రాపహరణము, హనుమజ్జననము, సంజయ కృష్ణ రాయబారము అను హరికథలను గూడ తాను రచించితి నని రామాయణ గ్రంథములో తెలిపెను. వీరి సోదరులు హనుమంతరావు రామయ్య సుబ్రహ్మణ్యము గారలు హరిదాసులే. నరసింహరావు భాగవతార్ గారికి కథలలో సోదరులు వంతపాట పాడుచుండెడి వారు. ధ్యాన సమయమున రాముడు గనిపించి ఆజ్ఞ యీయ నందున ఈ రామాయణమును వ్రాసినారట. దాసు గారు వసుధా భాగ్యవంతులు, 91 సంవత్సరములు జీవించి ఇటీవలనే పరమ పదించిరి. ప్రార్థనాదికములు కవి స్తుతులు వంశావళి రచింపబడెను. కీర్తనలు అక్షరకాలములలో వ్రాయుచు [illegible] వలసిన మాత్రల కాలమును కామాలచే (,) గుర్తించ బడెను. మరియు కీర్తనలు ఎత్తుగడలు మార్పులు గలిగి [illegible] భావనకు తగిన రాగ నిర్ణయములు మొదలగు విద్వత్సంబంధము లగు [illegible] రచనలో గలవు. మైనంపాటి వారి వంశము కవిత్వమునకు చమత్కార శృంగార హాస్య రస పోషణమునకు పెట్టినదిపేరు. వాల్మీకి శ్లోకములు తాత్పర్యసహితముగా గ్రంథమున చేర్చ బడినవి. ఈ పద్ధతి హరిదాసుల కుపయోగ్యము. చదువనకొక గేయము తిలకింపుడు. ఈగేయమున త్రిమూర్తులు నొకేసారి ప్రార్థింపబడిరి.

గీ॥ నట్టి శ్రీరాము పదముల! నలరు రేణు
వంటి శిల రూపమును బాపి! యహల్య
పరమ సాధ్వీస్వరూపంగ గను! పడియె నపుడు
పంచ కన్యలలో శ్రేష్ఠ పడతి యనంగ॥

హరిదాసు కీర్తి రచనలు చాలా ముఖ్యములు. సంగీత పాటకుడు పల్లవి పాడి వదలినచో ప్రక్క వాద్యకులు పల్లవి నాధారముగ వారి స్వంత విద్యను పెంపు జేసి ప్రదర్శింపవచ్చు. అట్లే హరికథా రచన గూడా కథకుడు కథ చెప్పుటను పెంపు చేయుటకుండ విశాలముగా యున్న కవిత్వమే శ్రేష్ఠమైనది. ఈ పైపద్యము ననుసరించి కథకుడెంత కాలమైనగనూ ఉపన్యసించ వచ్చును. శేషశాన్నపై శయనించిన విష్ణువును గూర్చి వామనుని గూర్చి గంగ పుట్టుకను గూర్చి పంచకన్యలు వారి మహిమలను గూర్చి అయా చరిత్రలు అనంతముగా వివరింప వచ్చును. ఇట్లు ఈ గ్రంథరచన యంతయు బహు చక్కగా వర్ణింపబడుటయే రచింపబడినది.

**1939** పల్లెపట్టి బసవిరెడ్డి నివాసము రాపూరము. రచన భారత వీర చరిత్రము. కవి కథకుడు గూడ.

ఈ గ్రంథమునకు వడిమేల్ల వీరభద్ర శాస్త్రి గారు ప్రవేశికను వ్రాసి యున్నారు. ఈగ్రంథము వ్రాయుటకు మూడేండ్లు పట్టినదట. మాతామహికి గ్రంథ మంకిత మివ్వబడెను. రచన సుబోధశైలి, పద్యరచనలో వృత్తములు తక్కువ. ఆధునిక రచన ఇతర భారత కథలకన్నా ఈకథలోని కొన్ని ప్రత్యేక ఘట్టములు గలవు. అవి పునస్థ్సాతము, అగస్త్యోపాఖ్యానము, వృత్రాసురోపాఖ్యానము, పరశురామ చరిత్ర, మార్కండే యాగమనము, భూ ప్రళయము, యుగధర్మములు, పతివ్రతా ప్రభావము, ధర్మ వ్యాధోపదేశము మొదలైనవి. యుగ ధర్మముల గూర్చిన కీర్తన యిది.

## ధన్యాసి - ఏక

కలికాలము కడుఘోరము గడుసంగా దరంబా
సుకృతికిన్ ॥క॥

తులువదనము కొటపట్టు సుజనుల దుఃఖపెట్టు
పాపపుం గొట్టు హా॥

ఖలులకు నాయువు హెచ్చు। చక్రధరుని నమ్మిక జచ్చు
కలిమిఁ బలిమిఁ గడు ద్రుళ్ళదు నధముఁడు

జ్ఞానులఁ నతి నిరసించి హసించున్ ॥క॥
సతి పతి దృణీకరించు। కన్నసుతుడు వేధించు
నతి నిర్దయ భూపతులు ప్రజల నన్యాయముగా బాలించు
చెడుమతి నొజ్ఞను శిష్యుడు గికరించు।
మంచి మార్గమును విప్రుఁడు త్యజించు ॥క॥

1940 జగ్గర్లపూడి వెంకట సుబ్బయ్య భాగవతార్ గారు తెలుగు విద్వాన్. బాపట్ల నివాసం, అమరలింగ విజయము అనగా మేధన రాముని హరికథ వంటి కథను రచించెను. ఇది శ్రీశైల మహాత్మ్యమును తెలుపును. మరిరెండు కథలను గూడ రచించెనట.

1940 పెంటపాటి సర్వేశ్వరరావు భాగవతార్ ఉంగుటూరు నివాసము తండ్రి సుబ్బరాయ భాగవతార్ గారు. వీరి రచనలు రామదాసు, భీమార్జున గర్వభంగం, ప్రహ్లాద, సత్యన్నారాయణ వ్రతం, కవిత్వము సుల భ గ్రాహ్యము. కథ చెప్పినట్లుగాక గానము చేసినట్లుండును, వర్ణనలు ఉప మానోదాహరణలు తక్కువ క్లుప్తరచన.

**1941** మంచెళ్ల వెంకట సుబ్బరాయ భాగవతార్ రచన రామదాసు, కోదర గ్రామ నివాసం. కొన్ని కీర్తనలకు స్వరములు రచించెను. విద్వాన్ కవికోకిల బిరుదు, గ్రంథము తల్లియగు సీతమ్మ గారి కంకితము.

**1941** అచ్చుల లక్ష్మణానంత కవి సతీతులపి దక్షయజ్ఞము వామన విజయము అను హరికథలను విరచించెను. నివాసం చీరాల ప్రకాశం జిల్లా. అచ్చుల రామయ్య, మునయ్యశ్రేష్టి గారల సహాయంలో గ్రంధము ముద్రణ జరిగినది.



-పరిమి సుబ్రహ్మణ్య భాగవతార్

**1941** పరిమి సుబ్రహ్మణ్య భాగవతార్ ప్రఖ్యాతుడగు ఆధునిక కవి. ఆకాశవాణి ద్వారా వినబడు హరికథలు ఎక్కువగా వీరి

రచనలే, స్వగ్రామము పోతునూరు హేలాపుర (రాజమండ్రి) ప్రాంతము. అపస్థంభ సూత్రుడు, తల్లి కనకమ్మ తండ్రి సుందర రామయ్య, గురువు గుడిగుంట లక్ష్మీపతి, బిరుదులు కథకవాచస్పతి కవిశిరోమణి గ్రంధ రచనలు మహా భారతము, శ్రీకృష్ణ భాగవతము, జలంధర, ధన్వంతరీ చరిత్ర, నల చరిత్ర, రఘుకుల చరిత్ర, సుమతి, తులసీ ప్రభావము లక్ష్మీ కల్యాణము, శమంతకమణి, సాయిబాబా, పార్వతీ పరిణయము, రసికానందము, (సమయోచిత పద్య గేయములు) నేతాజి, ప్రమీల సీమంతిని, సుభాస్ చంద్రబోసు మారుతి చిటికెలు, అర్జున గర్వభంగము, మాయా సుభద్ర మొదలగు హరి కథలు. సుబ్రహ్మణ్యముగారి కవితా శైలి కవిత్రయమును తిరుపతి వెంకట కవులను బోలియుండును. వారి ననుసరించితి నని గ్రంధమున చెప్పబడెను. పోతన రామునకు వలె తాను కృష్ణునకు భాగవతము నంకిత మిచ్చితి నని తెలిపెను. తన కవిత్యము తప్పుల కుప్ప యని తానే జెప్పికొనినాడు. గాన వారి కవిత్వమును విమర్శించుటకు విమర్శకుల కధికారము పోయినది.

ఉ॥ తప్పుల కుప్ప నాకయిత। దానికి దోడుగ గొప్ప సాములే
జెప్పగ బోని మేటి కత। జెప్పగ బూనితి నెక్కసక్కెమౌ
జప్పున గాదె బాస బిగి। చాలని యల్లిక నాకొలందికిన్
బప్పున గాలు వేయక సె। బాసని పించుట నోటి మాటలే॥

తప్పుల కుప్ప పద్య రచనయే, యెంత గొప్పగా ప్రౌఢముగా నున్న దో గమనింపుడు. ఫలములు గల వృక్షము వంగి యుండునను సామెత పరిమి వారి యాదర్శముగ నున్నది. వీరి రచనా సరళి పద గుంభనముతో గంగా ప్రవాహము వలె గంభీరముగా పదకాఠిన్యముతో గన్పట్టు చుండు నమటకీ పద్యము నిదర్శనము.

మ॥ పృథు గంగాధి తరంగ శీకర సమా। క్రీడి ఘాత భాన్వత్కటా
విదితాంభో రుహ వైరి మండల మరో। క్రీ జాత సూనావళీ
నద సత్కుండల సిద్ధ రోల్లసిత శ। శ్వద్వైభవా ఖండలా
బుధ సంసేవిత విశ్వనాధ శివశం। భోపాహి భోగేశ్వరా॥

భారతము 24 హరికథలుగ వ్రాయబడెను. భీష్మ ప్రతిజ్ఞ భీష్మ విజయము, పాంథవ జననము, కురుపాండ వాభ్యుదయము, పాండవ పర్యటనము, ద్రౌపది స్వయం వరము, సుభద్రా పరిణయము, పాశుపత సంసిద్ధి ఘోష యాత్ర, సైంధవ పరాభవము, కీచక వధ, ఉత్తర గోగ్రహణము, పాండవ సందేశము, కృష్ణ రాయబారము, చక్రధారణ, భీష్మ పతనము, పద్మవ్యూహము, సైంధవ వధ, ప్రచండ పార్థదము, కర్ణ ప్రతాపము, కర్ణ వధ, సామ్రాజ్య సంసిద్ధి అను నామములతో విభజింప బడెను.

శ్రీకృష్ణ భాగవతమును పదునారు హరికథలుగా వ్రాసియున్నారు. అవి శ్రీకృష్ణ జననము శకటాసుర భంజనము శ్రీకృష్ణ మాయ, కాళీయ మర్దనము. గోపికా వస్త్రాపహరణము, గోవర్ధన సముద్ధరణము, గోపికా గీతలు, రాసక్రీడ, జలక్రీడ, అక్రూర సందేశము, కంసవధ. భ్రమర గీతలు ప్రచండ యాదవము, ముచికుందోపాఖ్యానము, రుక్మిణీ కల్యాణము. అను పేర్లతో విభజింప బడినది.

ఈ భాగవత హరికథను పరిమి వారివలె మరొకరు రచింప లేదు. కీర్తనలు సంస్కృత పద సమ్మేళనములు ఈకీర్తనొక యుదాహరణము.

సామ - ఆది

ప॥ సుందర నీలతమం నీరద - సుజనాధారం శ్రితమందారం॥

ఉ॥ ఇందిరా రమణ మిందు నిభానన - మిందీవర దళ విశాల నయనం॥

చ॥ కరుణా రస భరితం భవ తరణం - కమలాసన వందిత మృదు చరణం

పరమపురుష మభినవ కందర్పం - భజగోవిందం పరమానందం॥

వీరి రచనలో సీసములు లయాన్వితములై ఉయ్యాల లూగిన ట్లుండును.

భాషా పరిచయము లేని హరిదాసు పరిమి వారి కథలను కాలక్షేపము చేయ జాలడు. పద్యములందలి భావములు విపులీకరించనిదే పామరులు కథను గ్రహింప జాలరు. ఎక్కువ విషయము తక్కువ రచనలో నిమిడ్చ బడి యుండుట అను హరికథ యొక్క ముఖ్య లక్షణము ననుసరించిన వారు సుబ్రహ్మణ్యము గారు. గేయ రచన చక్కని చిక్కని కవిత్వముతో తాళాక్షర కాలమునకు సరిపోవు నట్లుండును. సామాన్య సంగీత జ్ఞానులు సహితము పాడుకొన యోగ్యముగా నుండును. ఆదిభట్ల వారి గేయములు పాడుటకు సంగీత లయ జ్ఞానము లవసరము. వీరి ప్రమీల యను హరికథ జైమినీ భారతము లోనిది, ఈ కవి గారి రచనలు నవరస భరితములై బహుళ ప్రచారములో నున్నవి. ఒకటి బాగున్నది వేరొకటి బాగులేదు అని చెప్ప జాలము, కథలన్నియు తూకముగా ఇంపుగా సొంపుగా రచింపబడినవి. గేయములకు పద్యములకు పరిచితమైన రాగములనే నిర్ణయించిరి. చందస్సులో గూడ ఈకవి ఆరి తేరిన వాడే, హరికథా లోకమునకు ఆధార భూతుడై ఈ కవి త్యాగరాజువలె బీదతనమునే యనుభవించిరట పాపము.

**1942** కామరాజు రామమూర్తి శర్మ భాగవతార్ గారి నివాసము కోవూరు, నెల్లూరుజిల్లా, తండ్రి వెంకటప్పయ్య 10-7-1905

తేది జననం. వీరికి హరికథకసింహ, హరికథా కళాప్రపూర్ణ, హరికథా చక్రవర్తి, హరికథా చతురాననయను బిరుదులు గలవు. జ్యోతిషశాస్త్ర పండితులు, వీరి గురువు బొమ్మరాజు జానకి రామయ్య గారు. సతీసుకన్య లేక ఇంద్ర గర్వభంగమను హరికథ వీరి రచన ముద్రితమైనది. వీరిరచన ఉపమానోదాహరణములతో కథాగమనమునకు అడ్డంకులు లేకుండా సాఫిగా సరళముగా సులభగ్రాహ్యముగా నుండును. ఈ గ్రంథమునకు కృతిపతి శెట్టి బలరామిరెడ్డిగారు, వీరి నివాసం కోవూరు తాలూకా లేగుంటపాడు. ఇందలి కీర్తనలు తాళమునకు సమముగా సరిపోవును. సర్వలు సులభముగా పాడుకోదగినవి.

ఈ కవి గారి స్త్రీ వర్ణన శాస్త్రసమ్మతముగా గంభీరముగా నుండును.

ఉ॥ నీలపు టుంగరంబులన! నెమ్మిదలిర్చెడి కేశజాలముల్
మేలిసువర్ణమున్నగు సు! మీ తనుకాంతి సుశంఖమే గళం
బా లలితాంగి యూరుయుగ। మారయ రంభల గేరు జూడగా
జాలనికొను మీనములె! సాటి యనందగుఁ గన్నుదోయి యా
బాల సుకన్య నెన్న నల। వాణి మనోభవుడైన నోపునే॥

వీరు భారతం హరికథా కాలక్షేపము అనేకచోట్ల అనేకసార్లు చెప్పియుండిరి. చిత్తూరు నెల్లూరు గుంటూరు జిల్లాలో వీరికి అఖండమైన కీర్తిప్రతిష్టలు గలవు.

**1946** గౌన్నాభక్తుల వీరేశలింగ దాసు వీరు హరికథకులు గూడ, బెజవాడ వాస్తవ్యులు. హరికథా కంఠీరవ బిరుదాంకితులు. గాంధీ కల్యాణం, వీరబ్రహ్మానంద జననం, గోవిందాంబ కల్యాణం, సిద్దయ్య చరిత్ర కవిగారి రచనలు. తలిదండ్రులు చిన్నమాంబ అప్పయ కవి, పండితాభిప్రాయమును తాళాభక్తుల కృష్ణమూర్తి భాగవతార్ గారు వ్రాసియుండిరి.



శ్రీమాన్ పెద్దింటి సూర్యనారాయణ దీక్షితులు

1946 శ్రీమాన్ పెద్దింటి సూర్యనారాయణ దీక్షిత దాస భాగవతార్ పశ్చిమ గోదావరి జిల్లా నరసాపురం నివాసము, కవికి కథక రత్న బిరుదము గలదు. భారతము, నలోపాఖ్యానము, పేరంటాల్లు పెళ్లి, (హాస్యరసం) అల్లూరి సీతారామరాజు, సాయిబాబా, శారదాదేవి చరిత్ర, ఆదిభట్ల నారాయణ దాస చరిత్ర హరికథలుగా వీరిచే రచింపబడిన గ్రంథ రాజములు. ముసునూరి సూర్యనారాయణ భాగవతార్ (గ్రామఫోను రికార్డిస్టు) వీరి హరికథలను గానము చేసెడివారట. తణుకు పట్టణములో అధ్వక్షేటు పోతాప్రగడ శ్రీరామరావు గారు శారద హరికథ గ్రంథము తొలిపలుకులో నిట్లనిరి. దీక్షిత దాసుగారిని ఆంధ్ర దేశమున ఎఱుగని వారరుదు, శ్రీ నారాయణ దాసుగారి వలె స్వతంత్రముగ హరికథల రచించి చెప్పి, శిష్యులకు నేర్పి ఉత్తమ హరికథా సాంప్రదాయమును పోషించుచున్న వారిలో శ్రీదీక్షిత

దాసుగార గ్రంథ శ్రేణికి చెందినవారు. వారిరచనలందు మాధుర్యమును గాంభీర్యమును సమ్మిశ్రితములైనవి. పూర్వ సాంప్రదాయములును క్రొత్తపోకడలును కలిసినవి, రాజకీయ సాంఘిక ఆధ్యాత్మికములకు సన్నిహితత్వమేర్పడినది. వారిశైలికి చైతన్యవంతమగు ప్రవాహ వేగము కలదు, హరికథల రూపమున వారు చేసిన ఉత్తమాదర్శ ప్రచారమున కాంధ్రదేశము వారికి ఋణపడి యున్నది. శారద చరిత్ర గ్రంథ ప్రారంభమున 'మనవిసేత' యను శీర్షికలో దీక్షితదాసు గారిట్లు వ్రాసిరి.

"కవిత్వము వ్రాయువాఁడు కవిననుకొను పాంచ భౌతిక మాంస పిండము కాదు. భగవంతుని యప్రాకృత దివ్యశక్తి కవిత్వమును గవి నోటఁ బల్కించును. కాన కవిపరాత్పరుని పవిత్ర సందేశమును మానవ లోకమున కందిచ్చు మధ్యవర్తి మాత్రమే "God not we the poem makes, we only tell folks what he speaks" అను నొక ఆంగ్ల కవిసూక్తియూ 'పలికించెడు వాడు రామ భద్రుండట' యను పోతన విశ్వాస వచనమును దానికి తార్కాణము. పరమాత్మలో దాదాత్మమునొందు ఋషి కాని పామరుఁడు కావ్య రచన కనర్హుడు."

ఈ కథకు యక్షగానమని పేరిడ బడెను. తౌహరాలకు 'మధురగీతి' యను నామమిడెను. రచన సంస్కృత పదసమ్మేళనము. కథ పండితశ్రేణికి జెందినది. సుచ్ఛునకొక కీర్తన తిలకింపుడు.

కల్యాణి చతురశ్రగతి

వ॥ నమో భగవతె రామకృష్ణాయ నమశ్శారదైత తృష్ణాయ॥

అ॥ కామారి పుష్కరపుర జాతాయ కామారినదృశ విజితైహికాయ॥

మిశ్ర॥ ——— ——— ——— ——— ——— ——— ——— ——— ———

చరణం॥ మానవసేవా మాధవసేవా మామదర్శ ఇతిసత్ప్రతిజ్ఞాయ
దీనజనబాంధవాయ జగద్గురు దేవాయ దీక్షితావనవజాయ॥

1946 ఉ. వె. ప్ర. తిరుమల నల్లాన్ చక్రవర్తుల వెంకట కృష్ణమాచార్యుల వారు, దరిశి అగ్రహారం, రచన అంబరీషోపాఖ్యానము సులభశైలి. సికింద్రాబాదులో శ్రీ ని వా సా ప్రింటింగు వర్క్సులో ముద్రితము.

1947 ఉదయగిరి చెన్నయ్య ఈ కవిగారి రచనము వరద రాజీయము, అనగా గజపతిరాజు కుమార్తె తుక్కాంబను శ్రీకృష్ణదేవరాయలు తిమ్మరసుమంత్రి నేర్పరితనమున వివాహమాడుట. కవి బలిజ కులస్తుడు, తండ్రి వెంకటయ్య ఆధునికమైన రచన సరళశైలి.

1948 అడిగోపుల వెంకట రంగం గారు జైమినీ భారతం హరికథను రచించిరి, కవి హరిదాసు అయియున్నాడు. ప్రకాశం జిల్లా ఈతముక్కల గ్రామం. కథ ఎనిమిది ఆశ్వాసములుగా విభజింపబడెను.

1948 జొన్నకూటి శ్యామయ్యాలు కవి గుంటూరు జిల్లా పాములవాడ నివాసం. రచన చంద్రహాస, ప్రఖ్యాత ఆధునిక కవియగు గుఱ్ఱము జాషువా గారి శిష్యుడు. సభావందనము గేయముగా రచింపబడుట ఈ గ్రంధ రచనలోని ప్రత్యేకత, మిగత గ్రంధములందు పద్యరచనలో సభావందనము గలదు. కృతిభర్త గుంటూరు తాలూకా తక్కెళ్లపాడు వాస్తవ్యులు చేబ్రోలు రామస్వామి చౌదరి. కవిత్వము సులభశైలి, ఆధునిక పద్ధతి.

**1950** ధూళిపాళ వెంకట సుబ్రహ్మణ్య కవి గుంటూరు జిల్లా చిలకలూరిపేట. సాయిబాబా చరిత్ర వీరి రచన, అతిసులభగ్రాహ్యము, అతి క్లుప్తము.

**1950** పెదపాటి కృష్ణమూర్తి బాల భాగవతార్ గారి నివాసము ఉంగుటూరు. అనసూయ, ధృవవిజయము, నెహ్రూ చరిత్ర, సువర్చలా కల్యాణము, గాంధీ విజయం, ఆంధ్రకేసరి అను హరికథలు వీరిచే రచింపబడెను. సువర్చలకథ స్వర్గీయ ప్రేయసి కంకితము. 1940 ప్రాంతమున సన్మానములు బొందినాడు, పాత్రోచిత భాష గలదు. కథ సంగ్రహముగా సాఫీగా జరుగును. వర్ణనలు, ఉపమానోదాహరణములు తక్కువ.

**1951** పుష్టా గోపాలదాసు రాజమండ్రి నివాసం, తలిదండ్రులు వెంకటరెడ్డి అప్పలాంబ. వైష్ణవ గోత్రం. రచన కబీరు చరిత్రము, రాజమహేంద్రవరమందలి గోపాలస్వామికి అకింతము. భాష తండ్రివద్ద నేర్చినాడు చందస్సు వ్యాకరణము తెలియనివాడు. రచనలోని భావమును మాత్రమే గ్రహించమని కోరినాడు కవి. తేటతెల్లమగు పద్యములో అందరికర్థమగునట్లు వేదాంత విషయములు తత్వబోధలు వ్రాసియుండిరి. క్రొత్త వర్ణమెట్లలో కీర్తనలు గలవు. ముముక్షులకు భక్తిమార్గంబును బాలురకు జ్ఞానమార్గంబును స్త్రీలకు పతివ్రతా మార్గంబును గలుగజేయు నుద్దేశ్యంబుతో ఈ గ్రంథము రచింపబడినదని కవిగారు నుడివియున్నారు.

ఈ గ్రంథమున కబీరు చర్యలు వర్ణించుచూ విద్యయొక్క ఉపయోగం విద్యాభాసం నిదురవల్ల నష్టములు భయము ధర్మము గురురహిత విద్య వలన లోపములు జన్మలు కర్మలు బేధభావము పనికిరాదనుట తారకమంత్ర

ప్రభావం, స్త్రీ అందం, శరీరం మొదలైన విషయములను గురించి వర్ణించుచూ పద్యము లనేకము గలవు, కానీ వ్యాకరణ చందస్సు దోషములు గలవు.

**1952** కొల్లవూడి మల్లికార్జునరావు రచన విరాట్ పోతూలూరి బ్రహ్మేంద్రస్వామి జీవితము హరికథ. గుంటూరు జిల్లా నిడుబ్రోలు, మరొక రచన తులసీ మహాత్మ్యము. బ్రహ్మం గారి చరిత్ర 300 సంవత్సరముల క్రింద జరిగినది. రెండు రాత్రుల కథగా భాగింపబడెను. ఈహరికథ రచించుటకు కైవల్య నవనీతము, మానసకల్ప నవనీతము, జీవ బ్రహ్మైక్య వేదాంత రహస్యమను గ్రంథములు తోడ్పడినవట.



ములుకుట్ల పున్నయ్యశాస్త్రి భాగవతార్

**1955** ములుకుట్ల పున్నయ్య శాస్త్రి భాగవతార్

**వీరి నివాసము బూదవాడ ప్రకాశం జిల్లా, తలిదండ్రులు వెంకట సుబ్బమ్మ**

శ్రీరామశాస్త్రి. తమ్ముడు సత్యన్నారాయణ గారు గూడ భాగవతారు శః కవి ఇటీవలనే పరమపదించిరి. వీరి రచనలు పెక్కుగలవు. విజయభారతం, జైమినీ భారతం (అముద్రితం), బ్రహ్మంగారి చరిత్ర, కుశలవ కల్యాణం, సీతా కల్యాణం, కబీరు, రుక్మాంగద, కాళిదాసు, శ్రీనివాస కల్యాణము, పల్లికల్యాణము, శ్రీకృష్ణ గారడి, విప్రనారాయణ, భూకైలాసం, వాల్మీకి, కన్యకా పరమేశ్వరి, పురూరవ, తెనాలి రామకృష్ణ, శంకరాచార్య, మాయా మహేశ్వర, నరనారాయణ, శశిరేఖ, కృష్ణ పారిజాతం, త్యాగరాజు, పోతన, వేమన, శివాజి, నేతాజి, రాణాప్రతాప్, శ్రీకృష్ణ దేవరాయలు, మూడున్నర వజ్రం, క్రివునిరాయబారం, గాంధి, శబరి మొదలగునవి. వీరు చాలామంది శిష్యులను గూడ తయారు చేసిరి. వీరి కవితలోని ముఖ్యమైన గుణములు మాధుర్యము ప్రసాదము, కవిత్వానికి యింతకంటే యింకేం కావాలి. భాష సులభశైలిలో ధారాళంగా ద్రాక్ష మధురంగా ముందుకు నడుస్తూ వుంటుంది. వీరికీర్తనలు వంపులు సొంపులు కుదింపులు బిగింపులలో మలచబడి ఎంతో ముచ్చటగా వున్నవని శ్రీజంధ్యాల పాపయ్య శాస్త్రిగారు, గాంధి హరికథలో శుభాశంసనము నందు నుడివి యున్నారు. వీరి కథా రచన ఆధునిక భావ కవిత్వము వలె గోచరించును. భావపూరితమైన కీర్తనలు చక్కని శైలిలో నవరస భరితములై సర్వజనాహ్లాదకరముగా నుండుననని వేమన హరికథలో ప్రారంభమున సంగీత సాహిత్య భావ సమ్మేళన చక్రవర్తి మహావాది వెంకటప్పయ్య గారు తమ అభిప్రాయమును వ్రాసి యుండిరి. వేమన హరికథలో ప్రథమమున పున్నయ్యగారు తన మనవిని ఇట్లు ఒక సీసములో దెల్పిరి.

సీ॥ ఆంధ్ర గీర్వాణము। లాకాశ కుసుమముల్
పంచకావ్యంబుల। పఠనమరుదు
శబ్దార్థ విజ్ఞాన। సంపద శూన్యంబు
గణయతిప్రాస ల। క్షణము సున్న

సర్వరాగ యుక్తమౌ। సంగీత మానాస్తి
భరత శాస్త్రము చెవి। బడగలేదు
భావ గంభీర శ। బ్ద ప్రయోగమును రాదు
రచనా చమత్కార। రుచి హుళక్కి

గీ॥ ఇట్టి నాకైత బుధుల మె। ప్పింప దంచు
నామదికి తెలియు నైన భా। షామ తల్లి
సేవజేయుదికై కృషి జేయు చుంటి
తప్పు లెంచకు దయ్యె వి। ద్వాంసు లార॥

కవి కుండవలసిన లక్షణము లేవో కవిగారే పైపద్యమున నుడివిరి. కానీ అవి యేవియు తనకు లేవనెను. అట్లు లేవనుచునే హరికథా రచనలో ఇతర కవులకన్న మిన్నగా కథలను రచించి హరికథా వాఙ్మయమున అగ్ర స్థాన మలంకరించెను. ఇది వీరిలోని ప్రత్యేకత, వీరి కీర్తనలు జాగాలు విడచి అంత్యమిత్రలతో పాడుకొనవలసి యుండును. మృదంగిష్టునకు పని గల్పించు నవిగా యుండును.

ఆనంద భైరవి ఆది

ప॥ ప్రవిమల రూపం పావన చరితం
భజామి తవ పాదం। జయ్ నమో గాంధి దేవమ్ ॥ప॥

అ॥ అవిరళ సత్యాగ్రహ మంత్ర ఫలం
ఆత్మ స్వాతంత్ర్య వాంఛిత సఫలం ॥ప్ర॥

చ॥ విలసిత ఖాది దివ్యాంబర ధరం
వేదజనిత గీతార్థ ప్రచారం

కలుషిత హరిజన దుఃఖ విదారం
కౌసల్యాత్మజ నామ వినోదం॥

మిశ్ర॥ కలిత విశ్వమానవ కల్యాణం - కరుణారస పరిపూరితనయనం॥
సలలితశాంతమయం శ్రీపున్నయ్యశాస్త్రి భాగదేయం
సతరుణ గేయం॥

జీవితము తాత్కాలిక కష్టములతు లోనైను సత్య నిర్మల ధర్మ మార్గమున గడపిన వాడే ధన్య జీవుడని బోధించు ఈ క్రింది పద్యము లో చక్కని యుదాహరణములు ఉపమానములు పొల్చిన కవి సమయోక్తిని ప్రశంపింప వలయును. గాంధీకి బాల్యమున నీతి గరపు సందర్భములోని దీపద్య రత్నము.

సీ॥ శాంతి యుతంబైన। సత్యాగ్రహము బూను
ప్రహ్లాదు కీర్తికి। భంగమేమి
సత్య వ్రతమునకై। సర్వ నాశన మైన
అల హరిశ్చంద్రు దే। హాని బొందె
రాజ్యంబు బాపి ఘో! రారణ్యముల కేగు
రామచంద్రునకు లో। టేమి గల్గె
జనకునకై బ్రహ్మ। చర్య వ్రతంబూను
ఆప గాత్మజునకే। లోప మయ్యె

గీ॥ బుడుతనిన్ సంహరింప పా। ల్పడు త్యాగ
శీలు రుక్మాంగదున కేమి చేటొదవెను?
నిత్య నిర్మల సద్ధర్మ నియతి గల్గు
ధన్యజీవుని జన్మ సా। ర్థకము తండ్రి॥

భక్తి ప్రబోధకము లైన కథలే గాక చారిత్రక రాజకీయ హరికథలను నయితము ఎక్కువగా రచించిన కవిగారు వీరొక్కరే. పామర జనములలో వీరి హరికథలు బహుళ ప్రచారములో నున్నవి. భాష సులభ గ్రాహ్యము గాన కథకుడు విడమరచి చెప్పనవసరము లేదు. చర్విత చర్వణముగా ఒక కవి రచించిన కథలనే మరల రచించక ఈకవి ఆధునిక ప్రజల యభిరుచికి తగినట్లు క్రొత్త కథలను రచించెను. కాళిదాసు, వాల్మీకి, శంకరాచార్య, వేమన, త్యాగరాజు, క్రిప్స్ రాయబారము, కృష్ణదేవరాయ మొదలగు రాజకీయ నాయకుల చరిత్రలు కవుల చరిత్రలు రచించుట లోనే కవిగారి లౌకిక జ్ఞానము వెల్లడి యగుచున్నది. శబరి హరికథ అముద్రితము. ప్రార్థనాదిక గేయములు వీరి రచనలో క్లుప్తము. ఓపికలు లేని ఈ కాలపు ప్రజల మనోభీష్టములకు శాస్త్రిగారి కథలు అనుగుణ్యములు.



తల్లావఝల వెంకటేశ్వర గుప్త భాగవతార్

1955 తెల్లాకుల వెంకటేశ్వర గుప్త భాగవతార్ గుంటూరు జిల్లా తెనాలి నివాసం. తలిదండ్రులు శాయమ్మ వెంకయ్య, జన్మ స్థలం కనిగిరి తాలూకా చీమ్మకూరు. సంగీతాభ్యసనం, ఉప్పలపాటి అంకయ్యో వడయార్ గారి వద్ద. బీదవిద్యార్థి విద్యార్థినులకు కథలు నేర్పించెను, విద్యా దానకర్ణ బిరుదము పొందెను. తెనాలి పెనుగొండ గుంటూరు మొదలగు ననేక పట్టణములలో వైశ్యబృందములు దాసుగారికి ఘనసన్మానములు గావించిరి. రచనాశైలి ప్రజాను రంజకము, మృదు మధురము సులభగ్రాహ్యము గీతమాలికలు గలవు. కీర్తనలు త్యాగరాజ కృతులను బోలి యున్నవని పండితులు నభిప్రాయము లొసగి యుండిరి. రసపుష్టికై కథలు కల్పన చేయ బడినవి. పాత్రోచిత భాష గేయములలో పాటించబడినది. సంవాద గేయములు గలవు. ప్రథమ రచన చంద్రహాస, ఇతర రచనలు. శివలీల, వాసవీకన్యకా పరమేశ్వరి చరిత్ర, లక్ష్మీ చెన్నకేశవుల కల్యాణము, మైరావణ, పల్నాటివీర భారతము, (శీతాకల్యాణము అముద్రితము). శివలీలయనగా పార్వతీ పరమేశ్వరులు తమభక్తులగు ధర్మపురి రాజదంపతుల బరీక్షించుట, భాగవతారిణు లెక్కువగా తయారగుటకు వీరే కారణభూతులనుటలో అతిశయోక్తి యేమియు లేదు, అందుకు వీరు అభినందనీయులు.

1956 దండు వెంకురెడ్డి నెల్లూరు జిల్లా తిమ్మనగారిపాలెం, రచన కాళహస్తి మహాత్మ్యము, కాళహస్తీశ్వరునకే యంకితము. కవి వాస్తు హస్త సాముద్రిక శాస్త్ర పండితుడు గూడ. నామ సిద్ధాంతము వచనములో నేయున్నది. ఇందలి భావ తాత్పర్యములను మాత్రమే గ్రహింపమని గ్రంథ ప్రవేశికలో పిల్లలమర్రి వెంకట హనుమంతరావు M. A. గారు వ్రాసిరి. సులభగ్రాహ్యము. గ్రంథముద్రణ గుంటూరు శాంతిశ్రీ ప్రెస్సునందు జర్గినది,

1958 పెళ్లూరు మస్తానయ్య రాకా కుంభార్ దాసు చరిత్రము హరికథను రచించెను. నెల్లూరు నివాసం, సీలి రఘుపదాసు గారి శిష్యుడు, తండ్రి కాళయ్య శెట్టి బలిజ కులస్థులు. ఈకథకు పండరీపుర మహాత్మ్యము లేక సింహపురి వర్ణన అనిగూడ నామధేయము గలదు. పద్యరచన తక్కువ, సింహపురి యనగా నెల్లూరు. నెల్లూరు రంగనాథుని పాండురంగనిగా వర్ణించబడినదీ కథలో.

1959 నేమాన వెంకట కోటీశ్వర శర్మ B. A. తిరుపతి నివాసము, కవిరత్న బిరుదు, రచన శ్రీనివాస కల్యాణము హరికథ. పీఠికలో నిట్లు వ్రాసెను, వృత్తి వలన హరిదాసుని కాకపోయినను భక్తివలన హరిదాసుగా మారితిని. కాశీ కృష్ణమాచార్యుల వారు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి పండితాభిప్రాయములు గలవు.

1960 సోమ సాంబశివ శర్మ గారిది మునిసత్రిపాలెం నెల్లూరుజిల్లా, రచన శంకర విజయం హరికథ. బిరుదు సుకవిత్వ విభూషణ తల్లి మహాలక్ష్మమ్మ తండ్రి కృష్ణయ్య హరితస గోత్రం. సంగీతము నేర్పిన గురువులు గుంటూరు పట్టాభి రామశాస్త్రి వేమూరి కృష్ణయ్య. కవితా గురువు ఆవంచ నరసప్పయ్య శాస్త్రి. ఇతర రచనలు త్యాగరాజ చరిత్ర, రామాయణము (అలభ్యము) బాలకాండ, వత్సలా పరిణయం. కవి హరికథలు చెప్పును. గ్రంథమున ప్రస్తావనలో కవిపై దుష్యక కవితా నైపుణ్యుడని గురూపదిష్ట మంత్రోపాసనా ప్రభావము గలవాడని నెల్లూరు V. R. కళాశాలాంధ్రోపన్యాసకులు ధరణికోట వెంకట సుబ్బయ్య గారు వ్రాసిరి. వీరి కథ శంకర విజయం 7 ఆశ్వాసములలో ముగిసెను. వృత్తములు అరుదు, ఆధునిక రచనా పద్ధతి, సులభగ్రాహ్యమైననూ కవిత్వము పేలవముగా లేక గాంభీర్యముగా నుండును.

**1964** కడలి వీరదాసు గారి నివాసము భీమవరము పశ్చిమ గోదావరి జిల్లా. రచన శివలీల హరికథ, గురువు ఆదిభట్ల నారాయణదాసు, సంగీతము నేర్పిన గురువు ఆదిని హరికామయ్య, కవితా గురువు చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి. భారతం 40 హరికథలుగా రచించితినని పీఠికలో వ్రాసెను. ఈ శివలీల భారతసారం అను గ్రంథమునుండి గైకొని రచించిన వినోద విషయము. రచనసరళమైనశైలి, భక్తిరస పూరం, సుగమ బోధకం, సహజ పాండిత్యం. దాసుగారి కథాకథనం గాంభీర్యం, తన్మయత్వముగా కథాగానము చేసెదరు. రమ్యమైన రచన, చమత్కార పద జాలము గలది. మచ్చువకొక కీర్తన పరిశీలింపుడు.

యమున - ఆది

ప॥ ఆనంద కరము సదాశివలీల నాలింపుడీ చెవులార॥

అ॥ గాన లయ నాట్యాభినయ పూరిత కథయే కథబుధులార॥

చ॥ ఘోర కలి కల్మషౌఘ శమనమగు కోరి దీని వినునెడ॥
వారిజ భవాది దేవుళ్లకేని భవహర మన్నివిధముల ॥మహా॥
ఉన్నతాదర్శ భావప్రకటన నొప్పారునది హరికథ
తిన్నగ మానవ సంస్కృతి చాటునదే వీరదాస కృతిబహుధా ॥అ॥

**1967** రావుల శ్రీరాములు కవి నివాసం చీరాల గుంటూరు జిల్లా, తల్లి లక్ష్మీదేవమ్మ తండ్రి సుబ్బయామాత్యుడు కౌండిన్యస గోత్రము రచన మేధనరాముడను శివభక్తుని చరిత్రము అను హరికథ శిధిలావస్థలో నున్న పాతవ్రాతపతి నాధారముగా రావుల దేవేంద్ర నాధం గారి గ్రంధమును 1967లో ముద్రింప జేసెను. ఈ గ్రంధమునకు చీరాల ప్రతాప వెంకట

సుబ్రహ్మణ్య శాస్త్రి గారు అభిప్రాయమును వ్రాసి యున్నారు. కృతికర్త సంస్కృతాంధ్రములందు దిట్ట. పద్యములు సంస్కృత పద భూయిష్టములు తెలుగు సామెతలు గలవు. కృతికర్త వంశము భోగభాగ్యములలో దానధర్మ వితరణములో పాండిత్యములో చాల గొప్పది అని గ్రంథమును బట్టి తెలియుచున్నది.

**1970** K. శివస్వామిరెడ్డి భాగవతార్ గారి నివాసము ప్రకాశం జిల్లా చీరాల, తండ్రి వెంకయ్యదాసు తల్లి మాణిక్యమ్మ, గురువు ములుకట్ల పున్నయ్యశాస్త్రి భాగవతార్. సీస పద్యమున వ్రాయదగు విషయమును క్లుప్తముగా గీతపద్యమున రచించగల సమర్థుడు. వీరి రచన రామాంజనేయ యుద్ధం: —

గీ శిబియు తన మేని కండలు! చెండి యిచ్చె
బలి మహారేడు పాతాళ! బంది యయ్యె
అల హరిశ్చంద్రు డధిక బా! ధలను జెందె
నలుడు దుర్గమాటవులలో, నలవటిల్లె॥

**1973** బండ్ల సుబ్రహ్మణ్య పండిట్ వేటపాలెం రచన బుద్ధ చరిత్ర యక్షగానము (బుర్రకథ).

  



పాటూరి మధుసూదనరావు గారు

1973 పాటూరి మధుసూదన రావు గారు జననం 31-7-1909 తేది వెలనాటి వైదికి. తల్లి కనకరత్నమ్మ తండ్రి సుబ్రహ్మణ్యము. వీరి రామాయణమును ప్రింటుచేయించిన వారు ఎండోమెంటు బోర్డు కమిషనరు కె. వాసుదేవరావు గారు. అంకితము భద్రాద్రి రామునకు. 1930లో కవిగారు ఉప్పు సత్యాగ్రహములో పాల్గొని జైలుకు వెళ్లిరి. అలీపురం జైలులో ప్రథమకథ శ్రీకృష్ణజననం రచించెను, 1944లో విశ్వనాధ సత్యన్నారాయణ గారి అధిపత్యమున గండ పెండెరము బడసెను, హరికథా కేసరి, హరికథా స్వతంత్ర, హరిదాస హంసయను బిరుదములు పొందెను. 24-3-56 తేదిన ఇండియా ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూగారితో ఇష్టాగోష్ఠి జరిపెను. కనకాభిషేకము బడసెను. పార్వతీ పరిణయము, హనుమత్కల్యాణము, శివాజీ, యోగి జవహరు జననం మొదలగు హరికథలు రచించెను. సాక్షి దేవచరిత్రమను యక్షగానము (హరికథ) వగైరా వీర్ని

రచించ బడినవి. సాక్షిదేవ చరిత్రము పొన్నూరు స్థల పురాణము దెల్పును. భావనారాయణ స్వామి పొన్నూరులో వెలయుట ఇందలి ఇతి వృత్తము. 1956 ఏప్రిల్ నెలలో రవీంద్ర భారతి హాలులో దాసుగారు కథాగానం చేసిరి. కవి మొదట సావిత్రి హరికథను ఒక వృద్ధ హరిదాసువద్ద అభ్యసించి నానని రామాయణ కథా గ్రంధమున తెలిపియుండెను. కానీ ఆ గురువు పేరేలనో వెల్లడించలేదు. సంస్కృతములో కొన్ని కథలు రచించెనట, ఆధునిక పద్ధతిలో కథారచన సాగినది. ఆదిభట్లవారి రామాయణంలో యుద్ధకాండ క్లుప్తము. మోక్షగుండ రామాయణ కీర్తనలు కొన్ని తాళమునకు సరిపడవు. ఇట్లు ఇతర రామాయణములందలి అసంపూర్ణతలను శ్రీరామ లీలాయనము సంపూర్ణముగావించినది. సామాన్య జ్ఞానులకు సయితము వీరికథలు సులభ సాధనములు. భాగవతమును శ్రీకృష్ణలీల లన్నట్లు, రామాయణము రామలీల లుగా వర్ణించ బడెను. కల్యాణ లీల, యాత్రాలీల, సమరలీల అని కథ విభాగింపబడినవి. ఆరు కాండలు ఆరు లీలలుగా పేరు మార్చబడెను. ఈ నామధేయములను బట్టియే కవి స్వరాజ్య సమరంలో దూకి స్వాతంత్ర్య మపేక్షించినట్లు కవి త్వరంగములో గూడా స్వతంత్రను ప్రదర్శించినాడు.

మచ్చునకొక సీస రచనను పరిశీలింపుడు:—

సీ॥ బైరాగియౌ రామ! భద్రుడుఁ నినుజేరు
మాటన్న వినుము కుం। దేటి కొమ్మ
అలినిం గోల్పోవు। వనమర్దుఁ డిటఁజేరు
ననుసెల్ల కల్ల గొ। డ్రాలి శిశువు
కడుపు కక్కుర్తికై। కందము లానెడి
ఘనుఁడిటుఁ జేరుటా। కాళ సుమము

కోతులనాడించుకొని। బ్రతికెడు వాఁడు
మముఁ జేరుటన నెండ। మావి నీరు

గీ॥ ఇసుకలో నూనె దీయఁగా। దేల కోర్కె
తమ్ముని౦ గూడి బ్రతికెడు। దారిలేని
వాఁడు జలధిఁ ధరించి యీ। వాడఁ జేరు
నన్న నీయాశయంచె ని। రాశ్రయనుగ॥

ఈ పైపద్యమును లంకలో రావణుడు సీతతో ననును. ఉపమానో దాహరణల పుట్ట వీరి కవిత్వము. హరికథలే గాక బ్రహ్మవిద్యా ప్రదీపక భావతరంగిణి మధుస్మృతి దేవిస్తుతి అను ననేక నితర గ్రంథములంగూడ రచించెను.

1973 పోలంరాజు సీతారామయ్య గారు ప్రస్తుతం గుంటూరు నివాసం. తండ్రి ఈశ్వరయ్య, సంగీత సాహిత్య కళోపాసక బిరుదు. రచనలు శబరిమల అయ్యప్ప చరిత్ర, సాయిసాబా, సతీఅనసూయ, మహిషాసుర మర్దని (అముద్రితము). శబరిమల అయ్యప్ప చరిత్ర యందలి దొక కీర్తన యిది!—

హిందోళము - ఆది

ప॥ పరమ పద నివాస శ్రీనివాస - పాలయమాం నిజభక్త
మనోల్లాస - చిద్విలాస॥

అ॥ కరుణతో మామొరవిని భక్తుల - కాపాడగ వేరెవరున్నారురా॥

మిశ్ర॥ గరుడగమన సురవర హరనుత మృదుచరణ

మకర మద హరణ! పరమ పురుష శేష శయన

వరదా పాహిమాం పాహిమాం పాహిమాం

గమదమదమ గమదమగమగస సగమగామ

గమదమ గమదనిపీ। సగమగామ గమగస దనిసా।

సగస నిపని' దనిద మదమ గమగస॥

వీరు సంగీత విద్వాంసులు. హరికథలు చెప్పెదరు. అండర్ లైను గీచిన చోట్ల దురితముగా పాడవలెనని యర్థము.

**1976 వాడరేవు సీతారామాంజనేయ భాగవతార్, B. A.**
(ఈ వాఙ్మయ గ్రంధకర్త) జననం 20-2-1924. రచనలు సీతిపద్యములు హనుమద్రాయబార హరికథ, శైలి సులభగ్రాహ్యము. మచ్చునకొక కీర్తన పద్యము పరిశీలింపుడు.

మో హ న - ఆ ది

ప॥ నిన్నేనమ్మితిరా రామ - నన్నేడబాయకురా రామ ॥ని॥

అ॥ నిన్నునమ్మితిని త్రికరణశుద్ధిగ - నన్నుబ్రోవ రావేర రఘువీర ॥ని॥

చ॥ మున్ను విభీషణు గాచిబ్రోచుటయు - పన్నుగశబరికి మోక్ష మిచ్చుటయు

ఎన్నగ హనుమను నాదరించుటయు - నన్నియువినినే నమ్మితినామది॥

మి॥ నన్నునీవు చేపట్టుకున్నమరి నాకు ఓక్కుటుకీ యెవరన్నా

చిన్నమువేడగ వెన్నుడనిన్ను - సీతరామ అంజనేయు బ్రోవగ ॥ని॥

ఉ॥ వాలముగల్గియున్ మిగుల। వంకరమూతిని రామభక్తుడై
శీలముమంచిదై చెలగి। సేవలుసేయుచె ధ్యేయమై తగన్
మేలగు సీతనున్ వెదకు। మీయనలంకనుగాల్చు దేవుడై
ఆలము సేయువాడునగు। నంజని పుత్రునివేడెదన్ మదిన్॥

**1976 శ్రీపతి పండితారాధ్యుల సాంబమూర్తి భాగవతార్**

జన్మస్థలం నెల్లూరు జిల్లా మాచవరం. ప్రస్తుత నివాసం, నెల్లూరు. ప్రఖ్యాత సినిమా నేపథ్య గాయకుడు S. P. బాలసుబ్రహ్మణ్యం గారు వీరి కుమారుడే, ఆరాధ్య వంశము నియోగి శాఖకు చెందినదే. పంచకావ్యములు పఠించిన పండితుడు. హరికథారచన లేమియు చేయలేదు, కీర్తనలను మాత్రము వ్రాసియున్నాడు. (అముద్రితము) కీర్తనలు కృతిసంప్రదాయముగా సంస్కృత పద జాల సమ్మిశితములై భావగంభీరత గల్గియున్నవి.

కాఫి - ఆది

ప॥ ఇంకనైన నను కరుణింపుము అక - లంకచరిత రఘువీర కృపావర॥

అ॥ జంకుగొంకులేక నీపద జల - జంబులకడ జాగి మ్రొక్కి వేడితి॥ ఇం॥

చ॥ మానంబును అభిమానము వదలియు - మానుగ కక్షను జోలెదవిల్చియు
జానకీరమణ నిను బాడుచును - అనూనచరితని చ్చమెత్తుచుంటిని॥ ఇం॥

చ॥ భరియింపగజాలను సంసారవు - దరిగానరాదు దయాసా
గర శ్రీపతి పండిత నుతచరితా - కరుణజూచి కరినిగాచినటు నను॥ ఇం॥

ఈ కీర్తన దాసుగారికి అభిమానమైనట్టిది.

భిక్ష అనగా త్యాగరాజోత్సవములు చేయుటకై చేయు భిక్షాటన. స్వార్థతతో చేయునది పాపం. నిస్వార్థ సేవ పుణ్యముగదా!

ప్రథమ హరికథ యనబడు వరద రామదాసు గారి రచనయగు రామదాసు చరిత్రలోని కవిత్వము మచ్చునకు క్రింద పొందు పరచితిని దయతో పరికింపుడు.

తో హ రా :

నవాబు తానీషా తక్తుపేరియా। నగరమేలుచుండా
మక్కువగు దివాను లాతనికి। మాన్యులు బహు సజ్జనులు
అక్కన మాదన్నయు ననియిద్దరు। నన్నదమ్ము లతిప్రియులు

క॥ అనఘుల గార్యవిధిజ్ఞుల
సమరక్తుల బితృపితామహ క్రమమున వ
చ్చిన విప్రుల మంత్రులుఁగా
నొనరించెను గార్య సంప్రయోగము కొఱకున్॥

తో హ రా :

ఈతుక్డిలో జేరినగ్రామము నేలకొండపలి యందూ
ఖ్యాతిగ లింగనమంత్రి వసించెను గాపురముగ నందూ
లింగనమంత్రి వివాహంబయ్యెను మంగళవతి కామాంబన్

—— —— —— —— —— —— —— —— —— —— ——

దీని ననుసరించి వ్రాసిన పింగళిదాసు గారి కవిత్వము:—

తొ హ రా :

శ్రీమించిన నెలకొండపల్లెలో। శిష్టజనులు పొగడగను
కామాంబకు గోపన్న జనించెను। కమలాక్షుని పదమునను
ఆత్రేయస గోత్రంబున గంచె। ర్లాంధ్రార్యుల వంశమునన్
పుత్రుఁడగుచు లింగనమంత్రికిఁ దా। బుట్టెను గోపన్నయనన్

ఆంధ్రమున గ్రంథాలయములలో వందల కొలది హరికథా గ్రంథములు గలవు. అవియన్నియు ఈ గ్రంథమున వివరించుట దుర్లభము. కవి కాలాదులు తెలియని అముద్రితములైన గ్రంథము లనేకములు గలవు. గుంటూరు జిల్లా పమిడిపాడు నివాసం రావి హరిచాదరి గారిచే శకుంతలా కల్యాణం, మహాదేవుని విశ్వరూప దర్శనం, శక్తిమహాత్మ్యం, గణపతి రాయబారం హరికథలు రచింపబడినవి.

1954 లో పిడుగురాళ్ల వాస్తవ్యులు స్వామి కేశవతీర్థగారి పద్యరచన, వారి శిష్యులు పల్నాడు తాలూకా బ్రాహ్మణపల్లి వాస్తవ్యులు రాజశేఖరుని లక్ష్మీపతిగారి గేయరచనతో కొన్ని హరికథలు రచింపబడియున్నవి. స్వామి రామతీర్థ భక్త కన్నప్ప ముద్రితము. మిగత కథలు పోతన, మార్కండేయ ప్రహ్లాద, రంతిదేవ, తులసీదాసు, జ్ఞానదేవ, పరీక్షిన్ మోక్షము, రాజర్షి రాణా ప్రతాప్ మొదలగునవి అముద్రితములు.

హైదరాబాదు నివాసులు పంచాగ్నుల విశ్వనాథ భాగవతార్ సుబ్రహ్మణ్య శాస్త్రి గారు కొన్ని హరికథలు రచించిరట, ఇంకనూ చాలామంది హరికథలను రచించియున్నారు. విజయవాడ నివాసం తిరుమల్లాన్ చక్రవర్తుల సంపత్కుమార జగన్నాథ తిరువెంగళాచార్యులు గారు రామాయణం,

భారతం, సత్యభామా పరిణయం, రుక్మాంగద, గోదాపరిణయము, శోభనా చల మహాత్మ్యమును రచించిరి.

1907 లో ఒంగోలు తాలూకా కొత్తపట్నం నివాసి గొల్లపూడి రామ లింగశాస్త్రి జయతుః సీదాను, బొమ్మరాజు శీతారామయ్య రామాయణము, ధేనువకొండ సుబ్బారావు ద్రౌపది (అముద్రితము), పత్తిగొడుగు రాఘవ రాజు జైమిని భారతమును (ముద్రితము), జంధ్యాల పాపయ్యశాస్త్రి రామ దాసు త్యాగరాజు పోతన (అముద్రితములు), వీరి కథలను కూచిబొట్ల కోటేశ్వరరావు గారు చెప్పుదురట. అద్దేపల్లి లక్ష్మణశాస్త్రి భాగవతార్, శిరి యాళ, కుప్పా ఆంజనేయశాస్త్రి జయదేవ చరిత్ర కన్నప్ప (ముద్రితములు) హరికథలను రచించి యున్నారు. జూలూరి అచ్యుతరామశాస్త్రి మిరాబాయి హరికథ, అచ్యుతపురి నివాసుడు ముడుంబి నృసింహాచార్య కవి కొన్ని హరి కథలు రచించిరి.

1924 లో ఒంగోలు తాలూకా మద్దిపాడు నివాసి మద్దిపాటి వీర రాఘవయ్య హనుమద్విజయము. 1894లో అయోధ్యాపురివాసి రా. ఠ. రామసింగు గారిచే రచింపబడి మద్రాసులో పమ్మి త్యాగయ్య శెట్టి గారి ముద్రా క్షరశాలలో ముద్రించబడిన కబీరుదాసు చరిత్ర, 1969 లో ములుకట్ల పున్నయ్యశాస్త్రి గారి సోదరుడు సత్యనారాయణ శాస్త్రి గారు రచించిన మారుతీ పరిణయము యాజ్ఞవల్క్య మహర్షి చరిత్ర, గణపతి కల్యాణము న్నూ రచింపబడినవి.

1973 లో వసుమర్తి సుబ్బరాయుడు గారిచే రచింపనడిన పుండరీక చరిత్రమును యక్షగాన కళానిధి బిరుదాంకితుడైన తెల్లాకుల వెంకటేశ్వర గుప్తగారు పరిష్కరించి యున్నారు. 1927లో పురాతన శైలిలో ఆర్వేల

నియోగి కేశిరాజు వెంకట సుబ్బారాయకవి పశ్చిమ గోదావరి జిల్లా రావూరు పాడు నివాసులు భద్రాద్రి రామాయణం హరికథను సంక్షిప్తముగా రచించెను. వంటెద్దు లచ్చయ్య మయూరధ్వజ, 1921 లో అక్కపెద్ది సుబ్రహ్మణ్య శాస్త్రి ఇందుమతీ పరిణయము, 1937 లో ముత్యాల వెంకట జనార్ధనరావు పిఠాపురం నివాసి కుసుమహరనాథసేవ, మరియు నెల్లూరు వర్ధమాన సమాజ గ్రంధాలయములో, వేటపాలెం గ్రంథాలయ కేటలాగులలో తెలుపబడిన రచనలు ఈ క్రిందివి:—

ముక్కంటి నృసింహదాసు అన్నదాన ఫల మహాత్మ్యం, వారణాశి శివరామయ్య అభినవ నాగ తీర్ధ మహాత్మ్యము, 1910 లో బొడ్డు సుదర్శన దాసు కణ్ణన్ చరిత్ర, చొక్కామేళుని చరిత్ర, దామరాజు పుండరీకాక్షుడు కలి యుగ ప్రహ్లాద, కొరుపల్లి శివరామదాసు కుచేల, అహోబల కవి గరుడా చలము, వరగంటి వెంకట రమణయ్య గోమాబాయి చరిత్ర, మాంబలం రంగదాసు ధృవ చరిత్ర, తుమ్మల సీతారామమూర్తి నామదేవ చరిత్ర, వసుమర్తి వారి పార్వతీ పరిణయము, హరిభజన శింగరిదాసు పెద్దదాసుని చరిత్ర, మద్దిపాటి రాఘవశర్మ హనుమద్విజయము, ఆదినారాయణ పాత్రుడు వరాహుని చరిత్రము, మోక్షగుండ రామాయణకర్త శాస్త్రి నారాయణశర్మ వాసవకన్య, 1909 లో గోదావరి ప్రాంతం విశ్వానరాయపురం నివాసం కస్తూరి శివశంకర కవి శంకర రామాయణం (ఇందు నామసిద్ధాంత మెక్కువ) నారాయణ వెంకటరమణయ్య సీమంతిని చరిత్ర, వేలూరి కన్నయ్య సుభద్ర, శేషాచార్యులు హరిశ్చంద్ర, కొంపల్లి రామలింగకవి హైమవతీ విలాసము, అచ్యుతుని వెంకటచలపతి గారు బాలాంజనేయము రచించియున్నారు. జనమంచి లక్ష్మీన్నారాయణ గౌతమోపాఖ్యానం, ధరణికోట సుబ్రహ్మణ్యం ఇంద్రాహల్య విలాసం, వసుమర్తి యజ్ఞనారాయణ జానకీ పరిణయము, ఉయ్యాలవాడ రామచంద్రయ్య రామచరిత్ర, వందటి నాగదాము ద్రౌపదీ

వస్త్రాపహరణము, పాలపర్తి కృష్ణదాసు కుచేల, 1928 లో పొన్నూరు దగ్గర పెదపాలెం నివాసులు స్వర్ణ సుబ్రహ్మణ్యంగారు పార్వతీ పరిణయమును వ్రాసియున్నారు. ఇది శివకథ అయిననూ దీనిని హరకథ యన సబబుగాదని గ్రంథమున సోదాహరణముగా విమర్శించి గ్రంథమునకు హరికథ యని నామమిడినారు. ముక్కువెళ్ల నరసింహదాసు పార్వతీ పరిణయము, (దీనికి శివకథయని నామకరణము చేయబడినది). నెల్లూరు నివాసి పిళుపాటి వెంకట నారాయణశర్మ దివోదాసు అను హరికథ, అమ్ముల విశ్వనాధ భాగవతార్ సావిత్రి, రేపల్లె తాలూకా బేతపూడి ప్రకాశం కొన్ని హరి కథలు, రాయలసీమ ప్రాంతవాసులు బాగేపల్లి అనంతాచార్యులు 13 హరి కథలు (వీరు ఆదిభట్ల వారికి పూర్వులట). ప్రయాగ నరిసింహశాస్త్రి కొన్ని హరికథలు, లింగంగుంట సీతారామయ్య గండకి, సతీసులోచన అను హరికథలు, రచించి యుండిరి. ఇట్లనేక వందలమంది హరికథలను హరికథా వాఙ్మయమునకు సేవచేసినట్టివారును గలరు. గ్రంధాలయములందు గూడ హరికథలు యక్షగానములు బుర్రకథలు కలిపి ఒకేచోట అమర్చి యున్నారు. ఇందునుబట్టి ఇవన్నియు యక్షగాన కుటుంబమేయని ప్రజలు పరిగణించుచున్నట్లు విదితమగుచున్నది.

## ముగింపు :-

గాంధీకి జాతిపితవలె నన్నయకు ఆదికవివలె ఆదిభట్ల నారాయణదాసు గారికి "హరికథా పితామహ" యను బిరుదు సార్థకమైనది. కానీ హరికథలు దాసుగారికి పూర్వకాలము నుండియూ ఆంధ్రదేశమున వ్యాప్తిలో నున్నవని చరిత్ర తెలుపుచున్నది.

రామ నృసింహదాసుగారి చరిత్రను వారి సోదరపుత్రుడు మనుమడు సీతా రామయ్య అనునతడు వ్రాసియున్నాడు. వీరు గోల్కొండ వ్యాపారులను

బ్రాహ్మణులు. నృసింహదాసుగారు క్రీ. శ. 1832 సం॥లో నిర్యాణమొంది రని అందు తెలియబరచబడి యున్నది. దాసుగారు నలుబదిఏండ్లు జీవించి యుండిరట. దీనినిబట్టి పరిశీలించినచో తూము నృసింహదాసు గారు తిరు వయ్యూరు చేరునాటికి త్యాగరాజస్వామి గతించియుండునని తెలియుచున్నది. రామదాసు చరిత్రను ముద్రించిన మద్రాసు R. వెంకటేశ్వర కంపెనీవారు నిర్ణయించిన వరదరామదాసు గారు భద్రాద్రి చేరిన కాలము శా. శ. 1574 (క్రీ. శ. 1652) సరిగాదని తెలియు చున్నది.

అట్లైననూ 18వ శతాబ్దము చివర వరద రామదాసు గారున్నట్లు నిరూ పితమగుచున్నది. గాన ప్రథమ హరికథ వారి రామదాసు చరిత్రమే యని నిర్ణయింప వచ్చును. ఈ గ్రంథమున 20 యక్షగానములు 2 బుర్రకథలు 101 హరికథలు పరిశీలించ బడినవి. హరికథా కవులు 102 మంది పేర్లు గలవు.

హరికథా రచయితలలో కులముల వారీగా విభజించినచో ఈ గ్రంథ మున కవుల కాలపట్టికలోని వారిలో రమారమి నియోగి బ్రాహ్మణులు 15 మంది, వైదిక బ్రాహ్మణులు 12 మంది, రెడ్డి కులజులు 6గురు, విశ్వకర్మలు ముగ్గురు, సాలెకులస్థులు ముగ్గురు, వైష్ణవ బ్రాహ్మణులు ముగ్గురు, బలిజ వారు ముగ్గురు, మహమ్మదీయులు ఇద్దరు, వైశ్యులు ఒక్కరు, చౌదరులు ఒక్కరు, పిళ్లైలు ఒక్కరు, హరిజనులొక్కరు, రచయిత్రులిద్దరు గలరు. యక్షగానములందు గూడ రచయిత్రులు గలరు.

**రామాయణముల పేర్లు :—**

మోక్షగుండ రామాయణం యదార్థ రామాయణం సంగీతానంద

రామాయణం నరహరి రామాయణం నవకోసల రామాయణం రామ లీలా యనము.

రామాయణము రచించిన కవులు :—

తాళ్లూరి నారాయణకవి, ఆదిభట్ల నారాయణదాసు, కోసూరి భోగలింగ దాసు, మైనంపాటి నరిసింగరావు భాగవతార్, రామపుత్రి, పాతూరి మధు సూదన శాస్త్రి మరియు అయ్యగారి వీరభద్రరావు, బొమ్మరాజు శీతారామయ్య, సాధు సాంబయ్య.

మహాభారతం రచించిన వారు :—

పరిమి సుబ్రహ్మణ్య భాగవతార్, ములుకుట్ల పున్నయ్యశాస్త్రి, భాగ వతార్, పెద్దింటి సూర్యనారాయణ దీక్షితులు, నల్లమల్లి బసివిరెడ్డి, కడలి వీరదాసు, భాగవతమును రచించిన వారు పరిమి సుబ్రహ్మణ్యం గారు రామాయణం వేంకట నరిసింహ కవి.

జైమిని భారతం: పత్తిగొడుగు రాఘవరాజు ములుకుట్ల పున్నయ్య శాస్త్రి, శివచరిత్రను కొమ్మూరి బాలబ్రహ్మానందంగారు రచించియున్నారు.

ఇంకనూ ఆంధ్రదేశమున గ్రంథాలయములందు అనేక హరికథా రచనలు గలవు. వానినన్నింటిని పరిశీలించి ఈ గ్రంథమున వివరించుట దుస్సాధ్యము. అయిననూ ఆంధ్రమున ప్రఖ్యాతి వహించి ప్రచారములో నున్న గ్రంథములనన్నింటిని పరిశీలించి యుంటిని.

ఈ హరికథా గ్రంథముల ప్రచారమునకు తోడ్పడిన ప్రకటన కర్తలు.

కురుకూరి సుబ్బారావు, సరస్వతీ బుక్ డిపో,
—విజయవాడ

కొండపల్లి వీరవెంకయ్య & సన్సు, సత్యనారాయణ
బుక్ డిపో. —రాజమండ్రి

శాళహస్తి తమ్మారావు సన్సు సంస్కృతాంధ్ర
బుక్ డిపో. —రాజమండ్రి

సుందరరాం అండు సన్సు. —తెనాలి

జైహింద్ బుక్ డిపో. —వేటపాలెం

వెంకటేశ్వర అండ్ కో., —గుంటూరు

గట్టుపల్లి శేషాచార్యులు, శశిలేఖ ఆఫీసు
—మద్రాసు

మొదలైనవి:—

సంగీతము విష్ణుపరము. సాహిత్యము విధాత పరము. నాట్యము శివుని పరము, ఈ మూటికలయిక యైన హరికథ త్రిమూర్త్యాత్మకము ఇట్టి హరికథను చెప్పువాడు మహాపవిత్రుడు. కానీ ఇది ప్రాతకొత్తల సంఘర్షణ కాలము.

ప్రపంచము నేడు యౌవనదశలో నున్నది. ప్రాక్పాశ్చాత్య నాగరికతలు మిశితములగుచున్నవి. ప్రపంచమే ఒక కుటుంబమగుచున్నది. మానవునకు క్రొత్తరుచులపై మోజు హెచ్చినది. కళలు సంకరములయినవి సంకరసృష్టి యుత్పన్నమగుచున్నది.

ఈ సంఘర్షణలో పవిత్రుడైన హరిదాసు ప్రక్కకొదిగియున్నాడు పాపం! ఏంజేస్తాడు మరి! ఇహ సౌఖ్యమశాశ్వితం. ఆశపడకంటే యువకునికి కోపం. ఆయువు స్వల్పం. ఆనందమనుభవించు అంటే ముదుసలికి తాపం.

సర్వం సమాప్తం

మంగళం.



# రచనకు తోడ్పడిన గ్రంథాలయములు.

| | | |
|---|---|---|
| వర్ధమాన సమాజ గ్రంథాలయము | — | నెల్లూరు |
| స్టేట్ లైబ్రరీ | — | గుంటూరు |
| సంస్కృత కళాశాల గ్రంథాలయము | — | కొవ్వూరు |
| సారస్వత నికేతన గ్రంథాలయము | — | వేటపాలెము |
| డిష్ట్రిక్టు లోకల్ లైబ్రరీ | — | నెల్లూరు |

**తోడ్పడిన గ్రంథములు:—**

గ్రంథ పరిశీలన శీర్షికలో తెలుపబడిన హరికథ, యక్షగాన గ్రంథములు

1 దాసభారతి ప్రచురణ-4 సంపాదకుడు.
- ఓరుగంటి నీలకంఠ శాస్త్రి

2 ఆదిభట్ట నారాయణదాస చరిత్రము.
- M. V. R. కృష్ణశర్మ.

3 ఆదిభట్ట నారాయణదాస సారస్వత సమీక్ష నీరాజనము
సంపాదకుడు- S. V. జోగారావు,

4 ఆంధ్రపత్రిక స్వర్ణోత్సవ సంచిక 1964—65

5 తెలుగు సాహిత్యములో దేశభక్తి - R. V. S. సుందరం.

6 ఆంధ్ర విజ్ఞాన సర్వసము - తెలుగు భాషాసమితి.

7 ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము - బాలాంత్రపు రజనీ కాంతారావు.

8 హరికథల కేటలాగు - వేటపాలెం గ్రంధాలయము.

9 హరికథల కేటలాగు - వర్ధమాన సమాజ గ్రంధాలయము నెల్లూరు.

10 విద్యార్ధి కల్పతరువు - ముసునూరు వెంకటశాస్త్రీ.

11 ఆంధ్రవాఙ్మయ చరిత్ర - దివాకర్ల వేంకటావధాని, కాశీనాధుని నాగేశ్వరరావు.

12 వాఙ్మయ వ్యాసమంజరి - నేలటూరి వెంకటరమణయ్య.

13 ఉదాహరణ వాఙ్మయచరిత్ర - నిడుదవోలు వేంకటరావు.

14 నాట్యశాల వ్యాసపంపుటి - శ్రీనివాసచక్రవర్తి.

15 యక్షగాన వాఙ్మయము - S. V. జోగారావు.

16 భక్తసింగరిదాసు చరిత్ర - అనుభవానందస్వామి.

17 గాంధర్వవాణి - రమామోహిని.

18 తూము నృసింహదాసు జీవిత చరిత్ర - తూము సీతారామయ్య.

## గ మ నిం ప ద గి న కా ల ప ట్టి క

| | | | |
|---|---|---|---|
| క్రీ. శ. | 1170-1220 | - | పాలకురికి సోమనాధుడు. |
| ,, | 1390-1440 | - | పిడుపర్తి నిమ్మనాధుడు. |
| ,, | 1405-1470 | - | బమ్మెర పోతన. |
| ,, | 1430 | - | శ్రీనాధుడు. |
| ,, | 15వ శతాబ్దము | - | చెన్నశౌరి. |
| ,, | 16వ శతాబ్దము చివర | - | గోపన్న (రామదాసు) |
| ,, | 1620 | - | కందుకూరి రుద్రకవి. |
| ,, | 17వ శతాబ్దము | - | సిద్ధేంద్రుడు. |
| ,, | 1729-1790 | - | గోకులపాటి కూర్మనాధుడు. |
| ,, | 1760 | - | మునిపల్లె సుబ్రహ్మణ్య కవి. |
| ,, | 18వ శతాబ్దము | - | త్యాగరాజు. |
| ,, | 19వ శతాబ్దము మొదలు | - | వరదరామదాసు<br>తూము నృసింహదాసు. |
| ,, | 16వ శతాబ్దము | - | ఆంధ్రలో యక్షగాన వ్యాప్తి. |
| ,, | 17 ,, | - | తమిళములో యక్షగాన వ్యాప్తి. |
| ,, | 19 ,, | - | తెలంగాణమున యక్షగానవ్యాప్తి. |

# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 23 | పోడుగబా | పోడుగదా |
| 9 | 9 | కృష్ణసూ | కృష్ణమా |
| 10 | 18 | శోరికను | కోరికను |
| 11 | 6 | గలరు | గలదు |
| 12 | 15 | యక్షగాపములు | యక్షగానములు |
| 13 | 12 | ప్రవక్తి | ప్రసక్తి |
| 16 | 21 | ప్రత్యష | ప్రత్యక్ష |
| 18 | 12 | కానవచ్చు | కావచ్చు |
| 30 | 19 | గాడు | గారు |
| 31 | 15 | శృగార | శృంగార |
| 32 | 12 | జూటపు | జూదపు |
| 34 | 2 | ధచళము | ధవళము |
| 40 | 13 | ప్రస్తుము | ప్రస్తుతము |
| 46 | 14 | దాశ | దాశ |
| | 18 | సీరుకాని | సీరుకావి |
| 47 | 7 | గరువ | గరుప |
| 51 | 11 | గవాడె | గలవాడె |
| 53 | 22 | వెంజట | వేంకట |
| 54 | 4 | దెలివి | దెలిపి |
| | 4 | పండతాధ్యుల | పండితారాధ్యుల |
| 55 | 7 | నమత్కృతి | చమత్కృతి |
| 60 | 13 | వంనపాట | వంతపాట |
| 66 | 1 | వనన | వచన |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 67 | 19 | హరికఫల | హరికథల |
| | 21 | కౌశాల | కౌశల |
| 68 | 7 | ఆసీసులు | ఆసీనులు |
| | 9 | నెల్లూ | నెల్లూరు |
| 70 | 5 | బలివిరెడ్డి | బసివిరెడ్డి |
| | 8 | కౌసూరి | కోసూరి |
| | 16 | మాయూర | మయూర |
| 71 | 5 | అంధ్రకేసరి | ఆంధ్రకేసరి |
| | 7 | క్రిపుని | క్రిప్పు |
| | 13 | హస్యం | హాస్యం |
| | 20 | కాలకాలము | కాలవాలము |
| 72 | 22 | నగుటనే | నగుటచే |
| 74 | 22 | రాఘవదాజు | రాఘవరాజు |
| 75 | 1 | రచయితలరో | రచయితలలో |
| 76 | 15 | పెట్ను | పెట్టు |
| 79 | 1 | తెలువ | తెలుప |
| | 4 | సల్వేనిశత్వ | సర్వేవిశత్వ |
| | 6 | రామాయణణము | రామాయణము |
| | 18 | రాసూయణ | రామాయణ |
| 80 | 11 | గమ్మెట | గుమ్మెట |
| 81 | 1 | వీలులేలు | వీలులేదు |
| 83 | 11 | ఎరుకాలలింగి | ఎరుకాలసింగి |
| 84 | 7 | శిష్యుడనిన్న | శిష్యుడనిస్మి |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | 8 | ముసుసూరి | ముమనూరి |
| | 14 | ఆలభ్యము | అలభ్యము |
| 85 | 10 | అధునికము | ఆధునికము |
| 87 | 12 | ఋతుకుల | ఋతువుల |
| | 12 | మమంగళులు | సుమంగళులు |
| 89 | 8 | వేడునుదు | వేడుచును |
| 91 | 5 | లలంంరించి | అలంకరించి |
| | 6 | చున్నది | మన్నది |
| | 9 | సుగుణభతిని | సుగుణవతిని |
| 92 | 9 | తేడాచు | తేడాను |
| 93 | 4 | వేలరటూరు | మేరటూరు |
| 96 | 6 | గోచన్న | గోపన్న |
| 97 | 4 | వెంట | పెంట |
| 98 | 6 | తిరువగిరి | తిరునగరి |
| 99 | 11 | కొళ్ళవూడి | కొళ్ళపూడి |
| 100 | 8 | పోతూరి | పాతూరి |
| 103 | 18 | పింగరిగాసు | పింగరిదాసు |
| 105 | 2 | తిరుగలగ | తిరుగంగ |
| 115 | 9 | చేనెడ | చేసెద |
| | 13 | కవుతెల్లరకు | కవులెల్లరకు |
| | 15 | బ్రహో త్తర | బ్రహ్మోత్తర |
| 116 | 2 | శవి | శని |
| 117 | 21 | షష్ఠ్యసత | షష్ఠ్యంత |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 118 | 18 | గ్రంము | గ్రంధము |
| 120 | 8 | వృత్తము | ఇతివృత్తము |
| 124 | 7 | నీదాజనము | నీరాజనము |
| 127 | 21 | దీనసతత్వ | దనసతీత్వ |
| 181 | 18 | సభాపందన | సభావందన |
| 132 | 14 | రాసు | దాసు |
| | 15 | బోధలను | బాధలను |
| 133 | 8 | సూనృతమ్ము | సూనృతమ్మ |
| | 12 | ప్పీ | పీర |
| | 15 | గొట్టు | గొడ్డు |
| 134 | 6 | ద్రోకించు | ద్రొక్కించు |
| 136 | 9 | విశాఖచట్టణం | విశాఖపట్టణం |
| 140 | 10 | tot | rot |
| 141 | 20 | వరున | వరుస |
| 142 | 17 | వేదముల్పత్యము | వేదముల్పత్యము |
| | 20 | వారచజలేరు | వారచటలేరు |
| 147 | 6 | నినర్గంబు | నిసర్గంబు |
| 148 | 17 | వాండవుల్ | పాండవుల్ |
| 149 | 10 | వనుల | పనుల |
| | 21 | వరమయోగి | పరమయోగి |
| 151 | 7 | నమాయోచిత | సమయోచిత |
| 154 | 10 | ప్రవాంబు | ప్రవాహంబు |
| | 17 | honorable | honourable |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 155 | 18 | వినిత్ర | విచిత్ర |
| 158 | 9 | వెంకటగిది | వెంకటగిరి |
| 159 | 10 | రాజమండ్రి | ఏలూరు |
| 165 | 6 | ప్రమోగ | ప్రయోగ |
| | 16 | ఫలమింతుని | ఫలమింతని |
| 166 | 19 | నిరుపసూనమై | నిరుపమానమై |
| 170 | 16 | వంశావళి | వంశావళి |
| 172 | 9 | కాలమైగను | కాలమైనను |
| | 20 | పునర్ధూతము | పునర్ధ్యూతము |
| | 22 | వ్యాధోవదేశము | వ్యాధోపదేశము |
| 174 | 2 | ఈడర | ఈదర |
| 175 | 1 | రాజమండ్రి | ఏలూరు |
| | 9 | సుప్రహ్మణం | సుబ్రహ్మణ్యం |
| | 10 | వనుసదించితి | వనుసరించితి |
| | 17 | నొటిమాటలే | నోటిమాటలే |
| 176 | 3 | నద | పద |
| | 6 | భీష్మె విజయూము | భీష్మవిజయము |
| | 13 | శకటా | శకటా |
| 177 | 16 | నర్వుల | సర్వుల |
| 178 | 18 | గొన్నాళక్తుల | గొన్నాళక్తుల |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 184 | 9 | క్రివుని | క్రిప్పు |
| | 11 | ప్రపాదము | ప్రసాదము |
| | 17 | కరముదా | కరముగా |
| 185 | 7 | జేయుదిౖతై | జేయుటౖతై |
| 186 | 5 | నతరుణ | నతగుణ |
| | 6 | కష్ఠములతు | కష్టములకు |
| | 14 | అలు | అల |
| | 21 | సద్దర్మ | సద్ధర్మ |
| 190 | 20 | ముద్రింన | ముద్రింప |
| 193 | 19 | వనమర్థు | వసమర్థు |
| 195 | 18 | చేపట్టు | చేపట్టి |
| 201 | 17 | జాతివిత | జాతిపిత |

